# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 7 సంచిక : 12

ఆశ్వీయుజం - కార్తీకం

1885 శకం

అక్టోబరు : 1963

## విషయ సూచిక



సంవత్సరం చందా — రు. 3—00.

విడి ప్రతి రు. 0—25 నయాపైసలు.



పురాతన పర్షియాదేశపు వెండి ప్లేటు

[ చూ. వ్యాసం—పేజీ 10 ]



*ముఖచిత్రం :* మన జాతిపిత. మహాత్మాగాంధీ జయంత్యుత్సవాలు దేశవ్యాప్తంగా యీ నెల 2వ తేదీన జరిగాయి.

*రెండవ అట్ట :* అజంతా కుడ్యచిత్రం.

*మూడవ అట్ట :* చేపల వేటకై వేకువనే...



ఆర్యా!

ఆంధ్రప్రదేశ్-ఆగస్టు సంచిక యందినది. అందు తాము వ్రాసిన నా "ఛందోరీతులు" గ్రంథసమీక్షను జదివితిని. ఆ సమీక్షలో దమ సహృదయత సౌహార్ద గరిమ ప్రస్ఫురించుచున్నది. అందులకు నా కృతజ్ఞత దెల్పుకొనుచున్నాను.

ఇట్లు,

విద్వాన్ ఆర్. దొరస్వామిశర్మ ఎమ్. ఎ.,
తెలుగు పండిట్, హిందూ హైస్కూలు,
ట్రిప్లికేన్, మద్రాసు-5.

తాను సరసోదారముగా సంపాదించు చున్న 'ఆంధ్రప్రదేశ్' అంతకంతకూ కాలూని, నిలువద్రొక్కుకుంటూ విన్నాణాన్ని వెదజల్లుతూంది.

విద్వాన్ పి. శేషగిరిరావు బి. ఎ.
తెలుగు పండిట్ బి. హెచ్. స్కూలు,
సామర్లకోట.




అభివందనాలు. "ఆంధ్రప్రదేశ్" అందుతున్నది. సమర్థమైన తమ సంపాదకత్వంలో పత్రిక నిత్యనూతనంగా, సర్వాంగ సుందరంగా వివిధ విషయ విలసితమై ప్రచురింపబడుతున్నందులకు చాలా సంతోషం.

తమ

కరుణశ్రీ
జంధ్యాల పాపయ్యశాస్త్రి
ఆంధ్ర క్రిష్టియన్ కాలేజి,
గుంటూరు.

మీ మాసపత్రిక క్రొత్త పోకడలతో, కథలతో వెలువడుచుండడము సంతోషదాయకము. ఆగస్టు మాసపత్రిక చదువరులకు విజ్ఞానము, వికాసము కలిగించునట్టిదై యున్నది. ప్రత్యేకించి ముఖ్యమంత్రి డా॥ నీలం సంజీవరెడ్డిగారి లేఖ, మన రాష్ట్రము సాధించిన ప్రగతిని చిత్రించినది. చెప్పవలసిన దానిని ఉన్న దున్నట్లుగాను, క్లుప్తముగాను చెప్పడము వారి ప్రత్యేకత. వెలువడనున్న ప్రతులలో కూడ వారి సందేశానికై నిరీక్షించుతూ వుంటాము. ప్రచురించిన గేయాలు, వ్యాసములు, కథలు బోధనాత్మకముగాను, ఆకర్షవంతముగాను వున్నవి. మీ రచయిత లందరికి నా అభివందనములు.

ఇట్లు,

పి. ఓ. సత్యనారాయణరాజు,
యం. యల్. ఎ.
అధ్యక్షులు, పంచాయతి సమితి; కోస్గి
(కర్నూలు జిల్లా)

---

# రచయితలు

డాక్టర్ దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ., పిహెచ్.డి. తెలుగు రీడర్, ఉస్మానియా యూనివర్సిటీ, హైద్రాబాద్.

శ్రీ పి. వి. నరసింహారావు, న్యాయ, సమాచారశాఖల మంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైద్రాబాద్.

శ్రీమతి క. దివ్యజ్ఞాన సరోజినీదేవి, అశోకారోడ్, న్యూఢిల్లీ.

"కరుణశ్రీ" శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి, తెలుగు లెక్చరర్, ఏ. సి. కాలేజి, గుంటూరు.

శ్రీ కె. వి. భాస్కరరావు, పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్, హైద్రాబాద్.

శ్రీ సున్నం వీరరాజకవి, కవితాసమితి, పాపల్స్‌వీధి, విశాఖపట్టణం-1.

శ్రీ పెమ్మరాజు వెంకటరావు, ప్రత్యేక కార్యదర్శి ఎ. పి. సి. సి. హైదరాబాద్.

—కర్నల్ పి. ఎన్. లూథ్రా.

డాక్టర్ యస్వీ జోగారావు, తెలుగు లెక్చరర్, ఆంధ్రా యూనివర్సిటీ, వాల్తేర్.

శ్రీ బృందావనం రంగాచార్యులు, వై. ఆర్. హైస్కూలు, పరుచూరు, గుంటూరు జిల్లా.

శ్రీ తాళ్ళూరు నాగేశ్వరరావు, నన్నపనేనివారి లేన్, ఐతానగర్, తెనాలి.

శ్రీ ఆమంచర్ల గోపాలరావు, ఆల్ ఇండియా రేడియో, విజయవాడ.

శ్రీమతి అమృతా ప్రీతమ్, 25 హౌజ్ ఖాస్, న్యూఢిల్లీ.

శ్రీమతి డి. మంజులత, 8-5-957, నారాయణగుడా, హైద్రాబాద్-29.

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, అంబర్ పేట, హైదరాబాద్.

డాక్టర్ వేమిరెడ్డి రాజేశ్వరమ్మ, నీలోఫర్ హాస్పిటల్, హైద్రాబాద్.

"సస్యశ్రీ"

శ్రీ వాసిరాజు ప్రకాశం, బషీర్ బాగ్, హైదరాబాద్.

శ్రీ వేటూరి ఆనందమూర్తి, తెలుగు లెక్చరర్ సాయంకళాశాల, హైదరాబాద్.

శ్రీ పాతూరి ప్రసన్నం, c/o పి. పి. ఆంజనేయులు, సెంట్రల్ రైల్వే, పి. డబ్ల్యు. ఐ. ఆఫీస్, తాండూరు పోస్టు, హైద్రాబాద్.

గ్రంథసమీక్ష :

వాఙ్మయ మహోధ్యక్ష వడ్లమూడి గోపాలకృష్ణయ్య, ఎడిటర్ (తెలుగు) 'ఆంధ్రప్రదేశ్' హైదరాబాద్.

శ్రీ బాసాని సుదర్శనరెడ్డి, హైదరాబాద్.

# ముఖ్యమంత్రిలేఖ

*ప్రియమైన చదువరీ!*

కొంతకాలం క్రిందట ఒక లేఖలో, బంగారం కంట్రోలు నిబంధనలవల్ల వృత్తి కోల్పోయిన స్వర్ణకారులకు సత్వరంగా సహాయం అందజేయడానికై ప్రభుత్వం తీసుకుంటున్న, తీసుకొనదలచిన వివిధ చర్యలను గురించి నేను మీకు తెలియజేశాను. ఉద్యోగ నియామకాలలో ప్రాధాన్యత, పిల్లల విద్య మొదలైన విషయాలలో అనేక రాయితీలను వీరికి ఇదివరకే ఇవ్వడం జరిగింది అయితే స్వర్ణకారులలో వివిధ తరగతుల వారున్నారు. కొందరు ఒకరివద్ద కొలువుగా గాక స్వంతంగా పనిచేసుకుంటారు. ఇటువంటివారు వంశపారంపర్యంగా వస్తున్న వృత్తిపని పైననే పూర్తిగా ఆధారపడతారు. పోతే కొందరు పెద్ద పెద్ద స్వర్ణకారుల వద్ద, నగల వర్తకులవద్ద పనిచేస్తారు. బంగారం కంట్రోలు నిబంధనలనను సరించి కూడా 14 క్యారట్ల స్వచ్ఛతగల ఆభరణాలు తయారు చేయడం మొదలైన పనులు పెద్ద సంస్థలకు చాలా వుంటాయి కాబట్టి వీటిలో పనిచేసే స్వర్ణకారులు ఉపాధి కోల్పోరనే విషయం సుస్పష్టమే. అయితే స్వంతంగా పనిచేసుకునే స్వర్ణకారులకు సహాయం అవసరం. వారికి నిరంతరం పనివుండడానికై ప్రత్యామ్నాయ పనులు కల్పించడానికి మేము ప్రయత్నించాము. సహకార సంఘాలు నెలకొల్పుకోవలసిందిగా వారికి సూచించాము. ఇప్పుడు బంగారం కంట్రోలు పథకంలో మార్పులు ప్రకటించబడడంతో కేంద్ర ప్రభుత్వంనుంచి ఇటువంటి వారికి సహాయం చేకూరింది. ఇందుకు నాకు ఆనందంగా వుంది. స్వంతంగా పనిచేసుకునే స్వర్ణకారులకు, కొన్ని షరతులకు లోబడి, ప్రస్తుత బంగారు ఆభరణాలను 14 క్యారట్లకు మించిన అంతే స్వచ్ఛతగల ఆభరణాలుగా మార్చడానికి, నామమాత్రపు ఫీజు తీసుకొని లైసెన్సులు మంజూరు చేస్తారు. లైసెన్సు పొందిన వర్తకులు ఇచ్చే ఆర్డర్ల మేరకు తమ ఇండ్లలో బంగారం పని చేసుకునే స్వర్ణకారులకు కూడా, 14 క్యారట్ల వరకు పరిమిత పరిమాణంలో బంగారం (ప్రాథమిక) వుంచుకొని పనిచేసుకోవడానికి కూడా అనుమతి ఇస్తారు. ఈ చర్యలవల్ల, ఈ వృత్తి పనివారలకు చాలా మందికి తమ ప్రాచీన వృత్తిని తిరిగి కొనసాగించుకోవడానికి వీలు కలుగుతుంది. పోతే వీరి పునరావాసానికై దీర్ఘకాలిక చర్యలు తీసుకుంటున్నారు. మన రాష్ట్రంలో, స్వర్ణకారులకు సహాయం లభింపజేసే పథకాన్ని అమలు పరచడానికి చర్యలు తీసుకుంటున్నాం. ఈ పథకంపై నిర్ణయాలు త్వరలో ప్రకటించ బడతాయి.

నిర్బంధ డిపాజిటు పథకం* కూడా మార్పు చేయబడింది. ముఖ్యంగా ఇటీవల భూమిశిస్తులో పెరుగుదల ఏర్పడినందువల్ల అనేక తరగతుల వారు, ఈ పథకం భారమైనదిగా తలంచడం జరిగింది. ఇప్పుడు ఈ పథకంలో మార్పులు జరగడాన్ని వీరంతా హర్షిస్తారు. ఆదాయపు పన్ను చెల్లించే వారు తప్ప మిగిలిన వారందరికీ ఈ పథకం వర్తింపు మినహాయించ బడింది. ఆదాయపు పన్ను చెల్లించేవారి విషయంలో కూడా ఇది డిపాజిటు మాత్రమే. అయిదు సంవత్సరాల పిమ్మట డబ్బు వడ్డీతో సహా తిరిగి చెల్లించబడుతుంది ఈ మార్పువల్ల, మన రాష్ట్రంలో కూడా స్వచ్ఛంద పొదుపులలో పెద్ద పెరుగుదల ఏర్పడగలదని నేను విశ్వసిస్తున్నాను

'వెనుకబడిన తరగతులు' అనే మాట వాంఛనీయమైనది కాకపోయినప్పటికీ మన దేశంలో చాలా కాలంనుంచీ ఈ మాట వినడానికి అలవాటు పడ్డాం. మన ప్రజానీకంలో సమానతను సాధించాలని మనందరం అభిలషిస్తున్నప్పటికీ కలం పోటుతోనే దీనినుంచి విముక్తి పొందడానికి సాధ్యం కాదు మన జనాభాలో కొంతమంది ఇతరులతో పోల్చినప్పుడు వెనుకబడిన స్థితిలో వున్నారనే సత్యాన్ని అంగీకరించాలి. అటువంటి వారికి అనేక మార్గాల ద్వారా ప్రత్యేక సహాయం చేయాలి విద్య, ఉద్యోగం, గృహవసతి, తదితర సదుపాయాల విషయంలో రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు రెండూ కూడా ఈ విధంగా సహాయం చేస్తున్నాయి. అయితే నిజానికి వెనుకబడిన తనం అంటే ఏమిటి? ఈ వాదం ఇంకా అపరిష్కృతంగానే వుంది. బ్రిటిష్ పారిపాలన నుంచి మనకు సంక్రమించిన ఈ వర్గీకరణ యొక్క ప్రాతిపదికను, విధానాన్ని తక్షణమే మార్చలేకపోవడమే దీనికి కారణం. అయితే స్కాలర్ షిప్పుల మంజూరీకి ఇటీవల భారత ప్రభుత్వం వెనుకబడినతనానికి కులాన్ని గాక దారిద్ర్యాన్ని పరిగణనలోకి తీసుకుంటున్నదనే విషయాన్ని పేర్కొనవచ్చు. తల్లిదండ్రుల వార్షిక ఆదాయం రూ. 1,500 లకు లోపు వున్న పోస్టుమెట్రిక్ విద్యార్థులు, తల్లిదండ్రుల వార్షిక ఆదాయం రూ. 2,400 లకు లోపు వున్న మెడికల్, ఇంజనీరింగ్ విద్యార్థులు ఇప్పుడు ఎట్టి కుల ప్రసక్తి లేకుండా స్కాలర్ షిప్పులు పొందడానికి అర్హులవుతారు. ఈ విధానం, కులవిచక్షణ యొక్క దుష్ఫలితాలను నివారించ గలుగుతుంది. సమీకృత సమాజ స్థాపనకు దోహదం చేయగలుగుతుంది. ఈ విషయంలో రాష్ట్ర ప్రభుత్వం కూడా కొన్ని అభివృద్ధికరచర్యలు తీసుకుంటున్నది ఇప్పటివరకూ రాష్ట్రంలో నిమ్నజాతుల కొరకు ప్రత్యేకంగా హాస్టళ్ళను, నివేశన స్థలాలను సమకూరుస్తున్నాము. ఎడంగావుంచే ఇటువంటి ధోరణిని అరికట్టడానికి ఇప్పుడు మేము ఒక 'కాస్మపాలిటన్' హాస్టలును ప్రారంభిస్తున్నాము. దీనిలో 150 మందికి వసతి సౌకర్యాలు వుంటాయి. కాగా వీరిలో 'ఫార్వర్డ్' తరగతులనబడే కులాలకు చెందిన వారు 37 మంది వుంటారు కలిసిమెలిసి వుండడం ద్వారా ఈ రెండు వర్గాలకు చెందిన విద్యార్థులు ప్రయోజనం పొందడానికి వీలుగా ఈ పథకాన్ని క్రమంగా విస్తృతీకరించదలిచాము. కలిసిమెలిసి వుండడం వల్ల అస్పృశ్యతానివారణకు దోహదం చేకూరుతుంది.

సహాయం అవసరమైన తరగతుల వారికి కలుగచేసే ఎటువంటి

---

* రెండు పథకాలకు సంబంధించిన ప్రకటనల పూర్తి వివరాలు ఈ సంచికలో మరోచోట ప్రచురింప బడినవి. ( చూ. పేజీ 27 )

సహాయాన్నయినా శీఘ్రంగా, సమర్థంగా అందజేయాలి కాబట్టి సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు ఇప్పుడు పంచాయతీరాజ్ సంస్థల ద్వారా అమలు పరచబడుతున్నవి. విద్యార్థుల దృక్పథంతో చూసేట్లయితే స్కాలర్‌షిప్పులకు సంబంధించిన వ్యవహారాలను సత్వరమే పరిష్క రించడం చాలా అవసరం. అందుచేత రెసిడెన్షియల్, స్పెషల్ నాన్ రెసిడెన్షియల్ స్కాలర్ షిప్పులను మంజూరుచేసే అధికారాలను జిల్లా పరిషత్తులస్థాయీ సంఘాలకు సంక్ర మింప జేసే ప్రతిపాదనను ప్రభుత్వం పరిశీలిస్తున్నది ప్రస్తుతం ఈ అధికారాలు సాంఘిక సంక్షేమ డైరెక్టరేటుకు వున్నాయి.

ప్రస్తుత బస్సు రేట్లను రోడ్డు రవాణా కార్పొరేషను ఏ మాత్రం పెంచరాదని ప్రభుత్వం తన నిశ్చయాన్ని ఇటీవల ప్రకటించింది. దీనిని మీరు హర్షిస్తారనడంలో నాకు సందేహం లేదు.

అలాగని రోడ్డు రవాణా సంస్థ యెదుర్కొనే సమస్యలు ప్రభుత్వానికి తెలియదని అర్థం కాదు. వారు ఒక కోటి లోటువున్నదని తెలిపారు రేట్లలో మైలుకు ఒక న. పై. హెచ్చింపు ద్వారా దీనిని భర్తీచేయ వచ్చు. కాని ప్రభుత్వం మొత్తం అన్ని అంశాలను పరిశీలించవలె. ప్రస్తుత పరిస్థితులలో రేట్లను హెచ్చించవలదని ప్రజా సంస్థలు, లోకసభ సభ్యులు, శాసన సభ్యులు పెక్కు విజ్ఞప్తులు పంపారు. కాబట్టి మేము హెచ్చింపుకు విముఖులమై నష్టాన్ని భర్తీ చేసుకొందుకు రవాణా సంస్థకు వివిధ ప్రత్యామ్నాయ చర్యలను సూచించినాము పరిపాలనా నిర్వహణ ఖర్చులలో తగ్గింపు మున్నగు చర్యలు లోటును భర్తీ చేసుకొనుటకు తోడ్పడాలి. వారి పెట్టుబడి రూ 4.55 కోట్లపై జరిగే సంవత్సరానికి వడ్డీ చెల్లింపును కూడ ప్రభుత్వం వాయిదా వేసినది.

అయితే ఈ సమస్య మన జాతీయకరణ విధానానికి మాత్రం యే విధంగాను అడ్డురాదు కర్నూలు జిల్లాలోని బస్సు మార్గాలన్నీ వచ్చే నాలుగు నెలలూ ఆ ప్రాంతంలో జాతీయం చేయబడగలవు.

మన రాష్ట్రంలో రైతులు యెక్కువ పండించడానికి వీలుగా వారికి యితోధిక సౌకర్యాలను కలిగించవలెననే ఆలోచన మా మనస్సులో యెప్పుడూ వున్నది ప్రభుత్వం యిప్పుడు వారికి మరొక సౌకర్యం కలిగించ నిశ్చయించుకొన్నది ఇంతవరకు జిల్లా విక్రయ సంఘాలకు అరువుగా రూ. 4 కోట్లు విలువగల రసాయన యెరువులను సరఫరా చేస్తున్నాం ఈ సంఘాలు రైతులకు యీ యెరువులను రొక్కానికి అమ్ముతాయి. కాని పెక్కురు పేద రైతులకు రొక్కం చెల్లించడం కష్టమవుతున్నందున, వారు గ్రామ సహకార సంఘాల నుంచి రూ. 200 ల వరకు పరపతిపై రసాయన యెరువులను పొందుటకు వీలు కల్పించవలెనని ప్రభుత్వం నిశ్చయించినది. ఇందుకు వారు తమ పంటను హామీనిచ్చి, వ్యక్తిగతంగా బాండును యివ్వాలి. గ్రామ సహకార సంఘాలు యిచ్చే యీ అప్పుకు ప్రభుత్వం హామీ వుంటుంది. భారతదేశంలో మరే రాష్ట్రము యింతవరకు రైతులకు యిటువంటి సౌకర్యం కలిగించినదని నేను అనుకోను.

మనది బియ్యం మిగులు రాష్ట్రమైనందున, రక్షక నిల్వల సేకరణకు సంబంధించినంతవరకు మనకు నిరంతరాయమైన బాధ్యత వున్నది. మొత్తం దేశావసరాల తీర్మానానికై ప్రస్తుతం మన దేశం బియ్యాన్ని కూడా దిగుమతి చేసుకొంటున్న విషయం మీకు తెలిసినదే. పి. ఎల్. 480 కార్యక్రమం క్రింద బియ్యం దిగుమతికై అమెరికాతో చేసుకున్న ఒప్పందం వచ్చే సంవత్సరం మధ్యలో ఆఖరై పోతుంది. దాదాపు 20 లక్షల టన్నుల రక్షక నిల్వలను సేకరించాలని కేంద్ర ప్రభుత్వం యత్నం. ఇందు నిమిత్తం మన రాష్ట్రం సహజంగా పెద్ద కోటాను యివ్వవలసి వున్నది. ఈ విషయంలో రైతులు, మిల్లర్లు సర్వవిధాలా సహకరిస్తారని నాకు తెలుసు. ఈ విషయంలో మన అధికారులు కేంద్ర ప్రభుత్వంతో సంప్రదింపులు జరుపుతున్నారు. త్వరలోనే సంతృప్తి కరమైన నిర్ణయం జరుగగలదు.

ఇంతకుముందు యీ లేఖలలో ఒక దానిలో నే నిదివరకే పేర్కొన్నట్టు, తృతీయ ప్రణాళిక ముగిసే లోపల ప్రతి ఒక్క గ్రామానికి రక్షిత నీటి సరఫరాను అందచేయ వలెనని ప్రభుత్వం సంకల్పించింది ఇది ఒక్క ఆరోగ్యాభివృద్ధికే కాక కేవలం జీవించడానికి కూడ అవసరమే మన గ్రామాలకు చాల అవసరాలున్నా, యిది మిక్కిలి ముఖ్యమైనదని సానుభూతి కలవా రెవరికైనా అనిపిస్తుంది. ఎవరికి వారు బావులు త్రవ్వుకొన వలెనని ధారాళంగా అప్పులు, సబ్సిడీలు యిచ్చి ప్రభుత్వం యిదివరకే ప్రోత్సాహమిస్తున్నది కాని స్వంతంగా బావులు త్రవ్వుకొనలేనివారు పెక్కురు సమిష్టి బావులపై ఆధారపడవలసి వుంటుంది కాని కొన్ని సందర్భాలలో యీ బావులను చెరువులవలె వాడి పాడు చేయడం అక్కడ నారి పుండు క్రిములు వృద్ధిచెందడం జరుగుతుంది. మెట్ట ప్రదేశాలలో నూరు అడుగులు త్రవ్వినా నీరు పూరనందున, అక్కడ బావులు త్రవ్వడ మొక పెద్ద సమస్య. దొరువులలో వాన నీటిని నిలవచేస్తారు. గొట్టాలు, కొళాయిల ద్వారా నీటిని పొందాలనే ప్రతిపాదన వున్నది కాని దీనికి ఖర్చు అధికముగాన యిది సులభంగా నెరవేరక పోవచ్చు. ఏది యేమైనా ప్రణాళికాంతానికి లక్ష్యాన్ని సాధించుటకై సాధ్యమైన సకల చర్యలు పరిశీలింపబడుతున్నవి.

జై హింద్

భవదీయుడు,

నీలం సంజీవరెడ్డి

# బాపుజీ !

దివాకర్ల వేంకటావధాని

భారతమాత గర్భమను పావనశుక్తి నపూర్వ కాంతి వి
స్తారమనోజ్ఞ మౌక్తిక వితానము సంభవమందె నందులో
సారమతి ప్రభావిమల సద్గుణ పుంజములన్ మెఱుంగులన్
ధారుణి ముంచితేల్చిన యనర్ఘ మహామణి వీవు బాపుజీ ! ॥

నీ వుదయించినట్టి మహనీయ ముహూర్తము భారతీయ సు
శ్రీవియదధ్వమందుఁ బొలిచె న్నవభాను మహోదయాభమై
పావన తద్రుచిస్ఫురణఁ బ్రాకిన దాస్యతమస్సు విచ్చి మో
దావహ రాగ రేఖలు దిగంతములన్ విలసిల్లెఁ బెల్లుగా ॥

అమృతమరీచి పుట్టువున నంబుధియట్టులు, త్యాగమూర్తి గౌ
తము జని శాక్యవంశము విదంబున, రామమహీంద్రు పుణ్య జ
న్మమున నినాన్వయంబటులు, మాన్య చరిత్రుఁడవైన నీదు జ
న్మము విభవంబుచే భరతమాత ప్రశస్తి వహించె గాంధిజీ ॥

ఎనగనరాని త్యాగము, సహిష్ణుత, యన్యహితానురక్తి, స
త్యనిరతి, బ్రహ్మచర్యము, నితాంతసమత్వము, దీనమానవా
వన పరతంత్రతాగరిమ, భక్తియుఁ గల్గినధీరు నిన్గనుం
గొనుట మహాత్మ శబ్దమునకుం గల యర్థ మెఱింగె లోకముల్ ॥

పసినిసుంగులు కూడఁ బరియింతు రెవ్వని
దివ్యనామము మహోద్రిక్తులగుచు
ఘోరవైరులు కూడఁ బేరుకొంద్రెవ్వని
యనితర ప్రాప్య సద్గుణ గణమ్ము
పరమమౌనులు కూడఁ బడయ లే రెవ్వని
బ్రహ్మచర్య వ్రతాప్రతిమ దీక్ష
అల గౌతమునికూడ నలరించు నెవ్వని
సరిలేనిలసదహింసా పథమ్ము

మునులు రాజులుకూడ నెవ్వని కటాక్ష
వీక్షణామృత రుచులకై వేచి యుందు
రట్టి మహనీయమూర్తి మోహనుని నిన్నుఁ
బడసి ధన్యత్వ మందెను భారతాంబ ॥

తతదాస్యాంధతమో విలగ్నమయి వంతంబొందు దేశమ్ము దు
ర్గతి నీక్షించి కడుం బ్రయాసపడి యశ్రాంతంబు సర్వ ప్రజా
తతికిన్ మోదము చూఱలిచ్చెడి స్వతంత్రత్వ ప్రభం గూర్చి త
త్కృత మానందము పొందకే యరిగినా వేమందు నీ త్యాగితన్ ॥

చిక్కినమేనితోఁ గరుణ చిందెడి చూపులతో నహింసతో
మిక్కిలి శక్తిమంతులన మిత్రుల నుక్కడఁగించి భూమి న
ల్దిక్కులఁ జాటి తాత్మ బలతేజము లాయుధ దేహశక్తులన్
ధిక్కృతి చేయఁజాలునని ధీప్రతిభాజిత దేవదేశికా ! ॥

యోగులకెల్ల యోగియగు నూర్జితుఁడా హరి వేదసార గీ
తా గురుఁడయ్యె మున్నడపె దారుణ యుద్ధము రాజనీతితో,
భూగతరాజనీతి పరిపూర్ణుఁడవయ్యును నీవొ రక్త సం
యోగములేని నూత్నరణమున్నడపించితి తత్త్వబుద్ధితో ॥

మానవ మూర్తివై జనసమాజమునన్ విహరించి యుంట నీ
లోని యమర్త్యతావిభవ రూపణ చేయఁగఁజాలమైతి మో
మానిత మూర్తి ! నీగుణ సమాజము భావనచేయ నిప్పుడా
యానిమిష ప్రమాణము నవ్వలితత్త్వమవంచుఁ దోఁచెడిన్ ॥

ఆఫ్రికాఖండంబు నందుండి తత్రత్య
జనుల కానంద మీఁ జాలినావు
హరిజనావళి పొందు హైన్యమ్ము తొలఁగించి
యంచితస్థితి సంఘటించినావు
మహమదీయుల యెడ సహనంబు వహియించి
తృప్తి వారలకు సంధించినావు
సత్యమహింసయన్ చక్రద్వయమ్ముపై
జీవితరథ మేగఁ జేసినావు

జానకీజాని పదసరోజాతములను
మధుప మొనరించినావు నీ మానసంబు
దాస్యబంధంబు తొలఁగించి తల్లిఋణము
తీర్చినాఁడవు ధన్యమూర్తి ! మహాత్మ. ॥

భరత భూమికి స్వాతంత్ర్యవర మొసంగి
పరిఢవిల్లిన పరమ దేవతవుకాన
అమల భవదీయ పుణ్యజన్మాహ మగును
చైత్రనవమియు శ్రావణాష్టమియు మాకు. ॥

# విశేషాలు-వ్యాఖ్యలు

పి.వి.నరసింహారావు

## స మై క్య త

శ్రీరామనవమి, కృష్ణజయంతి పండుగల వలెనే గాంధీజయంతికూడా దేశప్రజ యావత్తూ చేసే పండుగలా, మన జాతీయ సాంప్రదాయంలో అంతర్భాగంగా అయిపోయింది. ఒకరోజు పూజలతోనో, ఉపవాసంతోనో గడిపివేసే పూర్వకాలపు పండుగల్లాంటిది కాదిది. దేశంలోని రాజకీయ, ఆర్థిక, సాంఘిక విధానాలకు విస్తరించివున్న గాంధీజీ ప్రబోధాల దృష్ట్యా సామాన్య మానవునకు ఉపయుక్తంగా వుండేటట్టు ప్రతి సంవత్సరం యీ గాంధీజయంతి ఉత్సవాలు చేయడం జరుగుతున్నది. మహాత్ముని పేరు సన్నిహితంగా వినబడుతున్న అనేక నిర్మాణాత్మకమైన పథకాలతోపాటు గత సంవత్సరం యిదే వారంలో జాతీయ సమైక్యతా ఉద్యమం ఒకటి ప్రారంభించబడింది. అది యీ సంవత్సరం కూడా నిర్వహించబడింది. దేశం ఎదుర్కొన్న పరిస్థితుల దృష్ట్యా అన్నివర్గాల ప్రజలకు జాతీయ సమైక్యతా సిద్ధాంతాలనూ, దేశాన్ని పటిష్టవంతం చేసే అవసరాన్నీ గుర్తింపజేసి ఆచరింపజేయడం చాలా అవసరం. ఈ కృషి సఫలీకృతం కావడానికి జాతీయ సమైక్యతా వుద్యమం చాలా వుపయోగపడుతుంది. నిర్మాణాత్మక కృషితో దేశమంతా, ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో, జాతీయ సమైక్యతా భావాన్ని మరింత అధికంగా విస్తరింప జేయాలి.

లోగడ ఈ శీర్షికక్రింద చర్చించినట్టుగా జాతీయ ఐకమత్యమూ, జాతీయ సమైక్యతా యీనాడు దేశరక్షణతో సన్నిహిత సంబంధం కలిగివున్నాయి. దేశరక్షణే మన ఆశయం. ఇది అత్యంత అవశ్యకమైనదీ, వెను వెంటనే పూర్తికావలసినదీనూ. ఈ ఆశయం నెరవేరితే ఒకవైపు సమైక్యత, మరోవైపు అభివృద్ధి-ఈ రెండింటి మీదా మన దృష్టిని కేంద్రీకరింప జేయవచ్చు. ఐకమత్యం వల్ల ఒక కార్యాన్ని నిర్వర్తించాలనే అభిప్రాయం కలుగుతుంది. ఆ అభిప్రాయంవల్ల సమైక్యత ఏర్పడుతుంది ఈ రెండింటినీ నిలబెట్టేది అభివృద్ధి. త్రివేణీ సంగమం యిది. ఈ విషయాన్ని ప్రజలు గుర్తించేటట్టు చేయాలి. గాంధీ జయంతి సందర్భంలో ఆత్మపరిశోధనవల్ల దేశం యావత్తూ యీ సత్యాన్ని గుర్తించ గలిగితే మహాత్ముని జ్ఞాపకమే మనల్ని ప్రగతి పథంలో ముందుకు తీసుకుపోగలదు.

## చైనాకు ఎదురు దెబ్బ

చైనా-రష్యాల వాగ్యుద్ధం రోజురోజుకు బలపడి, ఏ క్షణంలోనన్నా విషమ పరిస్థితికి దారితీయవచ్చు. ఈ మధ్యనే వెలువడిన ముఖ్య అధికార ప్రకటనలో చైనా గాని రష్యాతో 'శత్రుచర్య'లను యింకా కొనసాగిస్తూవుంటే చైనాకు ఎదురుదెబ్బతీయడం తథ్యమని రష్యా చైనాను హెచ్చరించింది.

ఈ శత్రు చర్యలలో, గత సంవత్సరం చైనా 6 వేల చ. మై. మేరకు తక్కువగాకుండా చేసిన సరిహద్దు అతిక్రమణలు కూడా వున్నాయి. చైనా సైన్యం, ప్రజలు 1960 సం. నుండి ఒక పద్ధతిలో రష్యా సరిహద్దును అతిక్రమిస్తూనే వున్నాయని రష్యా చెప్పుతున్నది.

15,000 మాటలు గల రష్యా ప్రభుత్వ ప్రకటనలో చాలా ఆసక్తికరమైన విషయం ఏమిటంటే యీ ప్రకటనలో,ఇండియా-చైనా వివాదం గురించి కూడా వుంది. ఇండియా-చైనా సరిహద్దు వివాదంలో తీవ్రతర పరిస్థితులను గూర్చి 1959 సం. లో రష్యా చైనాను ఏ విధంగా హెచ్చరించినదీ యిది వ్యక్తం చేస్తూ "హిమాలయాలలో ఇండియా-చైనా వివాదం శాంతి స్థాపనకు గొడ్డలిపెట్టయి, ఆసియాలోని సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తుల సమైక్యతకు భంగం కలిగించి, భారత దేశంలోని అభివృద్ధి శక్తుల ప్రగతికి అంతరాయం కావడం యీనాడు మనం చూడవచ్చు" అన్నది.

భారతదేశం రష్యా ఆయుధాలతో చైనాను ఎదుర్కోవడాన్ని గూర్చి చర్చిస్తూ "చైనాకు ఎక్కువగా సైనిక సహాయం రష్యానుండే లభిస్తున్నదన్న విషయం సువిదితం గనుక, చైనా వారు రష్యా ఆయుధాలతో ఇండియాపై దండెత్తుతున్నారని భారత ప్రభుత్వం ఆక్షేపిస్తే యీ తర్కాన్ని బట్టి భారతదేశం వాదంలోదే ఎక్కువ సత్యం వున్నదని అనవలసి వుంటుంది'' అని రష్యా ప్రకటన వ్యక్తం చేసింది.

ఇండియా–చైనా సరిహద్దు వివాదంలో చైనా యుద్ధానికి దారితీసి 1959 లో చైనా నాయకులు అంతర్జాతీయ ప్రతిష్ఠంభనను కలిగించడానికి కారకులయ్యారని రష్యా కమ్యూనిస్టు పార్టీ అధికార వార్తా పత్రిక "ప్రావ్దా" తన సంపాదకీయంలో వ్యక్తం చేసింది.

రష్యా తరచుగా వ్యక్తం చేస్తూ వచ్చిన యీ విషయాలన్నిటినీ పరిశీలించి చూస్తే చైనా ఈ సరిహద్దు వివాదాన్ని కేవలం సరిహద్దు సమస్యా పరిష్కారానికి వుపయోగించుకోవడం లేదని, యీ వివాదం దాని 'సామ్రాజ్య విస్తరణ కాంక్ష'కు ముడిపెట్టి వుందని తెలుస్తున్నది.

చైనా విషయంలో రష్యా దృక్పథంలో వచ్చిన యీ మార్పుకు భారత ప్రధాని నెహూ్రు, విదేశవ్యవహారాలపై పార్లమెంటు సలహా సంఘం సమావేశంలో తన హర్షాన్ని తెలియజేశారు. ఇండియా–చైనా వివాదంలో ఇండియా విధానాన్ని రష్యా సమర్థిస్తున్నదనడానికి యిది ఒక నిదర్శనం అని కూడా ఆయన అన్నారు.

పాక్షిక అణ్వస్త్ర పరీక్షల నిలుపుదల ఒప్పందం వల్లా, ఇటుపై అలీన రాజ్యాలు వహించే ప్రముఖపాత్రవల్లా శీతల యుద్ధ రాజకీయాలకు ఒక కొత్తస్వరూపంవచ్చింది. ఇప్పటికే తూర్పు, పశ్చిమ రాజ్యాల మధ్య సామరస్య విషయాలపై ఎక్కువ ఆసక్తిని చూపించడం జరిగింది. అంటే ఆశయాల విభేదాలను క్రమక్రమంగాసహజీవనం, సహకారాలు ప్రాతిపదికలుగా విశాల దృక్పథంతో తొలగించడం జరుగుతున్నది అన్నమాట. ప్రపంచంలో సగానికి పైగా ప్రజలు తమ ఉనికిలో అడుగుపొర జీవితాలలో దిగబడి పోయి నిట్టూర్పులు నిగుడిస్తూవుంటే వీరందరినీ ఆశయాల విభేదాలమధ్యకు తీసుకురావడం ఏమంత మంచిపని కాదు. చాలా దేశాలు యిటీవలే రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొందాయి. ఏ 'ఇజం' పరిధులలోకి రావడానికి కూడా వీలులేనంత వెనుకబడిపోయిన దేశాలు యివి. తమ స్వేచ్ఛను పరిరక్షించుకోవడం, తమ జీవన ప్రమాణాన్ని మెరుగు పరచుకోవడమే వీటి ధ్యేయం. సిద్ధాంత రూపేణాగాని, మరో రకంగా గాని యింకో యుద్ధానికి తుపాకీ మందును వీరికి అందించకపోతే అంతే చాలు, వీరు సుఖంగా వుండడానికి. ఈ దేశాలు ఏవీ ప్రపంచ సార్వభౌమత్వం సంపాదించాలని కలలు కనడం లేదు గనుక యివేవీ చైనా శీతల యుద్ధధోరణికి దానికి సహాయపడజాలవు. నిజమైన యుద్ధానికి అవసరమైనట్టే శీతల యుద్ధానికి కూడా దానిని నిరంతరం మండిస్తూ వుండడానికి రెండు గాని అంతకు ఎక్కువగాని వర్గాలు అవసరం. అమెరికా, రష్యాలతో సహా ఇంచుమించు ప్రపంచంలోని అన్నిదేశాలూ ఒక ఒప్పందానికి వచ్చి, ప్రపంచ ప్రతిష్ఠంభనను సడలించి, మరింత భావసామీప్యానికి ప్రయత్నాలు చేస్తూ ఒక వర్గంగా ఏర్పడ్డాయి. చైనా వచ్చి చేరుతుందో, తుడిచిపెట్టుకు పోతుందో ప్రపంచం అంతా యీనాడు వేచి చూస్తున్నది.

## చంద్రుణ్ణి చేరటానికి సమిష్టికృషి

మిత్రరాజ్య సమితి జనరల్ అసెంబ్లీలో ప్రసంగిస్తూ అమెరికా అధ్యక్షుడు కెన్నెడీ చంద్రుణ్ని చేరడానికి అమెరికా – రష్యాలు యిరుదేశాలూ కలిసి సమిష్టిగా కృషి చేయాలని సలహా యిచ్చారు. ఈ రెండు దేశాల మధ్య ఎన్నో విభేదాలు వున్నాయని, యీ రెండు శక్తులమధ్యా పోటీ అలా వుంటూనే వుండాలనీ ఆయన అన్నారు. "అయితే యీ పోటీ నాశనానికి కాకుండా నాయకత్వానికి, భయభ్రాంతుల్ని కలిగించడానికి కాకుండా విజయాన్ని సాధించడానికి వుండాలి" అని అన్నారు.

అంతరిక్ష ప్రయాణాలలో అనవసరపు ఖర్చును తగ్గించడానికి అమెరికా అధ్యక్షుడు సూచించిన సమిష్టి ప్రయత్నాలను రష్యాలాటీ వర్గాలు అభినందించినప్పటికీ అమెరికా నేషనల్ ఎయిరోనాటిక్స్, స్పేస్అడ్మినిస్ట్రేషన్ అధికారులు త్రోసిపుచ్చారు.

అభిప్రాయ భేదాలపై ఎక్కువగా ఆసక్తి చూపించకుండా, యీ విభేదాలను శాంతి మార్గంలో తొలగింపజేసే అవకాశాలమీద ఎక్కువ ఆసక్తి చూపించవలసిన బాధ్యత యీ రెండు అణ్వస్త్రరాజ్యాలమీదా వున్నదని కెన్నెడీ అన్నారు. శాంతి స్థాపన ఒక్క అగ్రరాజ్యాలమీదనే ఆధారపడిలేదని కూడా యీయన వ్యక్తం చేశారు. అమెరికా, రష్యాలు భావసామ్యానికి, ఒప్పందానికి వచ్చినప్పటికీ దేశాలమధ్య ప్రాంతీయ విభేదాలు, జాతి విభేదాలు, వలస విధానాలు తొలగించవలసిన అవసరంకూడా వుంది అన్నారు. సామరస్యంతో ఒక ఒప్పందానికి రావలసిన విషయాలను వారు యీ విధంగా వ్యక్తీకరించారు. (1) అజాగ్రత్తవల్ల గాని, తప్పుడు అంచనాల వల్లగాని యుద్ధం రాకుండా తగు చర్యలు తీసుకోవడం, (2) ఆకస్మిక దాడుల నుండి పరిరక్షించడం (3) అణ్వస్త్రాల సరఫరాపై ఆంక్షలువిధించి అణ్వస్త్ర ఆయుధాల జాతినే అడ్డగించి, వాటిని శాంతికాల ప్రయోజనాలకై వినియోగించి, తగినంత తనిఖీతో భూగర్భంలో అణ్వస్త్ర పరీక్షలను నిషేధించడం.

శీతల యుద్ధమేఘాలు విచ్ఛిత్తి చెంది దూరంగా విసిరివేయబడి సరికొత్త ఆశా కిరణాలతో, వెలుగుతో రాగరంజితమైన నవ్యభానోదయానికి యివి చిహ్నాలుగా అని పిస్తున్నాయి. ఈనాడు విభేదానికి దారితీసే

ఏ అభిప్రాయమన్నా — చివరకు సిద్ధాంతాల విభేదాలనైనా — అనాగరిక అభిప్రాయంగా భావించ బడుతున్నది. అభిప్రాయ భేదాలను తొలగించిన వెంటనే — కనీసం విభేదాలలో సామరస్యాన్ని సాధించినా — సహకారం, సమైక్యత, వాటంతట అవే బైటకొస్తాయి. ఒక వేళ మరో గ్రహాన్ని దేనినన్నా మన శ్రేయస్సుకు, ఉపయోగానికి అవసరపడేట్టు చేయడమేగాని జరిగితే బాగా శిథిలావస్థలో వున్న యీ భూఖండంగురించి యింతగా స్పర్ధలు, వైషమ్యాలను పెంచుకుని తగువులాడడంలో అర్థం కనుపించదు. అందువల్ల యితరగ్రహాలకై మరింత అధికంగా కృషి చేయడం అవసరం.

## ఏకరాజ్య ప్రభుత్వం

గతనెలలో ఢిల్లీలో అఖిలభారత ప్రపంచ ఫెడరిస్టుల సమావేశంలో ప్రసంగిస్తూ ప్రధానినెహ్రూ, అట్లీలు దేశాలమధ్య శాంతిని, సహకారాన్ని స్థాపించడానికి, మానవజాతిని రక్షించడానికి ఒకే ఒక మార్గం ప్రపంచానికంతటికీ ఒకే ఒక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడమేనని ఉద్ఘాటించారు.

ఈ ఆలోచన కేవలం ఒక ఎండమావి లాంటిది కాదని ప్రధానమంత్రి వ్యక్తం చేశారు. మొత్తంగా అణ్వస్త్రాలను నిషేధించడం జయప్రదమైతే దేశాలను అంటిపెట్టుకునివున్న భయం తొలగిపోవడం సాధ్యం కాగలదు. ఈ భయం తొలగిపోతే అంతర్జాతీయ రక్షక భటులతో ఒక ప్రపంచఅధికార సంస్థ ఏర్పాటు కావడానికి ఏ మాత్రం సందేహం వుండదు. కాని అట్టిపరిస్థితిలో ప్రతి దేశానికి అది ఆశించిన విధంగా తన సాంఘిక, ఆర్థిక విధానాలను రూపొందించుకొనే స్వాతంత్ర్యం వుండాలి. ఈ విధానాన్ని పూర్తిగా విజయవంతం చేయాలంటే అన్ని విధాలైన జాతివివక్షతలు, వలసవిధానాలను నిర్మూలించాలి. లోపాలు వున్నప్పటికీ ఒక్క మిత్రరాజ్య సమితే యీ బృహత్తర కార్యాన్ని చేపట్టకలదనిపిస్తున్నది. అణ్వస్త్ర నిషేధ ఒప్పందంతోపాటుగా యితరచర్యలు కూడా త్వరలోనే చేపట్టబడగలవని తమ ఆశాభావాన్ని ప్రధానినెహ్రూ వ్యక్తం చేశారు.

## హింసా చర్యలు

కచార్-తూర్పుపాకిస్తాన్ సరిహద్దునగల భారతీయ గ్రామాలపైన, తేయాకుతోటల పైన పాక్ సైన్యాలు యెడతెగని కాల్పులు ఆరంభించడంతో, పాకిస్తాను భారతదేశంపై ఆపకుండా బుద్ధిపూర్వకంగా సాగించేహింసా చర్యలు తూర్పువిభాగంలో తారస్థాయి నందుకొన్నవి. ఈ వింత కాల్పులు సరిహద్దు భూమిలో చిన్నచిన్న చీలికల విషయంలో తెగని వివాదాలకు సంబంధించినవనుట సుస్పష్టము. ప్రధానమంత్రి చెప్పినట్టు, వాటి విశిష్టత బహుతక్కువ ప్రాణనష్టం కలిగించుటలో ఉన్నది. ఇవి, అయిదురోజులపిమ్మట, వేపూర్‌లో యిరుపక్షాల సెక్టర్ కమాండర్ల సమావేశంతో నిలిచిపోయినవి. అంతవరకు లాతితిల్లా — దంబారీప్రాంతంలో రాత్రింబవళ్ళు పాకిస్తాను తుపాకులు ప్రేలుతూనే వున్నవి. ఇందువల్ల మొత్తంమీద నలుగురు భారతీయ కార్మికులు దెబ్బలుతిన్నారు. వీరిలో యిద్దరు మరణించారు. ఈ కాల్పుల మూలంగా దాదాపు 240 యెకరాలలో తేయాకు కోత నిలిపివేయబడింది.

సాధారణ కమాండింగ్ అధికారుల స్థాయిలో అక్టోబర్ నెలలో ఉభయ పక్షాల సమావేశం జరిగితే బాగుంటుందని యుద్ధ విరమణ సమావేశంలో భారతీయకమాండరు సూచించినాడట. కాని పాకిస్తాను కమాండరు అందుకు వాగ్దానం చేయలేక పోయినాడట.

పాకిస్తాను వైఖరులు, ముఖ్యంగా క్రిందటి యేడాది భారతదేశంపై చైనా దాడిజరిపినదాది భారతదేశాన్ని కంగారు పెట్టడానికే సర్వేసర్వత్రా ఉద్దేశింప బడుతున్నవి. భారత దేశం చిక్కులను ఆసరాగా తీసుకొని, ఒత్తిడి ద్వారా నేమి, పాశ్చాత్యరాజ్యాల పెంకి పిల్లగా వ్యవహరించియేమి అధికతమలాభాన్ని పొందవలెనని పాకిస్తాను నాయకుల ఆరాటం. కాని ఆ అవకాశం వారిచేతులనుంచి జారి పోతున్నది. నిజానికి అది అప్పుడేగతించిన విషయం అయిపోయినది. వారి అభినయం పెద్దరాజ్యాలకు కొంతకోపాన్ని, కావలసినంత వినోద కాలక్షేపాన్ని మాత్రమే కలుగ జేయగలిగినది. తూర్పుసరిహద్దున పాకిస్తాను సైన్యాలు జరిపిన కాల్పులు యెంత లక్ష్య రహితమైనవో యెంత ఆటవికమైనవో భారతదేశంపట్ల విద్వేషంతప్ప మరొకటి లేని పాకిస్తాను నాయకుల విదేశాంగవిధానం కూడ అంత లక్ష్యరహితము, ఆటవికమునై వున్నది. కాబట్టి యీ కాల్పులు ఒక ఉద్దేశానికి బాహ్యచిహ్నములేకాని నిజమైనవి గావు. ఏది యేమైనా తూర్పుసరిహద్దున స్వల్పమైన చికాకులకు దారితీసేవిషయాలను శాశ్వతంగా పరిష్కరించడం వాంఛనీయం వలె కనబడు తున్నది.

## గూఢచారి చర్యలు

కొత్తఢిల్లీలోని పాకిస్తాన్ హైకమిషన్ సిబ్బంది సభ్యులు ముగ్గురు అరెస్టు చేయబడ్డారు. వారితోపాటు ఒక భారతీయుడు కూడా అరెస్టు చేయబడ్డాడు. మిలిటరీ పత్రాలని చెప్పబడే కొన్ని కాగితాలను తిరిగియిమ్మని మొదటి ముగ్గురు యీ భారతీయుని అడుగుతుండగా యీ అరెస్టులు జరిగినవి. ఈ కాగితాలను యీ భారతీయుడు పాక్ వైమానిక సలహాదారుకు యిచ్చాడు. ఈ కాగితాలను పాకిస్తాన్ సిబ్బందికి అందించినట్టు తరువాత యితడు ఒప్పుకున్నాడు. ఈ అక్రమ వ్యవ

హారం తరువాత అందుకు సంబంధించిన వుద్యోగులను పాకిస్తాన్‌కు పిలిపించబడాలని భారతదేశం చెప్పింది తదనంతరం, పాకిస్తాన్ ప్రభుత్వం, గూఢచారిచర్యలు జరిపారనే ఆరోపణపై పాకిస్తానులోని భారతీయ హైకమిషన్ వైమానిక సలహాదారును, మరిముగ్గురు వుద్యోగులను బయటికి వెడలవడిచింది. అంతకుముందు కొన్ని రోజుల క్రితం, పాకిస్తాను ప్రభుత్వం తరపున గూఢచారి చర్యలు జరిపినందుకు కలకత్తాలో ముగ్గురు మనుషులు అరెస్టు చేయబడ్డారు. ముఖ్య నేరస్తుడు నేరాన్ని ఒప్పుకుంటూ ఒక ప్రకటన చేశాడు.

భారత దేశమంతటా పాకిస్తాను గూఢచారి చర్యలు మిక్కిలి చురుకుగా పనిచేస్తున్నవని యిప్పుడు సర్వత్రా నమ్మబడుతున్నది. నిజంగా వారు పెకింగ్ అధికారుల కళ్ళు, చెవులు అయి పనిచేస్తున్నారుట ప్రజలను ఆశ్చర్య చకితులను చేసినట్టు కనబడుతున్న యిది మరొక జరుగురు విషయం భారతదేశంలో పాకిస్తాను గూఢచారులు అసలుపని చేయకుండాచేయడం పూర్వమైనా కష్టసాధ్యమే అయితే యిప్పుడు యిందులో మరీ దారుణ మేమంటే పాకిస్తాను చైనాతో చేతులు కలపడం. ఈ కొత్తబెడదను యెదుర్కోడానికి ప్రభుత్వ చర్యతోపాటు ప్రజల అప్రమత్తతకూడా యెంతో అవసరం.

## పాకిస్తాను వార్తా పత్రికలపై నిర్బంధాలు

గడచిన నెల ఒక ఆర్డినెన్సు ద్వారా పాకిస్తానులో వార్తా పత్రికలపై తీవ్రమైన నిర్బంధాలు విధించబడినవి. నేషనల్ ప్రొవిన్షియల్ అసెంబ్లీలు లేక న్యాయస్థానాలలో జరిగిన కార్యక్రమాలను వాటి ప్రిసైడింగ్ ఆఫీసర్లు లేక ప్రధాన న్యాయమూర్తి అనుమతిలేనిదే వార్తా పత్రికలలో ప్రచురించకూడదు. వార్తల శీర్షికలు వాటిక్రింద ప్రచురించిన విషయంలో యేకీభవించనప్పుడు ధరావతు అడగడానికీ, లేక హెచ్చరిక చేయడానికీ లేక వార్తా పత్రిక ప్రచురణను నిలిపివేయడానికీ ప్రభుత్వానికి అధికారం వుంటుంది. ప్రభుత్వము లేక దాని తరఫు సంస్థలయొక్క పత్రికా ప్రకటనలు మొదలగువాటిని వార్తాపత్రికలు పూర్తిగా ప్రకటించాలి. వార్తాపత్రికల కంపెనీల రిజిస్టర్లను, వాటికివచ్చిన సొమ్మును తనిఖీ చేయడానికి ప్రభుత్వానికి అధికారం వుంటుంది.

వార్తా పత్రికలు పత్రికారచన, దేశభక్తి సూత్రాలకు" కట్టుబడి నడచుకొనేట్టు చేయటానికై యీ శాసనం చేయబడిందని ప్రభుత్వం ప్రకటించింది. కాని యిది దేశమంతటా పత్రికా రచయితలు విస్తృతమైన నిరసన ప్రదర్శనలు జరుపుటకు దారి తీసినది. తత్ఫలితంగా, ప్రెసిడెంటు యీ కొత్త శాసనాన్ని ఒకనెల ఆపి వుంచాడు.

ప్రజాస్వామ్యాన్ని అదుపులో పెట్టేచోట పత్రికా ప్రపంచాన్ని అదుపులో పెట్టవలెననే వాంఛ వుంచే యెంతమాత్రము ఆశ్చర్య పడనవసరం లేదు. ప్రజాస్వామ్యం కాని ప్రభుత్వానికీ, స్వాతంత్ర్యం గల వార్తా పత్రికలకూ పొత్తుకుదరటం కష్టం. చివరికి ఒకటి రెండవ దానికి అనుగుణంగా మారాలి. కాబట్టి కొత్తశాసనం తాత్కాలిక నిలుపుదల వలన అసలుసమస్య వాయిదా పడిందంతే. పరిపాలన సాగడానికి అత్యవసరమైతే తప్ప అట్టి నిర్బంధాలు రూపొందింపబడి వుండవు. ఈ ఆశయసిద్ధికై పరిపాలకులు యింకా సాధ్యమైనదంతా చేస్తారు. ఏ విధంగాను యీ పోరాటం అంతం కాలేదు.

## నేఫా పరాజయాల పరిశీలన

గత సంవత్సరం చైనా దండయాత్ర సమయంలో నేఫాలో మన సైన్యంపొందిన పరాజయాల కారణాల వివరాలను రక్షణ మంత్రి శ్రీ వై. బి. చవన్ లోకసభకు తెలియచేశారు. ఈ పరాజయాల పరిశీలన భావిలో మన లోపాలను సరిదిద్దుకొనుటకే తప్ప, యుద్ధంలో పాల్గొన్నవారి నేరాలను పట్టుకొనుటకు ఉద్దేశించబడలేదని ఆయన చెప్పారు. లోపాలను సరిదిద్దుటకు ప్రభుత్వం యీ నివేదిక వచ్చేవరకు ఆగలేదని కూడ ఆయన లోకసభకు తెలియచేశారు దర్యాప్తుకు యేర్పాట్లు జరిగినప్పుడే లోపాలను సరిదిద్దే చర్యకూడా ఆరంభించ బడింది. దర్యాప్తులో క్రింది అంశాల తాలూకు లోపాల పరిశీలన వుద్దేశించబడినదని ఆయన చెప్పారు

(1) శిక్షణ, (2) సాధన సంపత్తి, (3) కమాండ్ పద్ధతి, (4) సైన్యాల శరీర సౌష్ఠవం, (5) తమ క్రిందివారిచే పని చేయించుటకుఅన్నిస్థాయిలలోనుకమాండర్ల సామర్థ్యము. దర్యాప్తు అధికార్లు యుద్ధం వివిధాంశాలనుక్షుణ్ణంగాపరిశోధించి నిశ్చితాభిప్రాయానికి వచ్చారు. అయితే, దేశభద్రత దృష్ట్యా, ఆ నివేదికనే లోకసభకు అందివ్వజాలక పోతున్నానని ఆయనచెప్పారు.

మన ప్రాతిపదికశిక్షణ సౌష్ఠవంగా వున్నదనీ, మన సైనికులు పర్వత ప్రదేశాల పరిస్థితుల కనుగుణంగా మారారనీ యీ నివేదికవల్ల వెల్లడైనది. మన సైనికులకు శిక్షణ, వారు యుద్ధంచేయవలసిన ప్రదేశాన్ని దృష్టిలో పెట్టుకొని యివ్వబడలేదని అంగీకరించ బడింది. కాబట్టి వారిని దృఢతముల్ని చేయవలసిన అవసరం వుందని భావించబడింది. పెద్ద కమాండర్లకు పర్వతప్రాంత యుద్ధతంత్రం తెలియకపోతే లాభంవుండదు. కనుక ప్రస్తుతావసరం నాయకత్వ శిక్షణ.

(మిగతా 62వ పేజీలో)

# మెసపొటేమియన్ పర్షియన్ చిత్రకళలు

—క. దివ్యజ్ఞాన సరోజినీదేవి

మెసపొటేమియన్ పర్షియన్ చిత్రకళలు బహు ప్రాచీన చిత్రకళలు. ఈ రెండు చిత్ర కళలను ఈజిప్షియన్, గ్రీకు మొదలగు ప్రాచీన చిత్రకళలంత ఉన్నతమైనవి కాకపోయినప్పటికిని కొన్ని ప్రాచీన చిత్ర కళలపైనను కడకు బైజాన్ టైన్ చిత్ర కళపైనను కూడ కొంత ప్రభావము కలిగి యున్నవి.

మెసపొటేమియాలో క్రీ. పూ. అయిదు వేల సంవత్సరముల నాటికే కళ జనించినది. కానీ, నాడు మెసపొటేమియన్ చిత్రకళగా పేర్కొన బడుచున్న చిత్రకళ క్రీ. పూ. మూడు నాలుగు వేల సంవత్సరముల మధ్య కాలమున మృణ్మయ పాత్రలతో ఆరంభమైనదని చెప్పవచ్చును. వారి మృణ్మయ పాత్రలపై మొట్టమొదట నలుపు, ముదురు ఎరుపు వర్ణములతో రేఖా చిత్రములను చిత్రించెడివారు. కాని మూడు, నాలుగు వందల సంవత్సరముల పిమ్మట వారి మృణ్మయ పాత్రలపై కేవలము రేఖా చిత్రములనేకాక, మానవ, జంతు ప్రతిమలను, వృక్ష జాతులను కూడ నలుపు, కెంపు, ముదురు గోధుమ, లేత పలుపు వర్ణములలో చిత్రింపసాగిరి. ఆ నాటికే వారు మట్టితో నగ్నయువతీ ప్రతిమలను కూడ చేసెడివారు. ఈ విధముగా ఆరంభమైన చిత్రకళ క్రీ.పూ. రెండువేల సంవత్సరముల నాటికి బాగుగా అభివృద్ధి చెందినది. ఆనాటి చిత్రకళ కొంత వరకు ఈజిప్షియన్ చిత్ర కళతో సరితూగ గలదై ఉన్నది. కాని యీనాడు దురదృష్ట వశాత్తు ఈ మెసపొటేమియన్ చిత్రకళ చాలావరకు రూపుమాసి యుండుటచే దీనిని గురించి మన మెక్కువగా తెలుసుకొన లేకున్నాము

రాతిఫలకంపై చెక్కిన శిల్పం (అస్సీరియా, క్రీ. పూ. 8వ శతాబ్దం).



ఈ ప్రాచీన చిత్రకళలో ఈజిప్షియన్ చిత్రకళలో వలె సామాన్యజనుల చిత్ర ములకు స్థానములేదు. వారు మొట్ట మొదట ఎక్కువగా మత సంబంధమైన చిత్రములనే చిత్రించెడివారు. అటుపిమ్మట అసీరియన్ రాజుల కాలములో మెసపొటేమియన్ చిత్రములన్నియు ఆ రాజవంశీయుల కీర్తిని చాటుటకే చిత్రింపబడెడివి. అందుచేతనే ఆ రాజవంశీయుల నాశనముతో ఆ చిత్రకళ కూడ రూపురేకుండ మాసిపోయినది.

మెసపొటేమియన్ చిత్రకారులు రాజులను దృఢవంతులుగాను, బలవంతులుగాను చిత్రీకరించెడివారు. వారు జంతు పక్ష్యాదులను చిత్రించునప్పుడుసైతము అవి ఒండొంటితో పోరాడు కొంటున్నట్లో, అతి క్రూరముగా నున్నట్లో చిత్రించెడివారు. ఈ చిత్రకళలో నాజూకు తనముకన్న క్రూరత్వపు పాళ్ళే యెక్కువ. మరియు మానవ ప్రతిమలు సహజముగా నున్నప్పటి కిని భారరహితముగాను చలన రహితముగాను నుండెడివి.



హిస్పానోఫొయినీషియన్ చిత్రం క్రీ. పూ. 5వ శతాబ్దపు స్త్రీ మూర్తి.

సుమేరియన్ల కాలమునందు వారు మానవ ప్రతిమల నెప్పుడును కై మోడ్చి దేవునికి వందన మర్పించు చున్నట్లే చిత్రీకరించెడి వారు. వారా ప్రతిమలను సాధారణముగా దేవాలయములయందు దేవతా విగ్రహముల దగ్గరనుంచెడివారు. అందుచే ఆ ప్రతిమల ముఖములు గంభీరముగాను, అచంచలముగాను, నిర్వికారముగాను; శరీరములు చలన రహితముగాను నుండెడివి. మరియు వాటిని దేవతా విగ్రహముల దగ్గర ప్రతిష్ఠించెడి కారణము వలననే, వారు తమ మానవ ప్రతిమలందు శరీరముకన్నను ముఖమునకే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చెడివారు వారీ విధముగా ప్రతిమల శరీరముల కెక్కువ ప్రాముఖ్యత నివ్వక పోవుటకు మరియొక కారణము కూడ నున్నది మెసపొటేమియాలో శిల్పమునకు పనికివచ్చు రాళ్లెక్కువగా లేవు. వారితర దేశములనుండే ఈ పెద్ద రాళ్ళను దిగుమతి చేసుకొనెడివారు. అందుచేతనే ఆనాటి శిల్పులీ రాళ్ళపై ముందు ముఖమును బాగుగచెక్కి, అటుపిమ్మట మిగిలిన స్థలమునుబట్టి, ఆ రాళ్ళ ఆకృతులను బట్టి శరీరములను మలచెడివారు. అందుచే ఒకొక్కసారా ప్రతిమల ముఖములు సుందరముగాను, శరీరములు పొట్టిగా వెడల్పుగా వికృతముగాను నుండుట జరిగినది. పైన పేర్కొనబడిన కారణముచేతనే కాబోలు వారి లోహ ప్రతిమలెక్కువ సహజముగా నుండెడివి. వీరి జంతువుల ప్రతిమలు కూడ అతి సహజముగా నుండెడివి. దీనికి వారు జంతువులకిచ్చిన ప్రాముఖ్యతయే కారణమై యుండవచ్చును.

మెసపొటేమియన్, చిత్రకారులింకను ఎప్పుడును నిలుచున్న మానవ ప్రతిమలను, తలనుండి మోచేతులవరకు శంకువు ఆకృతిలోను, మిగిలిన కాళ్ళ భాగమును వర్తుల స్తంభాకారాకృతిలోను, కూర్చున్న ప్రతిమలను శంకువు ఆకృతిలోను చిత్రించెడివారు. మరియు వారు ఈజిప్షియనులవలె శరీరమును ముందువైపుననుండి, ముఖమును ప్రక్కనుండి చిత్రించెడివారు. అంతేకాక వారు ముఖమునందు ముక్కు, కళ్ళు, చెవులు మొదలగు ముఖ్య అవయవములను పెద్దవిగాను, నుదురు, గడ్డము మొదలగు నితర భాగములను అతి చిన్నవిగాను చిత్రించెడివారు.

నల్లరాయి, సున్నపురాయి, మొదలగు రాళ్ళతోను, ఒక విధమైన సీమసున్నముతోను, రాగి, కంచు, వెండి, బంగారు మొదలగు లోహములతోను కూడ ప్రతిమలను చేసెడివారు. ఈ మానవ ప్రతిమల నేత్రములను, కంటి గ్రుడ్డు భాగమును ఆలుచిప్పలతోను, కంటిపాప భాగమును వైఢూర్యము లేక నల్లసున్నపు రాతితోను పొదిగెడివ్వారు. జుట్టుకు నలుపువర్ణము పూసెడివారు. దేవతా ప్రతిమలు మానవ ప్రతిమల కన్న కొంచెము పెద్దవిగానుండి, అతి విశాల నేత్రములను, గడ్డమును, రెక్కలను కలిగి యుండెడివి. రాజులకు కూడ గడ్డములుండెడివి. ఇక జంతువుల ప్రతిమలు సాధారణముగా పులి, యెద్దు, మేక, దుప్పి, జింక, గొఱ్ఱెపోతు మొదలగు రూపములలో నుండెడివి. వారీ జంతువుల ప్రతిమలను కొన్నింటిని బంగారుతో గూడ చేసెడివారు. ఆ బంగారు మృగములకన్నులు వైఢూర్యములతోనో, దంతముతోనో పొదగబడెడివి.

మెసపొటేమియన్ శిల్పులెక్కువగా రాళ్ళపై చెక్కడపుపని చేసెడివారు. వారు మొట్టమొదట ఈజిప్షియనులవలె రాతి గోడలపై తమ చిత్రములను అడ్డముగా ఒకదానిక్రింద నొకటి యుండునట్లు వరుసగా చెక్కెడివారు. కాని యీ పద్ధతి అసీరియన్ రాజవంశస్థుడైన అషుర్‌నసిర్‌పాల్ చక్రవర్తి కాలమున కొద్దిగా మార్పు చెందినది.



రాణి 'సుబాద్' సమాధిలో దొరికిన వెండిబొమ్మ.

ఈ చక్రవర్తి సౌధములందు ఆకాలమున శిల్పులు చంద్రకాంతపు రాయిపై ఎంతో నైపుణ్యముతో జంతువుల వేట, చిత్రములు చెక్కి యున్నారు. ఇందలి జంతువుల ప్రతిమ లతి సహజముగా నున్నవి. ఈ చిత్రములందు పరుగుపెట్టుచున్న జంతువుల కండరపు కదలికలను సైతము మనము చూడగలము. 'కోర్సాబాద్' అందు మానవ శిరస్సుగల యిరువదియారు రాతిఎద్ల జతలు ఆనాటి శిల్పుల నైపుణ్యమునకు నిదర్శనములుగా నిలచియున్నవి. ఇంకను ఈ శిల్పులు కొన్ని కొన్ని సమయములందు మూడు నాలుగు సెంటిమీటర్ల స్థలములందు సైతము ఈ జంతురూపములను చక్కగా చెక్కెడివారు. ఆనాటి చిత్రకారులీ శిల్పములపై పూర్తిగానో, లేక కొలది మేరనో వర్ణములు పూసెడివారు. పూయుచో నెక్కువగా పసుపు, నీలిమ వర్ణములనే వాడెడివారు.

మైసీనియాకుచెందిన క్రీ. పూ. 13వ శతాబ్దపు సింహాల గేటు.



మెసపొటేమియన్ శిల్పులు రాతిముద్రలపైనను, రాతి పాత్రలపైనను కూడ చక్కగా మానవ, జంతు ప్రతిమలను చెక్కెడివారు. ఈ ప్రతిమలనేకాక, బ్రొకేట్ చిత్రములనెడి మరొకరకమైన చిత్రములను కూడ ఆనాటి ముద్రలపై చెక్కెడివారు. నాటి అక్కాటియన్ ముద్రలపై నగ్నయువకుడు పులిని చంపుతున్నట్లును, ఎనుముల కాహారమిచ్చుచున్నట్లును చెక్కబడి యున్నవి. మరియు ఆనాటి శిల్పులు రాతిపాత్రలపై వివిధ వర్ణముల రాళ్ళతో కూడ పొదిగెడివారు ఒక్కొక్కసారి ఆ పాత్ర వివిధ భాగములు వివిధ వర్ణముల రాళ్ళతో కూర్చబడెడివి. ఇట్టి రాతిపాత్రలను వారతి అపురూపముగా చూచుకొనెడి వారు. ఇవి సాధారణముగా దేవాలయములలోను, ధనవంతుల గృహములలోను మాత్రమే యుండెడివి.

వీరి చిత్రలేఖనము గుఱించి విభిన్న అభిప్రాయము లున్నవి. కొందరు వీరి చిత్రములు శిల్పములంత ఉన్నతమైనవి కావని అభిప్రాయపడుచున్నారు. నాటి చిత్రకారులెక్కువగా త్వరలో రూపుమాయగల యిటుకరాళ్ళ గోడలపైననే చిత్రించుటవలన మనమీనాటి చిత్రకళగురించి ఒక నిర్ణయమునకు వచ్చుటకు వీలులేదు. నేడు మిగిలియున్న కుడ్యచిత్రములు బహుస్వల్పములు. ఆ చిత్రకారులు మొట్టమొదట యిటుకగోడను దాదాపు 10. సె. మీ మందముగల మట్టి పొరతో గిలాబి చేసెడివారు. దానిపై టెంపరా పద్ధతిలో రేఖాచిత్రములను, జంతు మానవ ప్రతిమలను చిత్రించెడివారు. వీరు ప్రతిమల చిత్రీకరణలో ఎక్కువగా రేఖలను ఉపయోగించెడివారు ఈ ముఖ్య రేఖలను నలుపు వర్ణముతో గీసి మిగిలిన చిత్రభాగమును అనేక వర్ణములతో చక్కగా చిత్రించెడివారు. ఇట్టి కుడ్యచిత్రములతో వారు తమ

రాజ సౌధనముల నన్నిటిని అలంకరించెడి వారు. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క గోడంతా పూర్తిగా ఈ కుడ్యచిత్రములతో నింపబడెడిది. ఆనాటి చిత్రకారులు తమ కుడ్యచిత్రములందు వర్ణములనేగాక, వివిధ వర్ణములతో మెరిసే టైల్సును (Tiles)కూడ నుపయోగించెడివారు. ఈ టైల్సు సాధారణ ముగా తెలుపు, నీలము, పసుపువర్ణములతో నుండెడివి.

. మెసపొటేమియన్లు వాస్తు శాస్త్రమందు కూడ బహునేర్పరులు. కాని వారిదేశములో రాయి కరవగుటచే తమ దేవాలయములను, రాజసౌధములను ఎండబెట్టిన యిటుకతోనే కట్టెడివారు. అందుచేతనే నేడవి చాలా వరకు రూపుమాసినవి. వారు మొట్టమొదట తమగృహములను చక్కటి ఆకారములో రెల్లుగడ్డి కాడలతో కట్టెడివారు. వాటి వెలు పలివైపు మట్టితో చక్కగా అలికెడివారు. ఆ నాటికే వారు తమ కట్టడములందు స్తంభ ములను, గుమ్మటములను (Domes) ధను రాకృతి వంపులను (arches) విలువంపైన పైకప్పులను (Vaults) కూడ వుపయోగిం చెడివారు. ఇందు స్తంభములుయిటుకలతోను, రాగిరేకుతో కప్పబడిన తాటిచెట్టు బోదెల తోను నిర్మింపబడెడివి. ఈ కట్టడపు గోడలు సాధారణముగా యిటుకతోనే కట్టబడినప్ప టికి, అక్కడక్కడ మాత్రము ఒకొక్క గోడ పూర్తిగా సున్నపు రాతితోనో, చలువ రాతితోనో, స్టియటైట్, డోలరైట్ మొద లగు రాళ్ళతోనో నిర్మింపబడెడిది. ఈ కట్ట డములందు వాడబడిన యిటుకలు మొదట మామూలాకృతిలోనే వున్నప్పటికిని, కొంత కాలము పిమ్మట ఒకవైపు కొద్దిగా వంపు కలిగి యుండెడివి.

వీరి దేవాలయముల ప్రత్యేకత యేమన అవి చతురస్ర ఆకారములోనో, లేకసమకోణ చతురస్ర ఆకారములోనో పెద్దదిబ్బలవలె నిర్మింపబడెడివి. ఈ దిబ్బల వుపరితల ములు మెఱుగు పెట్టబడిన టైల్సుతో కప్ప బడెడివి. వీరి 'టవర్ ఆఫ్ బేబిల్' గుఱించి విననివారెవరూ వుండరేమో. ఇది ఎనిమిదంతస్థుల బురుజు. ఒకొక్క అంతస్థు ఒకొక్క వర్ణములో వుండెడిదట. ఇట్టి బురుజులు ప్రతి పట్టణములోను, అనేకరాజ సౌధములలోను వుండెడివన్న ఆనాటి వారికి వాస్తుశాస్త్రమందుగల నేర్పుకు మన మాశ్చర్య పడవలసినదే.

ఇంకను ఆనాటి శిల్పులీభవనముల రాతి గోడలపై అందముగా చెక్కడపుపని చేసెడి వారు. ఇక చిత్రకారులీ భవనముల మట్టితో కప్పబడిన యిటుక గోడలపై కుడ్యచిత్ర ముల చిత్రీకరణో, లేక చిత్రవర్ణపు పనియో (Mosaic) చేసెడివారు. వీరి చిత్రవర్ణపు పని బహుప్రయాసతో కూడినపనైనను చూచుట కతి రమ్యముగా నుండును. ఇది చేయు విధానమెట్టిదన్న యిటుక గోడలను మొదట తడిమట్టితో గిలాబచేసి అటుపిమ్మట ఆ తడి ఆరకముందే దానిలోకి పెన్సిలు మందమునుండు మట్టిమేకుల వంటి వానిని దగ్గరదగ్గరగా ఒక చక్కటి చిత్ర మొచ్చు నట్లు గుచ్చెడివారు. ఈ మేకులుముందు బంకమట్టి యిసుక మిశ్రమముతో చేసి కాల్చ బడెడివి. అటుపై ఆ మేకుల పైభాగములు నలుపు, ఎరుపు లేత పసుపు వర్ణములలో ముంచబడెడివి. ఇట్టి వర్ణపు మట్టిమేకులతో గోడలపై చక్కటి రేఖాచిత్రములు చిత్రింప బడెడివి. ఈ చిత్రవర్ణపు పనియందు వారు క్రీ. పూ నాలుగు వేల సంవత్సరములనాటికే బాగా నేర్పుగడించి యుండిరి. ఈ మట్టి మేకులతలలొకొక్కసారి పుష్పరూపములో కూడ వుండెడివి ఒకొక్క సారి వాటి తలలకు వివిధ వర్ణముల రాళ్ళను సైతము రాగి తీగెతోనో, మట్టితైలముతోనో (Bitumen) అతికించెడివారు ఇంకను ఆనాటివారు ఈ చిత్రవర్ణపు పనిని మరియొక విధముగా కూడ చేసెడివారు. స్తంభముల కుపయోగింపబడిన తాటిబోదెలపై మట్టి తైలముతో వివిధ వర్ణముల రాళ్ళను, ముత్యపు చిప్పలను చక్కటి రేఖాచిత్రము లేర్పడునట్లు అతికించెడి వారు. వారు గోడ లపై ఈ చిత్రవర్ణపు పనినేగాక ఒకొక్క ప్పుడు ముత్యపు చిప్పలతోనో, తెల్ల ఆలు చిప్పలతోనో, మట్టి, యిసుక మిశ్రమముతోనో, సున్నపు రాతితోనో చేయబడిన చదునైన చిన్నచిన్న పార్శ్వ ప్రతిమలను కూడా అతికించెడివారు. ఇవి కూడ దాదాపు క్రీ. పూ నాలుగువేల సంవత్సరములనాటికే వాడుకలో వుండెడివి. 'కిష్' అను ప్రదేశ ములో ఆలు చిప్పలతో చేయబడిన ఇట్టి ప్రతి మలను మొదట నల్లబలపపు రాతిలో పొదిగి ఆ పైగోడలకు తగిలించిన నిదర్శనములు కలవు ఈ విధముగా వారు తమ రాజభవన ములను, దేవాలయములను, మందిరములను చక్కగా అలంకరించెడి వారు.

క్రీ. పూ. మూడువేల సంవత్సరముల నాటికే మెసపొటేమియన్లు బంగారుతో నగలేగాక చక్కటి పాత్రలను, కవచములను కూడ చేసెటివారు. వారు వెండిపాత్రలపై కూడా చక్కటి జంతుపక్ష్యాదుల ప్రతిమలు చెక్కెడివారు. రాగితో చిన్న చిన్న ప్రతి మలను చేసెడివారు. ఈ ప్రతిమలను సాధా రణముగా వారు తమ గృహోపకరణము లందు వుపయోగించెడివారు. ఒక్కొక్క సారీప్రతిమలను ముందేదైన చౌక పదార్థముతో చేసి పైన రాగిరేకుతో కప్పెడి వారు వీరు రాగితో పరికరములు కూడ చేసెడివారు. వారికి రాగి కూడా ఖరీదైన లోహమగుటచే ఈ రాగి పరికర

ములు చాలా అరుదుగా నుండెడివి ఇంకను, వీరు తమ సింహాసనములను, మంచములను, బల్లలను దంతముతో పొదిగెడివారు. మరియు 'నిమరుద్' అను ప్రదేశములో కట్టడపు గోడొకటి పూర్తిగా ఈ దంతపు పలకలతో కప్పబడిన నిదర్శనములు కూడానున్నవి

ఇట్టి మెసపొటేమియన్ చిత్రకళ క్రీ. పూ. 7 వ శతాబ్దమునుండి నశింప నారంభించినది

మెసపొటేమియన్ చిత్రకళ వలెనె పర్షియన్ చిత్రకళ రాజుల ఆజ్ఞానువర్తినియై వుండెడిది. ఈ చిత్రకళ క్రీ. పూ. నాలుగు వేల సంవత్సరములకు ముందే ఎఱ్ఱ మృణ్మయ పాత్రలతో ఆరంభమైనను క్రీ. పూ. రెండు వేల సంవత్సరముల నాటికే అది పూర్తిగా అభివృద్ధి చెందినది.

ఈ నాడు పర్షియన్ చిత్రకళగా పేర్కొనబడుచున్న చిత్రకళ క్రీ. శ 15 వ శతాబ్దమునకు చెందినది. కాని అంతకుముందే అలరారిన ప్రాచీన పర్షియన్ చిత్రకళే యిక్కడ వివరింపబడినది. ఈ ప్రాచీన చిత్రకళ గ్రీకు చిత్రకళకు సమకాలికమే అయినను, యిది గ్రీకు ప్రభావమునకు లోబడక తన ప్రత్యేకతను నిలబెట్టుకొన్నది.

పర్షియనులు కూడ వాస్తు శాస్త్రమందు నేర్పరులే వారు తమ కట్టడములను రాతితో నిర్మించెడివారు. ఈ కట్టడములెప్పుడు నిర్ణీతపాళ్ళలోనే కట్టబడెడివి. వారి కిటికీల తలుపుల పొడుగు వెడల్పులెప్పుడు 1·2, 2:3, 3·5 నిష్పత్తులలోనే వుండెడివి. వారి కట్టడములందు స్తంభములు కూడ నెక్కువగానే వుపయోగపరచబడి యున్నవి. కొన్ని స్తంభములపై మానవ ప్రతిమలు, వృషభముల ప్రతిమలు చెక్కబడియున్నవి మరియు, వారి కట్టడములందలి, ద్వారబంధములపై గల రాళ్ళు పలువర్ణములతోను, బంగారు పూతతోను; గోడలు పింగాణీ పూతగల పెల్సుతోను చక్కగా అలంకరించబడి యున్నవి

పర్షియన్ శిల్పులు కంచుతో చిన్నచిన్న జట్టాగుట్టపు సామానును, రథములను కూడ చేసియున్నారు ఇవి బహుశ క్రీ. పూ రెండు వేల సంవత్సరముల నాటికిచెందినవై వుండవచ్చు.

వారు జంతువుల ప్రతిమలను చెక్కునప్పుడు తమ కల్పనా చాతుర్యము నుపయోగించి వివిధ రీతులలో చెక్కెడివారు. కొన్ని కొన్ని సమయములందు ఒక్క జంతువునే రెండు మూడు జంతువుల భాగములను సమన్వయించి చెక్కిన నిదర్శనములున్నవి.

ఈ నాటికినీ ఈ ప్రాచీన చిత్రకళగురించి లభ్యముకాని విషయము లనేకము లుండుటచే యింతకన్నను ఈ చిత్రకళ గురించి వివరముగా వ్రాయలేకుండ యున్నాను.

ఇట్టి మెసపొటేమియన్, ప్రాచీన పర్షియన్ చిత్రకళలు మరువలేని చిత్రకళలే అయినను, ఆ నాటి చక్రవర్తులకు తలొగ్గి పెంపొందుటచే నేడవి స్వేచ్ఛా ప్రియులైన ప్రజల కెంతవరకు నచ్చగలవన్నది మాత్రము సందేహాస్పదము. ★

# వెలుగు బాటలు

కె. వి. భాస్కరరావు

గత నెల చివరి వారంలో దేశమంతటా మశూచి నిర్మూలన వార్షికోత్సవం జరిగింది. దేశంలోని ఇతర ప్రాంతాలతో పాటు మన రాష్ట్రంలో ఈ కార్యక్రమం అన్ని హంగులతోను జరగడం విశేషం. సభలు, సమావేశాలు, చర్చాగోష్ఠులు, కరపత్రాలు, ప్రదర్శనలు, సినిమాలు మున్నగు వివిధ సాధనాల ద్వారా ఈ ఉద్యమ లక్ష్యాన్ని ప్రజలకు కొనిపోవడం జరిగింది మశూచివల్ల కలిగే దారుణ ఫలితాలను, దాని నిర్మూలనకు ప్రజలు వయోతారతమ్యం లేకుండా టీకాలు వేయించుకోవలసిన అవసరాన్ని గుర్తింపజేయడం ప్రధానాశయం.

ఈ వ్యాధికి భారతదేశం, పాకిస్థాన్ దేశాలు ముఖ్యంగా గురి అవుతున్నాయని నిపుణులు తెలియజేశారు. ప్రపంచమంతటిలోను ఈ వ్యాధివల్ల కలిగే హానిలో నూటికి 90 పాళ్ళు ఈ రెండు దేశాలకే సంభవిస్తోంది. 1958 లో సేకరించిన లెక్కల ప్రకారం ప్రపంచంలోని 2.46 లక్షల మంది మశూచి రోగులలోను 2 21 లక్షల మంది ఈ రెండు దేశాలలో వున్నట్లు తేలింది. దీనిని బట్టి మశూచి నిర్మూలనకు ప్రజల సహకారంతో ఎంతటి కృషైనా జరుగవలసివుంది. ఈ సందర్భంలో మశూచి నిర్మూలనకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తీసికుంటున్న చర్యలుగమనార్హమైనవి

మన దేశంలో మశూచి వ్యాధిని టీకాల ఉద్యమం ద్వారా రెండు సంవత్సరాలలో నిర్మూలించాలని తలపెట్టబడింది. మూడవ ప్రణాళికలో దేశమంతటికి సుమారు రు 7 కోట్ల ధనాన్ని ప్రణాళికా సమితి కేటాయించింది. రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్రం సహాయంతో మశూచి నిర్మూలనకు కృషి చేయవలసిందిగా కోరబడ్డాయి ఇందుకు అవసరమయ్యే సిబ్బంది ఇతర సాధనాలను తెలిసికొనేటందుకు ప్రతి రాష్ట్రంలోను 10 లక్షల ప్రజలకు వర్తించే ప్రయోగాత్మక పథకాలు చేపట్టబడ్డాయి ఇలాంటి పథకం మన రాష్ట్రంలోని పశ్చిమ గోదావరిజిల్లాలో, మొదట ప్రారంభింపబడింది. వివిధ రాష్ట్రాల కృషిని సమన్వయం చేసేటందుకు ఢిల్లీలో ఆరోగ్యశాఖ డిప్యూటీ డైరెక్టరు జనరల్ ఆధిపత్యాన ఒక విభాగం స్థాపింపబడింది ప్రపంచ ఆరోగ్య సంస్థ, మున్నగు అంతర్జాతీయ సంస్థలు కూడ ఈ కార్యక్రమానికి తోడ్పడుతున్నాయి

మన రాష్ట్రంలో ప్రజారోగ్యశాఖ డైరెక్టరు కార్యాలయంలో ప్రత్యేక విభాగం నెలకొల్పబడింది కార్యక్రమ నిర్వహణకు వివిధ పథకాలు 1962 ఏప్రిల్‌లో ప్రభుత్వానికి సమర్పించబడ్డాయి. ప్రభుత్వం స్థూలంగా ఈ పథకాలను ఆమోదించి మూడవప్రణాళికలో అమలు పరచడానికి నిశ్చయించింది. పశ్చిమ గోదావరిజిల్లాలో ప్రారంభింపబడిన పైలట్ పథకం జిల్లా అంతటికి వ్యాప్తి చేయబడింది దాదాపు 20 లక్షల జనాభా గల ఆజిల్లాలో కార్యక్రమం 1962 జనవరి నాటికి పూర్తి చేయబడింది తరువాత ఈ కార్యక్రమం కృష్ణాజిల్లాకు తరలించబడింది. హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలో కూడ మశూచి నిర్మూలన కార్యక్రమం 1962 ఆగస్టు నాటికి పూర్తయింది. 1962 సెప్టెంబరు నుండి హైదరాబాదు, నల్గొండ, తూర్పు గోదావరి, గుంటూరు, నెల్లూరుజిల్లాలలో ఒక్కొక్క విభాగం, ఏప్రిల్ 1963 నుండి మిగిలిన జిల్లాలలో ఒక్కొక్క విభాగం ప్రారంభింపబడ్డాయి. రాష్ట్రంలో ఈ కార్యక్రమం 1965 మార్చి నాటికి పూర్తి కాగలదు

ప్రతి జిల్లా విభాగానికి ప్రత్యేకంగా ఒక ఆరోగ్యాధికారి బాధ్యత వహిస్తారు ఆయనకు అవసరమైన సిబ్బంది, సామగ్రి యివ్వబడతాయి వైద్య పరికరాలేగాక ప్రచారం నిమిత్తం దృశ్య, శ్రవణ యంత్రాలు కూడ ప్రతి జిల్లా విభాగంలోనూ వుంటాయి. టీకాల మందు నిల్వ చేసేటందుకు తగిన పరికరాలను అమరుస్తారు టీకాలిచ్చే ప్రతి ఉద్యోగికీ ఈ మందును కొనిపోయేటందుకు తగిన సౌకర్యాలు కల్పించబడతాయి మశూచి నిర్మూలన కార్యక్రమాన్ని పంచాయతీ సమితులలో క్రమంగా అమలు పరుస్తారు ప్రతిజిల్లా విభాగాన్ని 5 ఉప విభాగాలుగా విభజిస్తారు ప్రతి ఉపవిభాగంలోను ఒక ఆరోగ్యాధికారి, 5 మంది హెల్తు అసిస్టెంట్లు, ఒకరిద్దరు ఎన్యూమరేటర్లు వుంటారు ప్రతిగ్రామంలోను జనాభాకు తగిన సిబ్బంది ఈ కార్యక్రమాన్ని చేపట్టి 3 లేక 4 రోజుల్లో పనిని పూర్తి చేస్తారు సిబ్బంది గ్రామాలను సందర్శించే ముందు ఆరోగ్య ప్రచారకులు ప్రజలలో ఈ కార్యక్రమం పట్ల తగిన ఆసక్తిని కల్గిస్తారు ఇలాంటి కార్యక్రమాలు ప్రజల

సంపూర్ణ సహకారం వల్లనే అమలు జరుగుతాయి. అందువల్ల ప్రజలు, ప్రజా ప్రతినిధులు ఈ ఉద్యమ నిర్వహణలో వీలైనంత అధికంగా భాగస్వాములు కావాలి. పంచాయతీల అధ్యక్షులు, సభ్యులు, పంచాయతీసమితి అధ్యక్షులు, సభ్యులు, జిల్లాపరిషత్తు సభ్యులు. జిల్లా ప్రజారోగ్యశాఖ, ఇతర శాఖలు అనధికార స్వచ్ఛంద సేవా సంస్థలు, పత్రికా ప్రతినిధులు మున్నగువారంతా తగు శ్రద్ధా సక్తులు చూపడంవల్ల మశూచి వ్యాధిని ఆశించిన కాలంలో నిర్మూలించవచ్చు. 1963 ఆగస్టు అంతానికి రాష్ట్రంలో సుమారు 75 లక్షల మందికి మశూచి నుండి రక్షణ కల్పించబడింది. మరో 236 లక్షల మందికి ఈ వ్యాధి సోకకుండ టీకాలు వేయవలసివుంది.

మశూచి అంటువ్యాధి అన్న విషయం అందరికీ తెలిసిందే ప్రతి వ్యక్తీ టీకాలు వేయించుకోవడంవల్ల ఈ వ్యాధిని పారద్రోలవచ్చు ఒకసారి టీకాలు వేయించుకొంటే 3 సంవత్సరాల వరకు మశూచి నిరోధక శక్తి వుంటుంది అందువల్ల టీకాల ప్రాముఖ్యాన్ని గ్రహించి ప్రతి వ్యక్తికీ నచ్చజెప్పడం ఎంతైనా అవసరం ఒక వ్యక్తి టీకాలు వేయించుకొనక పోవడంవల్ల తనకే గాక సంఘానికి కూడ హాని చేసినవాడౌతాడు.

టీకాలవల్ల ఒకటి రెండు రోజులు జ్వరం, నొప్పి మొదలైన పరిణామాలు రావచ్చు. అలా వచ్చిన వ్యక్తులలో మశూచి వ్యాధి నిరోధక శక్తి తగినంతగా లేదని గ్రహించాలి. ఒకసారి టీకాలు వేయించుకోవడంవల్ల నిరోధక శక్తి అతనిలో పెంపొంది మున్ముందు మశూచి బారినుండి కాపాడుతుంది. అందువల్ల తాత్కాలిక బాధను మనం సంతోషంగా భరించాలి. ఒకసారి మశూచి ఒక ప్రాంతంలో సోకిందంటే శర వేగంతో అది వ్యాపిస్తుంది అంగవైకల్యం, గ్రుడ్డితనం, చివరకు మరణం కూడ ఈ వ్యాధి వల్ల రావచ్చు ఈ అవాంతరాలతో పోల్చిచూస్తే టీకాలవల్ల కలిగే కొద్ది బాధ తప్పక భరించదగింది ప్రభుత్వం ఈనాడు ఇంటింటికీ సిబ్బందిని పంపి టీకాలు వేసే ఏర్పాటు చేస్తోంది. తల్లిదండ్రులేగాక, పిల్లలు, వృద్ధులు కూడ ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసికోవాలి.

మశూచి నిర్మూలన ఉద్యమానికి దేశంలో కోట్లకొలది ధనం వెచ్చింపబడుతోంది. ప్రజలు చెల్లిస్తున్న ధనమే ప్రజలకు సౌకర్యాల రూపంలో యిలా వినియోగింపబడుతోంది వ్యక్తి, కుటుంబం, సమాజం ఈ భయంకర వ్యాధి నుండి బయట పడటమేగాక ముందు తరాల వారు మశూచి పేరును మరచిపోయేటట్లు చెయ్యాలి.

ఇతర ప్రణాళికా కార్యక్రమాలవలెనే మశూచి నిర్మూలన కూడ ప్రజా ఉద్యమం. ఈనాటి ప్రభుత్వ కృషితో సహకరించి ప్రజలు తమ ఆరోగ్య ప్రమాణాలను పెంపొందించుకొనగలరని ఆశిద్దాం. ఇందువల్ల ఎవరికో మనం మేలు చేయడం లేదు మనకు మనం మేలు చేసికొంటున్నాము మన రాష్ట్రంలో కూడ 1965 మార్చి నాటికి ప్రతి వ్యక్తి ఈ కార్యక్రమం వల్ల ప్రయోజనం పొందగలడనడంలో సందేహం లేదు.

## విజయభేరి

విజయభేరి మ్రోగింపుమురా !
విజయశ్రీ వరియింపుమురా !
హిమాలయంవలె నిలిచి శాత్రవుల
యమాలయానికి పంపుమురా !

ధర్మానికి జయపెట్టుమురా !
ధైర్యానికి జే కొట్టుమురా !
దుర్మార్గంగా త్రోసుకువచ్చే
ద్రోహికి సమాధి కట్టుమురా !

దుండగీంద్ర దండింపుమురా !
గూండాలను ఖండింపుమురా !
కండలు క్రొవ్విన కటిక రాక్షసుల
తుండె తుండెలుగ చెండుమురా !

క్షాత్రభూమి నీ దేశమురా !
ధాత్రికెల్ల సందేశమురా !
శత్రు శిక్షణం మిత్ర రక్షణం
జగన్మాత ఆదేశమురా !

— కరుణశ్రీ



# దురాక్రమణ

సున్నం వీరరాజకవి

ధీరోదాత్తులు భారత ప్రజలు
గాంధీ నాయకత్వంబునన్
బోరన్ - భీతిలి ఆంగ్లపాలకులె
సంపూర్ణ స్వరాజ్యంబు చే
కూరంజేసి రటన్న, శక్యమగు
నొక్కో భారతీయ ప్రజన్
బోరాటమ్మున గెల్చి యేలగ
పెకింగ్ భూనేత కే నాటికిన్ ?॥

"జవహరులాలు శాంతియు
ప్రపంచ సమైక్యముగోరు దీనబాం
ధవుడని భూ జనాళి సతతమ్ము
నుతించుట కోర్వలేక, యా
హవమున వానినిన్ గెలిచి
యాతని స్థానము నాక్రమించి సం
స్తవముల నందగాదలచె
చౌ-ఎను-లై యవివేకచిత్తుడై ॥

పశుబలమున్న శత్రువు
సిపాయులతో సరిహద్దు రాజ్యమున్
వశ మొనరించుకొండనియె,
భారతదేశము శాంతికై యహ
ర్నిశలు శ్రమించుటన్
నిలువరించెడు సైనికశక్తి లేని దు
ర్దశను వహించియున్న దను
భ్రాంతిని, నెంత విచిత్రమో కదా !॥

భ్రమపడి మిత్రరాజ్యమగు
భారతదేశముపై వెసన్ దురా
క్రమణ మొనర్చె నిక్కువముగా
"చయినా" యని నమ్మటన్, సకా
లమున వినూతనాయుధములన్
సమకూర్చెను మిత్రరాజ్యముల్
క్రమముగ "నిండియా"కు,
దమకాన విరోధిని ద్రిప్పికొట్టగన్. ॥

ధనికులకంటె పేదలె యుదార
మతిన్ ముదమార దేశర
క్షణనిధికై విరాళము
లొసంగుటెకాక, స్వరాజ్యలక్ష్మికై
కొనినటె దేశరక్షణకుగూడ
ప్రధానికి నండదండలై
రణమున నిల్చినంతనె
యరాతి తిరోగమనం బొనర్పడే ?॥

నెహ్రూ పిలుపును వినినంతనే స్వరాజ్య
రక్షణకు లక్షల కొలంది ప్రజలు శక్తి
మీర బోరొనరింప నున్నారనంగ,
నతడు దేవాంశ సంభవుడగును గాదె ?॥

ఆకలి బాధతో నల్లాడు జనులకు
తిండి నీలేని దుస్థితి కతాన,
పాడిపంటలు వృద్ధిపరచ విదేశాల
ధనసహాయము లభింపని కతాన,
తలదాచుకొన గోట్లకొలది పౌరులకు నెం
దేని నెలవులుచూపలేని కతన,
క్షామదేవత తమ భూమీస్థలిని దాండ
వించి యెల్లరను బీడించు కతన,
ప్రజలు నిస్పృహగొని, విప్లవమును లేవ
దీసి, తన్నంత మొందించి తీరుదురను
భయమున విదేశములను కైవశ మొనర్చు
కొన గడంగె చ-ఎన్-లయి మనదలంచి. ॥

స్నేహితుని వెన్నుపొడిచెను "చీని" యనుచు
విస్మయం బందనేటికి ? వృశ్చికంబు
చెడ్డవానినె కాక కన్పడ్డ మంచి
వానినిన్ గుట్టు, దాని స్వభావమదియె.॥

ఇల్లలుకంగ పండుగగునే ?
ప్రజ కన్నులు గప్పినన్ రమా
వల్లభు కన్నుగప్పగలవాడు
కలండొకో ! దైవభీతి లే
కెల్లర కెగ్గొనర్చు గుణ
హీనుల కోటమి కల్గుగాని, వే
యేళ్ళు తపస్సుచేసిన
జయింపగ సాధ్యమే దైవభక్తులన్ ?॥ ★

# ప్రాచీన భారతదేశంలో కార్మికవర్గం



పెమ్మరాజు వెంకటరావు

*(గత సంచిక తరువాయి)*

కార్మికుడు ఒప్పందపు షరతులను పూర్తి చేయని పక్షంలో అతని వద్దనుంచి వేతనానికి రెట్టింపు మొత్తాన్ని వసూలు చేయాలని యాజ్ఞవల్క్యుడు ఉల్లేఖించాడు.

కార్మికుడు ఒప్పందం మేరకు పని నిర్వహించని పక్షంలో అతనికి వేతనాలను ముందుగానే చెల్లించాలనీ, అలా చేసినప్పటికి కూడా అతడు సక్రమంగా పనిచేయని పక్షంలో అతనివద్దనుంచి జీతానికి రెట్టింపు మొత్తాన్ని వసూలు చేయాలనీ నారదుడు పేర్కొన్నాడు.

ఎవరైనా కార్మికుడు ఒడంబడిక ననుసరించి పని చేయని యెడల అతనికి జీతం చెల్లించకూడదనీ, తన జీతాన్ని ముందుగానే పొందిన కార్మికుడు—శారీరకంగా అర్హుడైనప్పటికీ — పని చేయలేక పోయినట్లయితే అతడు తన యజమానికి జీతం మొత్తాన్ని వాపసు ఇవ్వాలనీ, అంతేగాక అంతకు రెట్టింపు మొత్తాన్ని రాజుకు జరిమానా చెల్లించాలనీ బృహస్పతి పేర్కొన్నాడు.

## మందకొడితనం

పనులు జరిగే స్థలంలో యజమాని లేని సమయంలో కార్మికుడు పనిని నెమ్మదిగా చేసినట్లయితే, అతని జీతంలో $\frac{1}{7}$ వంతు మొత్తాన్ని తగ్గించాలని యాజ్ఞవల్క్యుడు ఉదహరించాడు.

## విధినిర్వహణలో నిర్లక్ష్యం

కార్మికుడు తనకు అప్పగించిన పనిని పూర్తి చేయలేక పోయినా లేదా నిర్లక్ష్యంగా పనిచేసినా అతనికి ఒక వారం జీతాన్ని నిలుపు చేయాలనీ, మరో కార్మికుడిని నియోగించి మిగిలిన పనిని పూర్తిచేయించాలనీ కౌటిల్యుడు పేర్కొన్నాడు. నిర్ణీతమైన పనికి జీతం పొందుతూ కూడా పనిని నిర్లక్ష్యం చేసిన కార్మికుడికి 12 పణాలు జరిమానా విధించాలనీ, అంతేగాక ఆ పని పూర్తయ్యే వరకూ అతనిని వదలరాదని కూడా ఆయన ఉల్లేఖించాడు. తన వంతు పనిని నిర్లక్ష్యం చేసిన వ్యక్తిని మొదటి పర్యాయం దయ దలిచి విడిచిపెట్టాలనీ కాని తరువాత మళ్ళీ నిర్లక్ష్యం వహించినా లేదా మరెక్కడికైనా వెళ్ళిపోయినా అతనిని తీసివేయాలనీ, ఒక వేళ ఆ వ్యక్తి పెద్ద దోషి అయినట్లయితే అతనిని పరిత్యజితునిగా పరిగణించాలనీ కౌటిల్యుడు పేర్కొన్నాడు.

తమ పనిని నిర్లక్ష్యం చేసే కార్మికులను శిక్షించాలనే అంశాన్ని నారదుడు, విష్ణువులు కూడా అంగీకరించారు

## పనిముట్ల నష్టం

కార్మికుడు తనకు అప్పగించిన పనిముట్లను విరగగొట్టినట్లయితే ఆ నష్టం మేరకు యజమానికి సొమ్ము చెల్లించాలని యాజ్ఞవల్క్యుడు అన్నాడు

## సంస్థల మూసివేత

తన కార్మికులనుంచి పనితీసుకోని యజమానికి 12 పణాలు జరిమానా విధించాలనీ, ఒకవేళ యజమాని తన కార్మికులు సగం పని పూర్తిచేశాక మిగతా పనిని తీసుకోలేకపోయినట్లయితే ఆ పని పూర్తి అయినట్లు గానే ఎంచి తదనుగుణ్యంగా జీతాలు చెల్లించాలనీ కౌటిల్యుడు ఉల్లేఖించాడు.

## జీతాల చెల్లింపు

ఒప్పందాన్ని అనుసరించి పని ప్రారంభం కావడానికి పూర్వంగానీ, పని జరుగుతుండగా గానీ లేక పని పూర్తి అయిన తరువాతగానీ జీతాలు చెల్లించాలని నారదుడు పేర్కొన్నాడు.

ఒప్పందం ప్రకారం రోజు వారీగా గానీ, వారం వారం గానీ, నెలనెలా గానీ, మూడు నెలలకు ఒక పర్యాయం గానీ, ఆరునెలలకు ఒక పర్యాయం గానీ లేదా సంవత్సరానికి ఒక పర్యాయంగానీ జీతాలు చెల్లించవచ్చునని బృహస్పతి సూత్రీకరించాడు.

నిర్ణీత కాలంలో జీతాలు చెల్లించాలనీ, వేతనాల చెల్లింపును నిలిపివేయకూడదనీ లేదా వాయిదా వేయరాదని శుక్రాచార్యుడు సిద్ధాంతీకరించాడు.

ఒప్పందం ప్రకారం సేవకుడు జీతం పొందాలని కౌటిల్యుడు పేర్కొన్నాడు.

శాసనకర్తలంతాకూడా ఒప్పందాల ననుసరించి జీతాలుచెల్లించాలనీ, పనిపూర్తి కాకుండావున్నా లేక పని అసంతృప్తికరంగా వున్నా అట్టి సందర్భాలలో మాత్రమే జీతాలను నిలిపివేయాలనీ సూత్రీకరించారు.

జీతాల చెల్లింపు విషయంలో వివాదం ఏర్పడినప్పుడు దానిని సాక్షుల వాఙ్మూలం ఆధారంగా పరిష్కరించాలి. సాక్షులు లేని పక్షంలో పని అమలును పురస్కరించుకొని ఆ వివాదాన్ని పరిష్కరించాలి.

జీతాలు చెల్లించని వారికి జీతాల మొత్తానికి అయిదు రెట్లుగానీ లేదా 6 పణాలు గానీ జరిమానా విధించాలి. జీతాలను దుర్వినియోగం చేసిన వారికి జీతాల మొత్తానికి పది రెట్లుగానీ లేక 12 పణాలు గానీ జరిమానా విధించాలని కౌటిల్యుడు పేర్కొన్నాడు.

యజమాని తన కార్మికులకు జీతాలు చెల్లించలేక పోయినట్లయితే రాజు జోక్యం

కలిగించుకోవి ఒప్పందం ప్రకారం కార్మికులకు జీతాలు అందేటట్లు చూడాలనీ, జీతానికి సమానమైన మొత్తాన్ని యజమాని వద్దనుంచి జరిమానాగా వసూలు చేయాలనీ బృహస్పతి ఉల్లేఖించాడు.

నిర్ణీత గడువుకు పూర్వం యజమానులు కార్మికుల నెవరినీ తొలగించరాదనీ, ఒక వేళ గడువు పూర్తిగాకుండా వారిని తొలగించవలసి వస్తే పూర్తి కాలానికి మొత్తం జీతాలు చెల్లించాలనీ, ఒప్పందపు షరతులను ఉల్లంఘించే యజమానులు కార్మికులకు పూర్తి వేతనాలనూ, రాజుకు 100 పణాల జరిమానానూ చెల్లించాలనీ విష్ణువు సిద్ధాంతీకరించాడు.

## వివాదాలు

యాజమాన్యం, పనివారలకు మధ్య ఏర్పడే వివాదాలను సాక్ష్యాలు, పత్రాల ఆధారంగా పరిష్కరించాలనీ, రాజూ, న్యాయస్థానాలూ గాక దక్షులైన వారు కూడా మధ్యవర్తులుగా వ్యవహరించి వీటిని పరిష్కరించవచ్చుననీ కౌటిల్యుడు ప్రవచించాడు.

## సామర్థ్యానికి ప్రతిఫలం

నిర్ణయించిన దానికంటే ఎక్కువ పనిని చేసే సమర్థుడైన కార్మికునికి అదనపు వేతనం చెల్లించాలని యాజ్ఞవల్క్యుడు సూత్రీకరించాడు. కౌటిల్యుడు కూడా ఈ విధానంతో ఏకీభవించాడు. విశ్వాసపాత్రులైన సేవకులకు రాజు కానుకల రూపంలో వారి జీతంలో $\frac{1}{8}$ వ వంతు సొమ్మును బహూకరించాలని కౌటిల్యుడు పేర్కొన్నాడు.

నిపుణతను, సామర్థ్యాన్ని గుర్తించడంతో పాటుగా, కార్మికుడు సమర్థంగా కష్టించి పనిచేయ గల్గేట్టుగా తగు ఆకర్షణలను, పరిసర వాతావరణాన్ని సృష్టించాలి.

## కార్మికుల పట్ల ఆదరణ

కార్మికునిలో జనించే అసంతృప్తి వివాదానికి దారితీస్తుందనేది శుక్రనీతి. తక్కువ శ్రేణి కార్మికుడైనప్పటికీ అతని పట్ల సక్రమంగా ప్రవర్తించనట్లయితే తిరుగుబాటు చేస్తాడు. యజమానులు తమ కార్మికులను మర్యాదగా చూసుకోవాలి. కార్మికులకు మంచిగా వేతనాలు చెల్లించి వారిపట్ల ఉదారంగా ప్రవర్తించినట్లయితే వారు యజమానులకు అండగా వుంటారు. యజమాని, కార్మికులకు మధ్య ప్రత్యక్ష సంబంధం లేకపోవడం వివాదాలకు ముఖ్య కారణం. యజమాని తన కార్మికుని పనిని గురించి అడిగి తెలుసుకుంటూ అతనితో స్వేచ్ఛగా మాట్లాడుతూ అతని కుటుంబం మంచిచెడ్డలను, స్థితిగతులను అడిగి తెలుసుకుంటున్నట్లయితే దానికి ప్రతిగా కార్మికుడు తన యజమాని పట్ల గౌరవభావం గలిగి విశ్వసనీయకంగా పనిచేస్తూ ఆపత్సమయాలలో యజమానికి ఆసరాగా వుంటాడు. తమ యజమానిని విడిచివెళ్ళనివారే ఉత్తమ కార్మికులనీ, తమ ఉద్యోగి నిమిత్తం జీవితాన్ని సైతం త్యాగం చేయడానికి సంసిద్ధులయ్యే వారే ఉత్తమ యజమానులనీ శుక్రాచార్యుడు సూత్రీకరించాడు.

## పారిశ్రామిక శిక్షణ

వివిధ వృత్తులలో కార్మికులకు శిక్షణ గరపడానికి గల ప్రాముఖ్యతను గురించి నారదుడు, యాజ్ఞవల్క్యుల స్మృతులలోనూ, జాతకాలలోనూ ప్రస్తావించబడింది. ఈ విధంగా శిక్షణపొందే వారిని "అంతేవాసు"లు అనేవారు. వారు తమ ఆచార్యుని వద్దనే వుంటూ వృత్తిపనులను అభ్యసించే వారు. ఆచార్యుడు వారికి భోజన, వసతి సౌకర్యాలు కలుగజేసే వాడు. శిక్షణ ముగిశాకకూడా అంతేవాసులు నిర్ణీత కాలం వరకు తమ ఆచార్యుని వద్దనే వుండి తాము సంపాదించిన సొమ్మునంతటినీ ఆచార్యునికి ఇవ్వాలని శుక్రాచార్యుడు పేర్కొన్నాడు.

శిక్షణ పూర్తయ్యాక శిక్షితుడు తన గురువుకు తన శక్త్యానుసారం "గురుదక్షిణ" సమర్పించాలని నారదుడు సిద్ధాంతీకరించాడు.

## సాంఘిక సంక్షేమం - వార్ధక్యపు సౌకర్యాలు

ప్రభుత్వ ఉద్యోగులకు ఉద్యోగ విరమణానంతరం ఆర్థిక సహాయం లభింపజేయాలని శుక్రాచార్యుడు పేర్కొన్నాడు. 40 సంవత్సరాలకు పైగా సేవచేసిన ఉద్యోగులకు అతని జీతంలో సగం మొత్తాన్ని పింఛనుగా చెల్లించాలి కార్మికుని జీతంలోనుంచి నాల్గవ వంతు లేక ఆరవ వంతు మొత్తాన్ని మినహాయించి ఆ విధంగా కూడిన మొత్తాన్ని రెండు లేదా మూడు సంవత్సరాల తర్వాత పూర్తిగా గానీ లేక సగం గానీ అతనికి తిరిగి చెల్లించాలి.

## కుటుంబ సౌకర్యాలు

కార్మికుడు మరణించిన సందర్భంలో అతని జీతాన్ని అతని కుటుంబానికి చెల్లించాలనీ, కార్మికుని కుటుంబంలో జనన మరణాలు సంభవించిన సందర్భంలో కూడా ఆర్థిక సహాయం లభింపజేయాలనీ కౌటిల్యుడు పేర్కొన్నాడు. యజమాని డబ్బు చెల్లించలేని పక్షంలో ఇతరత్రా సహాయ పడవచ్చు. అయితే అధిక పరిమాణంలో బంగారం ఇవ్వడాన్ని నిషేధించాలని కౌటిల్యుడు పేర్కొన్నాడు.

పనిచేయని వారికి డబ్బు చెల్లించే పద్ధతికి కౌటిల్యుడు వ్యతిరేకి. కనుకనే వితంతువులు, అవివాహితులైన బాలికలు, శిక్షితులు, సన్యాసినులు, దేవదాసినులకు నూలు, ఉన్ని, జనపనార వడికే పనులుకల్పించి కుటుంబం పోషించుకునేందుకు వీలు కలిగించాలని ఆయన ఉల్లేఖించాడు.

40 సంవత్సరాలపాటు సేవచేసిన అనంతరం కార్మికుడు చనిపోయినట్లయితే అతని కుటుంబ పోషణకు భత్యాలు కానీ, కుటుంబ పింఛనులు కానీ ఇవ్వాలని శుక్రాచార్యుడు సూత్రీకరించాడు. అతని భార్యకు, కూతుళ్ళకు, యుక్తవయస్కులు కాని కొడుకులకు జీతంలో సగం మొత్తాన్ని ఇవ్వాలని కూడా ఆయన పేర్కొన్నాడు. పోతే మరణించిన

కార్మికుని యుక్తవయస్కుడు కాని కొడుకుకు అతనికి యుక్తవయస్సు వచ్చేవరకు తండ్రికి లభించే పూర్తిజీతం చెల్లించాలనీ, యుక్తవయస్సు వచ్చాక అతనిసామర్థ్యాన్ని బట్టి తగు ఉద్యోగం లభింపజేయాలనే మరో ప్రతిపాదనకూడా వుంది.

### మహిళా, శిశు సంక్షేమం

బుట్టల అల్లకం, కుట్టుపనులలో స్త్రీలు నియోగించబడే వారు. నూలు, నేత కర్మాగారాలలో కూడా వారు పనిచేసేవారు. అంతేగాక మద్యపానాలను కూడా తయారు చేసేవారు. వారు చేసేపనినీ, సామర్థ్యాన్నీ బట్టి జీతాలు చెల్లించే వారు. స్త్రీలకు, పురుషులకు ఒకే పనికి వేరు వేరుగా జీతాలు చెల్లించబడేవనే విషయాన్ని నిరూపించడానికి తగు ఆధారాలు లేవు. ఉద్యోగంచేసే స్త్రీల సంరక్షణకు అనేక నిర్బంధాలు విధించబడేవి. ఎవరైనా ఉద్యోగం చేసే స్త్రీ ముఖాన్ని చూచినా లేదా ఆమెతో మాట్లాడినా అతనికి ప్రథమశ్రేణి శిక్షను విధించాలని కౌటిల్యుడు సిద్ధాంతీకరించాడు. ఎవరైనా లంచం పుచ్చుకొనిగానీ, దురుద్దేశంతో గానీ స్త్రీకి పని చేయకుండానే జీతం ఇచ్చినట్లయితే అతనికి ద్వితీయశ్రేణి శిక్ష విధించాలి. జీతాల పంపిణీలో అవరోధం కలిగించినవారికి మధ్యరకం శిక్ష విధించాలి. స్త్రీని చెరిచిన లేక అంగవిహీనం చేసిన కఠిన శిక్షార్హులవుతారు.

### ప్రసూతి సౌకర్యం

గర్భిణీ స్త్రీలను పనిలోనుంచి తొలగించడం నిషిద్ధం. యజమాని వారిని పనిలోనుంచి తొలగించ దలచినట్లయితే ప్రసవానికి తగుఏర్పాట్లు చేయాలి. ఈ నియమాలను ఉల్లంఘించిన వారికి కఠిన శిక్షలు విధించాలని శాసనకర్తలు పేర్కొన్నారు.

### నిరుద్యోగులకు రక్షణ

ఎవరైనావ్యక్తి ఉద్యోగం లేకుండా ఇబ్బందులు పడుతూ అన్నవస్త్రాల కొరకు ఎవరైనా భాగ్యవంతునివద్ద సేవ చేయదలచినట్లయితే ఆ భాగ్యవంతుడు అతనికి ఉద్యోగం ఇవ్వాలని సూత్రీకరించబడింది. ఉద్యోగం పొందినవ్యక్తి తన ఇష్టమొచ్చినప్పుడు ఎప్పుడైనా ఉద్యోగం మానివేసివెళ్ళవచ్చు.

### కార్మిక సంఘాలు

పూర్వకాలంలో వర్తకుల వలెనే కార్మికులుకూడా సంఘాలు ఏర్పర్చుకునేవారు. కార్మిక సంఘాలు సుసంఘటితమై వుండేవి. క్రీ. పూ. 500_300 సంవత్సరాల మధ్య కాలంలో అవి స్వతంత్ర ప్రతిపత్తి కలిగి వుండేవి. వ్యవసాయదార్లు, వర్తకులు, పశుకాపరులు, వడ్డీవ్యాపారులు, కార్మికులు తమ సభ్యుల ప్రవర్తన విషయంలో నిబంధనావళిని రూపొందించవచ్చునని గౌతముని ధర్మశాస్త్రం తెలుపుతున్నది. వివాదాలు తలెత్తినప్పుడు రాజు సంస్థఅధిపతి నుంచి నిజానిజాలు తెలుసుకొని తీర్పుచెప్పేవాడు. ఈ సంఘాల కార్యకలాపాలను సమీక్షించేందుకు ముగ్గురు పెద్దలతో 'సమితి' అనే సంఘాన్నొకదానిని నెలకొల్పాలని కౌటిల్యుడు పేర్కొన్నాడు. సంఘం సభ్యత్వరుసుమును విశ్వసనీయులైన వ్యక్తుల వద్దగానీ, ప్రముఖులైన సభ్యుల వద్దగానీ లేక సంఘం అధిపతివద్దగానీ వుండాలి. 'సమితి' ఆధ్వర్యంలో సంఘం ఏదైనా పరిశ్రమను ప్రారంభించవచ్చు. పరిశ్రమలాభాలు సభ్యులకు సంక్రమిస్తాయి. సంఘసభ్యులు సంస్థపట్ల విశ్వాసపాత్రంగా ప్రవర్తించాలని కూడా మనువు పేర్కొన్నాడు. నియమ నిబంధనలను ఉల్లంఘించడాన్నీ, సంస్థను మోసంచేయడాన్నీ, సమర్థంగా పని చేయకపోవడాన్నీ తీవ్రమైన నేరాలుగా పరిగణించాలి. సంఘం నిధులను తస్కరించిన వారిని దేశంనుంచి బహిష్కరించాలనీ, వారి ఆస్తులను జప్తు చేసుకోవాలనీ యాజ్ఞవల్క్యుడు సిద్ధాంతీకరించాడు. రాజులు ఈ సంఘాలను గుర్తించి వాటికి చేయూత నిచ్చినట్లు మహాభారతంలో ఉల్లేఖించబడింది.

సంఘాలమధ్య అంతఃకలహాలు కలిగించే వారిని కఠినంగా శిక్షించాలనీ లేనిపక్షంలో ఈ దుష్కృత్యం ప్రబలిపోయే అవకాశం వుంటుందనీ నారదుడు పేర్కొన్నాడు.

ముసలివారు, పిల్లలు, ద్వేషపూరితులైన వ్యక్తులు, తమ మాటకు కట్టుబడి వుండని వారు, విపరీతమైన సాహసం చూపించే వారు విశ్వసించదగగవారు కారు. కాబట్టి వారిని సభ్యులుగా చేర్చుకోరాదని బృహస్పతి సూత్రీకరించాడు. నియమ నిబంధనలకు కట్టుబడివుండని సభ్యులకు, అంతఃకలహాలను రేకెత్తించే సభ్యులకు జరిమానాలు విధించడం, బహిష్కరించడం, ఆస్తులు జప్తుచేసుకోవడంవంటి శిక్షలు విధించేవారు. దురుద్దేశంతో వ్యవహరించే సభ్యులు, నిగ్రహంలేని సభ్యుల కార్యకలాపాలను నిరోధించే అధికారం సంస్థ అధిపతికి వుండేది. ఈ విషయాలలో సంస్థ అధిపతి గైకొనే చర్యలను రాజు సాధారణంగా ఆమోదించేవాడు. సంస్థ అధిపతి సభ్యుల పట్ల అన్యాయంగా ప్రవర్తించి వారికి కష్టనష్టాలు కలిగించినట్లయితే రాజు జోక్యం కల్పించుకొని సభ్యులను పరిరక్షించేవాడు.

కార్మికులు సమిష్టిగా వ్యవహారాలు చేయడం శాసనసమ్మతమే. కాని వారు తమ యజమానికి నష్టం కలిగించే ఉద్దేశంతో వ్యవహరించినట్లయితే చట్టంక్రింద శిక్షార్హులవుతారని కౌటిల్యుడు పేర్కొన్నాడు. వ్యక్తిగత చర్యలకంటే సంస్థల చర్యల విషయంలో సడలింపు ఎక్కువగా వుండేది.

కార్మికుల విధులు, బాధ్యతలపై కౌటిల్యుడు సమగ్రమైన నియమ నిబంధనలు రూపొందించాడు. కార్మిక విషయాలను గురించిన సాధారణ పరిస్థితులను వివరించడానికీ, ప్రాచీనకాలంనాటి శాసనకర్తలు, ఆర్థిక శాస్త్రవేత్తలు సాంఘిక న్యాయం విషయంలో చేసిన సూత్రాలనుగురించి తెలుసుకోవడానికీ ఈ వ్యాసం ఉద్దేశించబడింది కాబట్టి నేను పూర్తి వివరాలలోకి వెళ్ళలేదు. కార్మిక తరగతులకు సాంఘిక న్యాయం చేకూర్చే విషయాలలో ప్రాచీన కాలంనాటి పరిస్థితుల స్థాయికి చేరుకోవడానికి మనం ఇంకా చాలా ముందుకు వెళ్ళాలనే విషయాన్ని ఈ వ్యాసం వెల్లడించగలదని నేను ఆశిస్తున్నాను.

★

నేఫాలో తూర్పు సరిహద్దున ఉన్నది రోహిత్ సరిహద్దు విభాగం. ఈ విభాగానికి తూర్పు దిక్కున ఉత్తర బర్మాకు చెందిన పుటావో జిల్లా, ఉత్తరాన టిబెట్టుకు చెందిన జయుల్ జిల్లా ఎల్లలుగా పేర్కొనవచ్చును. రోహిత్ విభాగం పశ్చిమ దిక్కున సియాంగ్ సరిహద్దు విభాగం, దక్షిణాన తిరాప్ సరిహద్దు విభాగం ఉన్నాయి

రోహిత్ సరిహద్దు విభాగం విస్తీర్ణం సుమారు 9056 చ॥ మైళ్ళు ఈ ప్రాంతం జనాభా 36050 నేఫాలోని మిగతా నాలుగు విభాగాల లాగానే ఈ విభాగానికి కూడా అక్కడ ప్రవహించే పెద్దనది పేరు వచ్చింది ఇక్కడ రోహిత్ నది హిమాలయ పర్వత శ్రేణినుంచి క్రిందకు ప్రవహిస్తున్నది. ఈ నది టిబెట్టు ఆగ్నేయ ప్రాంతంలో జయుల్ రాష్ట్రంలో జన్మించి అస్సాము ఈశాన్య భాగంలో భారతదేశంలోకి ప్రవేశిస్తున్నది. ఉరుకులు పరుగులు పెడుతూ ఉత్తుంగ హిమవత్పర్వతాల మధ్య లోయలగుండా 120 మైళ్ళు ప్రవహించి, మైదానాలలో ప్రవేశించి ఆ వెంటనే బ్రహ్మపుత్రలో కలుస్తున్న దీ రోహిత్ నది. ఇక్కడ మరో నది దిబాంగ్ అనే నది రోహిత్ పశ్చిమ భాగంలో ఉత్తరాన నుంచి క్రిందకు దక్షిణానికి ప్రవహిస్తున్నది

ఈ రెండు నదుల మధ్య గల నదీ పరీవాహ ప్రాంతంలో నివసిస్తున్న ప్రజలను మిషిమీలు అంటారు రోహిత్ లోయలోని మిషిమీలను రెండు వర్గాలుగా వర్గీకరించవచ్చును. రోహిత్ ఉత్తర భాగంలో నివసించే మిజూలు ఒక వర్గం క్రిందకు పశ్చిమాన దిగువ భాగాలలో నివసించే దిగారులు రెండవ వర్గం క్రిందకూ వస్తారు ఈ రెండు వర్గాల ప్రజల ఆచార వ్యవహారాలు ఒకటే అయినా భాషమాత్రం వేరు దిబాంగ్ లోయలోని మిషిమీలు తాము ఇదూలమని చెప్పుకొంటారు అయితే వారు "చులికర్త" అనే పేరిట ఎక్కువగా వ్యవహరింపబడుతున్నారు అస్సామీ భాషలో ఈ మాటకు క్రాపింగు జుట్టుకల వారని అర్థం ఈ మూడు వర్గాల ప్రజలే కాక ఈ రోహిత్ సరిహద్దు విభాగంలో ఖంపాటీలు, పదాములు అనేవారు కూడా




—కర్నల్ పి. ఎన్. లూథ్రా

నివసిస్తున్నారు మిజూలు, దిగారులకు దీర్ఘ శిరోజధారణ ఒక ప్రత్యేకత.

ఈ ఆదివాసుల పుట్టుపూర్వాలు, వీరు ఈ ప్రాంతంలో సరిగ్గా ఎప్పుడు స్థిరపడిందీ తెలియదు కాని ఈ తెగలలో కొంతమంది వస్తుతః ఇక్కడి వారేనని విశ్వసింపబడుతోంది. వీరిలో ఎక్కువ మంది బర్మా నుంచి ఈ ప్రాంతానికి వసల వచ్చామని చెప్పుకొంటారు కాని వారికీ ఇతర ప్రజలకూ తేడా ఏమీలేదు వీరి తర్వాత వచ్చిన తెగల వారు తాము ప్రస్తుతం ఉంటున్న ప్రాంతానికి ఎన్ని తరాల క్రింద వచ్చిందీ చెబుతున్నారు. వీరి పూర్వులకు తాము ఇక్కడకు వచ్చినప్పుడు ఈ ప్రాంతంలో ఒకానొక ప్రత్యేక సంస్కృతి గల ప్రజలు కన్పించారట. వీరు పూర్వం చైనా బర్మాపై ఒత్తిడి తెచ్చిన సమయంలో ఇక్కడకు వలస వచ్చి ఉండవచ్చు అటువంటి ఆపత్సమయాలలో బర్మా ప్రజలు అస్సాములోకి వలస రావడం జరుగుతూ వచ్చింది

ఈ తెగల ప్రజలలో శాఖాంతర వివాహాలకు ఆటంకం లేదు వీరిలో కులాలు లేవు అంతా సమానమే కాని ఎక్కువ మంది జనాభా ఉన్న తెగవారంటేనూ, అధికారం కల వారంటేను కొంచెం ఎక్కువ గౌరవ మర్యాదలు చూపుతారు వస్తుతః ఈ ప్రాంతానికి చెందిన తెగల వారికి ఈ నాటికి కూడా సంఘంలో ఉన్నతమైన హోదా, గౌరవ స్థానం ఉన్నాయి వారిని ఈ ప్రాంతం పాలకులుగా పరిగణించి గౌరవించడం కూడా కద్దు.

హిందువులకు అతి పవిత్ర యాత్రాస్థలమైన బ్రహ్మగుండం (పరశురాం గుండం అని దీనికి మరో పేరు) ఈ విభాగానికి ప్రధాన కార్యస్థలం తేజూకు 13 మైళ్ళ దూరంలో ఉన్నది. రోహిత్ నదిలో ఇ ఒక అఘాతం. ఈ నదికి అతి సమీపంలో ఎగువన ఉన్న పర్వాతాల నుంచి ప్రవహించే వాగు ఈ అఘాతంలో కలుస్తున్నది. ఈ గుండంలోని నీరు పవిత్రజలంగా పరిగణింపబడుతోంది. ఇక్కడకు వచ్చే యాత్రికు

లంతా తాము పూర్వం చేసిన సకల పాపాలు క్షాళనం కాగలవనే విశ్వాసంతో ఈ గుండంలో స్నానం చేస్తారు. అహోమ్‌ల కాలంలో వారి రాజును సింహాసనం అధిష్ఠించడానికి ముందు ఈ గుండం నుంచి నీరు తీసుకొని వచ్చి ఆ నీటిలో స్నానం చేయించి ఆయన్ను పునీతుణ్ణి చేయవలసి ఉండేది. ఈ నీటికి అంత ప్రాధాన్యం, అంత పవిత్రత ఉండేది ఆ రోజులలో. ఈ నీళ్ళు రోహిత్ నదీ జలాల కంటె కొంచెం వెచ్చగా ఉంటాయి. ప్రతి సంవత్సరం జనవరి మాసంలో అస్సాము మైదాన ప్రాంతాల నుంచి వందలాది యాత్రికులు ఇక్కడకు వచ్చి బ్రహ్మగుండంలో స్నానమాడి వెళతారు.

మిజూలు, దిగారులు ఒక వస్త్రం నడుం చుట్టు త్రిప్పి వెనుకనుంచి ముందుకు గోచీ పెట్టుకొంటారు. గోచీ ముందు వైపు బిగిస్తారు. పైన చేతులులేని కోటు వేసుకొంటారు. కంఠం నుంచి మోకాళ్ళదాకా ఉంటుంది ఆకోటు వీటికోసం మిషిమీ స్త్రీలు ఎరుపు, నలుపు, నీలంరంగు నూలుతో కంటికి ఇంపైన రంగురంగుల వస్త్రాలు నేస్తారు వీరు నిడుపైన శిరోజాలు ఉంచుకొంటారు. వెనుక ముడి వేసుకొంటారు. కొంతమంది నెత్తిమీద ఉన్ని టోపీ మరి కొంతమంది వెదురుతో అల్లిన శిరస్త్రాణం ధరిస్తారు.

మిషిమీ స్త్రీలు నడుముచుట్టూ మోకాళ్ళ దాకా వచ్చేలా రంగువస్త్రం వదులుగా చుట్టుకొంటారు. పైన చాలీచాలని రెవికలు. ఇక శిరోజాలంకరణలో వీరిది పెట్టింది పేరు. తలలో మామూలు గాజుపూసలేకాక ఎగేటు, పోర్సిలిన్‌లతో తయారైన రకరకాలపూసలు అలంకరించుకొంటారు. వీరి కేశసంస్కరణ అత్యంత ఆకర్షణీయంగా ఉంటుంది. పల్చని వెండిరేకుతో తయారైన అందమైన శిరస్త్రాణం ధరిస్తారు. అది నుదుటిమీదకు వచ్చే భాగం వెడల్పుగా ఉండి సుమారు ఒక అర అంగుళం వెడల్పున చెవులను కప్పుతూ ఉంటుంది. దాని తాలూకు గొలుసు మెడ చుట్టూ రావడంచేత శిరస్త్రాణం కదలకుండా ఉంటుంది. జుట్టు మెలిపెట్టి ఒకవైపు కొప్పులా ముడి వేసుకొంటారు కొప్పుముడి జారిపోకుండా పొడుగాటి కొప్పుపిన్ను పెట్టుకొంటారు. ఢిల్లీనుంచి ఈ ప్రాంతం సందర్శించి పోవడానికి వచ్చిన ఒకానొక సౌందర్యారాధకుడు ఈ మగువల కేశ సంస్కరణ పద్ధతి చూచి ఎంతో ముగ్ధుడయ్యాడు. అంతే కాదు; ఆయన రాజధానీ నగరంలో నాగరిక స్త్రీలకు ఈ పద్ధతి నేర్పాలని చూస్తున్నాడు కూడాను చులికత్తాతెగవారు జుట్టు ముందుకు దువ్వుకొని, ఈ వైపునుంచి ఆ చెవిదాకా జుట్టు కత్తిరించుకొంటారు. ఇక వెనుక వైపు జుట్టు దువ్వుకొని, ముడివేసుకొని, ముడి జారకుండా ఎముకతో తయారైన పిన్నులు పెట్టుకొంటారు.

ఈహిమాలయ పర్వత ప్రాంతాలలో రీనిలియా అనే ఒక రకం దూలగింజ ప్రయోజనం లక్షణాలు తొలుదొల్తగా కనుగొన్న గౌరవం చులికత్తాలకు దక్కుతుంది. దీనినుంచి తీసేనూలు చాలాగట్టిగా, ముద్గ్గ బలంగా ఉండడంచేత దీనితో వారు కోటు గుడ్డనేసి ఆ కోట్లు కవచాలుగా ఉపయోగిస్తారు. యుద్ధాలకు వెళ్ళేటప్పుడు వారు ఈ కోట్లు ధరిస్తారు. బాణంకూడా దిగనంత గట్టిగా ఉంటాయి ఈ కోట్లు.

వీరు నివసించే ప్రాంతంలో అనేకరకాల విలువైన సరుకులు ఉత్పత్తి అవుతాయి. అందువల్లనే వీరు అస్సాములో మరే ఇతర ఆదివాస జాతివారికంటె ఘనంగా ఇతర ప్రాంతాల వారితో వ్యాపారం చేస్తున్నారు అస్సాం మైదాన ప్రాంతాల ప్రజలతో వీరికి చిరకాలంగా వాణిజ్య సంబంధాలు ఉంటూ వచ్చాయి వీరికి సాదియా, దిబ్రూగర్హ్ ముఖ్యమైన సరుకు మార్పిడి మార్కెట్లు. మిషిమీలు ఈ మార్కెట్లకు చేర్చే సరుకులు హిమాలయాలలో 8 వేల నుంచి 9 వేల అడుగుల ఎత్తున ఉండే ప్రాంతాలలో లభించే టీటా అనే వనమూలికలు, కస్తూరి, నాభి, మైనం, అల్లం, మిరపకాయలు మొదలైనవి ఉంటాయి. అనేక మంది మిషిమీలు చలి కాలం అంతా అస్సాములో చెరుకు పంట కోతలకు వెళ్ళి డబ్బు సంపాదించుకొని వస్తారు.

మిషిమీల వ్యవసాయం వారిఅవసరాలను బట్టి చూస్తే చాలా తక్కువే అని చెప్పాలి. కొండవాళ్ళలో భూములున్ని వ్యవసాయం చేస్తారు. వాగులు, నదులను అనుకొనిఇంత కంటె చదరంగా ఉండేభూములలో వ్యవసాయం ఎక్కువగా సాగుతోంది. ఇక్కడ ముఖ్యంగా భారతదేశపు వరి, మరో రెండు మూడు రకాల తక్కువ రకపు పప్పు ధాన్యాలు పండుతాయి. తక్కువ ఎత్తులో ఉండే వాళ్ళలో వారు పెండలం, బంగాళదుంపలు విరివిగా పండిస్తారు. ఇక్కడ కొంచెం తక్కువ రకం ప్రత్తికూడా కొద్దిగా పండుతుంది ఇక్కడ పొగాకుకు మంచి గిరాకీ ఉన్నది. మగవారు ఆడవారూ తప్పనిసరిగా పొగ త్రాగుతారు. పొగ పీల్చేందుకు పొడవైన గొట్టాలుండే అందమైన వెండి పైపులు వాడుతారు

మిషిమీ సంఘంలో వర్గాలు లేవు. నాయకులు లేరు. వ్యక్తికుండే ప్రజాస్వామ్య హక్కును అందరూ గుర్తించారు. వ్యక్తి అధికారం అతని గృహానికి పరిమితమై ఉంటుంది. మంచి శీలం, సంపన్నత గల వ్యక్తులకు పలుకుబడి, అధికారం సహజంగా

లభిస్తాయి. వేరే మిషిమీలకు ఏవైనా వివాదాలు వస్తే తీర్చేందుకు పెద్దలుగా వ్యవహరిస్తారు

నేఫా పాలనాధికారులు ఈ సాంఘిక కట్టుబాట్లను, నీతి నియమాలను మన్నించడం జరుగుతోంది. వివాదాలను చాలావరకు భారతీయ శిక్షాస్మృతితో సంబంధం లేకుండానే పరిష్కరించడం జరుగుతోంది. మామూలుగా విధించే శిక్ష జుల్మానా ఈ జుల్మానా క్రింద పశువులను ఇచ్చుకోవలసి ఉంటుంది హత్యా నేరానికి 75 నుంచి 80 పశువులను, వ్యభిచార నేరానికి 2 నుంచి 7 పశువులను కోల్పోవలసి ఉంటుంది.

చాలామంది కొండజాతి వారి లాగానే మిషిమీ తెగవారు కూడా స్వేచ్ఛాప్రియులు. ఒట్టి బోళా మనుష్యులు. ఒక్కొక్క గ్రామంలో 2 నుంచి 4 కుటుంబాల వారు మాత్రమే వుంటారు. ఒక్కొక్క సందర్భంలో గ్రామంలో ఒక్క కుటుంబం మాత్రమే ఉండడం కూడా కద్దు. గ్రామంలో కుటుంబాల సంఖ్య ఇలా పరిమితంగా ఉండడానికి మిషిమీల వ్యక్తి స్వాతంత్ర్య ప్రియత్వమే కారణం వీరు తల ఒగ్గవలసిన సాంఘికకట్టుబాట్లు, కట్టుబడి ఉండవలసిన నియమాలు స్వల్పం వీరికి కూడా పురోహితులు ఉన్నారుకాని అదొక ప్రత్యేక కులం — వర్గంకాదు కొంతమంది మాత్రమే పురోహితులు కావాలని కానీ వారికింత వయస్సు ఉండాలని కానీ నియమం లేదు అంతేకాదు ఈ పురోహితుల అధికారాలు వంశ పారంపర్యంగా వచ్చేవీకాదు

సాంఘికఆచారాల విషయంలోకూడా మిషిమీలకు వ్యక్తిస్వాతంత్ర్యం మెండు. మిషిమీ యువకుడు తనకు ఇష్టం వచ్చినప్పుడు తన ఇష్టానుసారం పిల్లలను ఎంచుకొని వివాహమాడుతాడు ఆడవారు ఎవరో ఒకరు మధ్యవర్తిగావుండి పెండ్లికూతురు ఇష్టాయిష్టాలు కనుక్కొంటారు. ఇష్టంలేందే ఏ మిషిమీ యువతి కూడా పెండ్లిచేసుకోదు. అయితే పిల్లకు కన్యాశుల్కం చెల్లించే ఆచారం ఉంది కన్యాశుల్కం తాలూకు మొదటి వాయిదా చెల్లించాక వరుడు, భార్యను చూడడానికి అత్తమామల ఇంటికి వెళ్ళవచ్చు. పెండ్లిండ్ల కాలంఅంటూ ప్రత్యేకం ఏమీలేదు. సంవత్సరంలో ఎప్పుడుబడితే అప్పుడు వివాహాలు జరుగుతూ ఉంటాయి మగవాడు ఎంతమందినైనా వివాహం చేసుకోవచ్చును. బహుభార్యత్వం నిషేధంలేదు. వారి వారి ఆర్థిక స్తోమతనుబట్టి ఎంతమంది కావాలంటే అంతమందిని పెండ్లాడుతారు

ఈ రోహిత్ సరిహద్దు విభాగం ఏర్పాటై సుమారు పది సంవత్సరాలైంది ఇది ఒక రాజకీయ అధికారి పరిపాలన క్రింద ఉంటోంది ఈయన్ను డెప్యూటీ కమీషనర్ అని వ్యవహరిస్తారు. ఈ ప్రాంతాన్ని కేంద్రాలు, ఉపవిభాగాల క్రింద విభజించి డెప్యూటీ కమీషనరు ఆయన క్రిందఉండే సహాయక రాజకీయ అధికారులు మొదలైన వారు పరిపాలనా బాధ్యతలు నిర్వహిస్తున్నారు వారి ఆర్థిక వ్యవసాయాభివృద్ధి నిమిత్తం సమగ్ర కార్యక్రమం రూపొందించి ఎంతో కృషిచేస్తున్నారు. జిల్లా ప్రధాన కార్యస్థలమైన తెజూలో పూర్వపు ఉన్నత పాఠశాల ఈ సంవత్సరం ఉన్నత సెకండరీ పాఠశాల అయ్యింది ఈ పాఠశాల నుంచి 11 మంది విద్యార్థులు మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. ఈ పాఠశాలలో జాతీయ విద్యార్థి సైనికదళం, బాలికల గైడ్లదళం ఏర్పాటైనాయి

గత సంవత్సరం సెప్టెంబరులో చైనా ముష్కరుల దురాక్రమణకు రోహిత్ సరిహద్దు విభాగంగురియైనప్పుడు మిషిమీల ధైర్య స్థైర్యాలకు పౌరుషానికి పరీక్ష సమయం ఏర్పడింది. ప్రకృతి సౌందర్యానికి నిలయమైన వలాంగ్ వీరభూమి యుద్ధ రంగమైంది. అటువంటి విపత్కర పరిస్థితిలో మిషిమీలు ధైర్యసాహసాలు ప్రదర్శించి భారత సైన్యానికి అండదండగా నిలచారు. బరువులు మోసి, ఆహార పదార్థాలు అందచేసి సైనికులకు అనేకవిధాల తోడ్పడ్డారు. శత్రు ప్రతిఘటన సాధ్యంకాక పోయినప్పుడు మన సైనికులతో పాటు ఎంతో ధైర్యం, సమయ స్ఫూర్తి ప్రదర్శించి క్రమపద్ధతిలో వెనక్కు మరలివచ్చారు.

చైనావారి ఉపసంహరణ జరిగిన వెనువెంటనే మిషిమీలు వలాంగ్ ప్రాంతంలో సరిహద్దున ఉన్న తమ స్వగ్రామాలకు తిరిగి వచ్చారు. కొద్ది వారాలలో అక్కడ సాధారణ పరిస్థితి తిరిగి నెలకొల్పడం జరిగింది అంటే అందుకు వారి ధైర్యం, విపత్తునుంచి వెంటనే కోల్కొనే వారి స్వభావం కారణం. 1950 లో ఒకసారి భూకంపంవచ్చి పరిస్థితి అంతా అస్తవ్యస్తమైనప్పుడు కూడా మిషిమీలు అతి త్వరలో కోలుకోగలిగారు.

(ఆకాశవాణి సౌజన్యంతో)

## గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

విశాఖపట్నం జిల్లా యలమంచిలి తాలూకా లోని గుడివాడ, గుర్రాజుపేట గ్రామాలకు జూలై నెలలో విద్యుచ్ఛక్తి సరఫరాచేయడం జరిగింది

నెల్లూరు జిల్లా కొవ్వూరు తాలూకా పెమ్మరెడ్డి పాలెం గ్రామానికి కూడా అదేనెలలో విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడినది,



# పారిజాత సౌరభము

యస్వీ జోగారావు

హరివంశఖని నుండి బయల్వెడలిన యొక అనర్ఘమణి పారిజాతాపహరణము. తిమ్మన గంటపు శాణోపలమున బడి జాతి రత్నమైనది. రసోచితములైన మార్పులవధరించినది

సుదీర్ఘ పుర వర్ణనానంతరము కథోపక్రమము నాటి ప్రబంధ కవుల పరిపాటి. అట్లుకాక "హరి నరకాసురుం గెలిచి"యను పద్యమున పూర్వ సందర్భ స్మరణమాత్రమున సూటిగా ప్రబంధ కథా ప్రరోచనగావించినాడు తిమ్మన కృత్యాది యందు స్తుత్యాదికమున సున్నితపు చూపుతో కావ్యార్థసూచనయు చేసినాడు. అక్కడి "పొలతుల్ గౌగిటఁ గ్రుచ్చియెత్తి", "సరసపుటల్కఁ దీర్చుతటి"అను పద్యములు వరుసగా పారిజాత కథలో ప్రధానాంశములైన సత్యభామ సవతి మచ్చరము, పొలయలుక అను వానికి సూచకములుగ నున్నవి. సాధారణముగ కావ్యావతారికలలో స్తుత్యాదికమున చంద్ర ప్రశంస యుండదు. కాని యిందు "వలిమల యల్లువాడు తలవాఁక ధరించిన పూవుగుత్తి...వెన్నెలల్ మొలిచిన పాదు, పాల్కడలి ముద్దులపట్టి నృసింహ కృష్ణరాయలఁ గరుణారసంబు నిను పారెడి చూపులఁ జూచు గావుతన్" అని కృతిపతి శుభాశంసన పరముగ నున్నది ఆ పద్యము హృద్యముగా నున్నమాట యటుండ అది వెన్నంటి వచ్చు కృతిపతి వంశావళి వర్ణనకు చక్కని ప్రాతిపదికయైనది

కథ శీఘ్రగతితో చకచక సాగిపోయి నది నడుమ నొక పెద్ద వెలితి యేర్పడినను సురుచిర వర్ణనలతో రమణీయ రచనా విన్యాసముతో పరువులు వారి చివర మరల చక్కని సన్నివేశముతో కౌతుకవ్యంజకత నిలద్రొక్కుకొన్నది ఇందు కథ కంటె కథన విధానము పరమ రమణీయము. వస్తు సన్నివేశము స్వల్పమైనను ఒక్కొక చిన్న సన్నివేశమున పాత్రలు పొందిన చేష్టా ప్రతీఘాతములు, భావావర్త పరంపరల ద్వారా కథ దాని మానాన నది యొక నాటకేతివృత్తము వలె త్వరితగతి పయనించుచుండును ప్రత్యనంతర సన్నివేశమును పూర్వ సన్నివేశముల స్వాభావిక పరిణామముగ దోచును చకచక కథా రంగముల మార్పు, పాత్రల వివిధ భావసమున్మీలనము, ఆ మనసుల మధ్య అభిప్రాయ సేతువులైన ముఖాముఖీన చతుర సంవాదములు, చేష్టలు, ప్రతీఘాతములు అంతయు నతిమాత్రమనోజ్ఞ రూపక సన్నివేశము వలె నడచును సందర్భ సుందర మగు నారద కృత కృష్ణ స్తుతితో ప్రబంధోపసంహారము అచటి అనులోమ కందము, పాదభ్రమకము, బంధగర్భాది చిత్ర కవిత్వపు వైచిత్రి స్తుతి సందర్భోచితములు, సురుచిర రచనా చణములు .

జీవ కళామూర్తులగు పాత్రలను జాతి రత్నములు పొదిగి ఉత్తమ రసికానుభవైకవేద్యమగు సురుచిర శృంగార భృంగారువున పుటము పెట్టిన పదార్వన్నె బంగారు నగ యీ పారిజాత కథ. ఇందలి ప్రతిపాత్ర, వర్ణన, ప్రతి రస భావ సన్నివేశము "మిన్నేటి పసిండి నెత్తమ్మి చిగురుటాకునం బొదివిన పారిజాతంపు క్రొన్నన"యే.

ఆ మానవతీ లలామ, ఖండిత నాయికా ప్రపంచమునకెత్తిన ఏకైకధ్వజము, స్వాధీన పతికా ప్రతిష్ఠామహిత, సార్థకనామ సత్యభామ, రసజగత్సమ్రాట్టు లతాంతాయుధుఁ గన్నతండ్రి, జగదేక దక్షిణ నాయకుడు, సత్యభామా విధేయ బిరుద గౌరవ విరాజితుడా శ్రీ కృష్ణమూర్తి, మరి యా 'పోరోగిరము తిండిపోతు' నారదుడు మొదలగు పాత్రల స్వభావ జీవలక్షణము తిమ్మనగారి పారిజాత కావ్యముతోనే ఆంధ్రులకు సుపరిచితమైనది

సత్యాగ్రహ సన్నివేశ మొకటి యీ కావ్యమునందలి కండపట్టు. అక్కడ తిమ్మన తాతగారి కవితా పారిజాత మపూర్వ సౌరభములు గుబాళించినది

రచన సర్వత్ర రసప్రసన్నమై కవి గంటము కలకంఠ కంఠమై కావ్యగానము చేసినది ముద్దులు మూటగట్టు తేటమాటలతో సల్లేరుపై బండి నడకవలె శయ్యా నొయ్యారముగా నడిపించుటలో నంది తిమ్మన దండెవేసిన చేయి. 'ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు' తెలుగు నాట కొక సామెతయై

పోయినది ఆతని నాయిక యేడ్పును ముద్దు ముద్దుగనే యున్నది అందును 'బాలపల్లవ గ్రాస కషాయ కంఠ కలకంఠ వధూకల కాకలీ ధ్వని' యే వినిపించినది "Poetry is musical thought," "Poets are rythmic beings" అను ఆభాణకములకు యథాక్షరముగా లక్ష్యకోశ మతని ప్రబంధము. మన వాఙ్మయమున పద్య రచనలో నింతటిసున్నితపు సన్నపోగారు పని మరి లేదు .ఆ శైలీ లాలిత్య మనితర సాధ్యము.

సంవాద సందర్భములందు సరస ప్రసన్నము సహజ మసృణము నైనను వర్ణనల పట్టున తాతగారి శైలికి పడుచుదనపు ప్రాగల్భ్యము వచ్చినది అది యుద్ధఘట్టము నందు మరియు నురవడించినది ఉదా॥ ఇంద్ర ప్రయుక్త వజ్రాయుధ వర్ణన

శతధారాజాయమాన జ్వలనముఖ
శిఖాచ్ఛాదితాభ్రస్థలంబై
వితతాఖిల ధ్వని శ్రీ విలసన
బధిరోద్విగ్న దిగ్వారణంబై
కృతలోకాలోక ముఖ్యాఖిలగిరి
చలన క్షిప్త భూమండలంబై
పతయాళుద్వాదశాత్మ ప్రఖరతర
రోపమ్మై యేగుదేరన్."

వర్ణనలలో నొక ఊర్ణనాభ స్వభావము గోచరించినను అందు కొన్ని అందదుకులవలె నున్నను ఆ యదుకులు కథాగతిని బట్టి పోల్చుకొన దగినవే కాని అవి యెక్కడి కక్కడ సద్యోహృద్యములుగా నుండును.

ఉదా॥ ప్రకృతి చిత్రణము -

1 ప్రకృతి సౌభాగ్య సర్వస్వమునకు కాణాచి గదా నందనోద్యానసీమ. అది

"రంభా మహోరోజ కుంభ పరీరంభ
కుసుమిత ప్రత్యగ్ర కురవకంబు
మంజుఘోషా వక్త్రకంజాత చకచక
స్తబకిత చంపక క్ష్మారుహంబు" మొ॥

"కనుపట్టె నొకచోట ఘనఘనా ఘనరంగ
విద్యున్నటీ నాట్య విలసనములు
చూపట్టె నొకచాయ వాపికా జలజాత
జాలవాచాల హంస వ్రజంబు" మొ॥

ఈ రెండు సీసపద్యముల రచనలోను, భావనలోను ఒక వైలక్షణ్య మున్నది. మొదటిదానిలో ఏ పాదమున కాపాద మేక సమాస నిబద్ధముగా నచటి చెట్టు చేమలు, వాని కప్పురసలు కావించిన దోహదములు ఆరామము నంతటి నొక్కపరి కలయజూచు వారికి కనుపట్టు విధముగా చెప్పబడినవి. రెండవదాన నందలి యొక్కొక్క సన్నివేశము ప్రత్యేకముగా పరికింప బడినట్లుగ చెప్పబడినది ఆరామ రామణీయక మెట్లో ఆ వర్ణనయు నట్లే సర్వాంగణ శృంగారభావ స్ఫూర్తి మంతముగా సాగినది, అందులకే పండుటాకుల మధ్యను పచ్చగా నొక తీగను జూచినజాలు రసికశిఖామణియగు శ్రీకృష్ణుని మనసున వెనుకటి మధుర స్మృతులు ఆ లతలు పుష్పవతులైనట్లు స్ఫురించును. చూడుడు

"మలయ సమీరణచ్యుత సమంచిత
పాండు పలాశలైన పా
దుల నునుసోగతీఁగలు యదు ప్రభునిం
దలపించె బాల చా
పలహృత తీరవస్త్రలయి పంకరుహాకర
మధ్య సీమలన్
నిలిచిన ముగ్ధగోప రమణీ రమణీయ
విలాస రేఖలన్"

ఒక మధుర సన్నివేశమును తిలకించినంత రసికులకు స్మృతి సిద్ధమైన మరియొక తాదృశ మధురానుభవము స్ఫురణకు వచ్చుట పరిపాటి పాములరాలిన పండుటాకుల మధ్యనున్న పసుపుపు తీగలట నాడు గట్టుపై చీరలుపెట్టుకొని జలకేళి సల్పిన గోపికల విలాసములకు జ్ఞాపకము వైనవట! ఆహా! తాతగారి సుకుమార భావన! అనుభవ సిద్ధుడగునో కాదోగాని మనశ్శాణోపల రేఖా మయూఖ మాతని రసికత్వము ఇక్కడ ఒకపాత్ర పొందిన అనుభూతి ద్వారా సన్నివేశగత సౌందర్యమును వ్యక్తము చేయుట, అను మరియొక శిల్ప పరిమార్గ మును గ్రహింపబడినది

తన సౌందర్య రిరంసకు, రశికాభినివేశ మునకు దగినట్లు తాతగారికి స్వర్గవర్ణన, పారిజాత కథయు తటస్థపడినవి తరువాత పారిజాతమును సత్యభామ నింగినుండి నేల కెట్లు తెచ్చినదోగాని తాతగారు మాత్రము తన వర్ణన నైపుణి ద్వారా ఆ అపరూప స్వర్గఖండమును భూమండలమునకు దింపి నారు. పాకరిపుని ఆ సంక్రందన స్యందన నిరాఘాట ఘంటాపదములగు నందనోద్యాన వనవాటికటికల పర్యటింప జేసినారు. అట్లు సుఖ సమగ్రముగాని లోప భూయిష్ఠమైన యీ లోకమునుండి ఒక లోకోత్తర సుందర సుకుమార సుఖసమగ్ర వ్యధావిదూర మధురానుభవ సమాన భావనామయ జగత్తులోనికి గొనిపోయి సహృదయ హృదయమునకు సద్యఃపర నిర్వృత్తినిచ్చుట కావ్యప్రధాన ప్రయోజనము గదా!

2 ఇక చంద్రకిరణ ప్రసరణము నెంత మధురభావ మసృణముగ చిత్రించెనో చిత్తగింపుడు:

"కెంపిలి పీఁకటిమ్రాను గెడపంగ నిక్కిన
సమయగజంబు దంతము లనంగఁ
జదలుగేదఁగి తూర్పు తుదకొమ్మ నరవిరి
యై కానిపించు పూరేకు లనఁగఁ
బొడుపు గుబ్బలినేల సురిటింటి యిడుపునఁ
జఱచిన గందంపుఁజట్ట లనఁగ
మరునిముందఱ బరాబరి సేయు కంచుకి
కులముచేతుల వెండిగుదె లనంగ
గైరికములకు వెన్నెలనీరు వరవఁ
బూనిచేర్చిన పటికంపుదోను లనఁగఁ

గ్రమముతో శీతకరమయూఖములు గగన భాగమునఁ గొన్నియల్లనఁ బ్రాఁకుదెంచె". ఇందలి రూపకోత్ప్రేక్షలు, వెన్నెలరేకులు ప్రాకుచున్నట్లా విడివిడి పదబంధముల పొందికయు మనోజ్ఞములు, 'చిగురు విలుకానిజాతర సేయఁబూని' చకోరంపు పేరటాండ్రు చేసుకొన్న బువ్వపుబంతి విందొకటి కమ్మగా వర్ణింపబడినది. విరహాల మైసోకి వేడెక్కిపోయిన వెన్నెలతో పచ్చివెన్నెలను నులివెచ్చ జేసి నారట! ఇట్లా సాగినదా వర్ణన. "చరమాద్రి దావాగ్ని సంప్లుష్ట సురసౌరభేయీ కరీషైక పిండ మనఁగ..." ఈ విధముగ సాగించినాడు "చెలువు వోకాడి బింబావశిష్టుడైన" చంద్రుని అస్తమయవర్ణన. అతిలోకమైన భావనయందు పారిజాతము వలెనే అతుల మహానుభావ మతని ప్రతిభ.

*వ్యక్తిచిత్రణము* : ఇది స్వరూప చిత్రణము, స్వభావ చిత్రణము నని ద్వివిధము.

*అందుస్వరూప చిత్రణము* : సందర్భము నారదాగమనము :–

"సరిగమ పదనిస సంజ్ఞ స్వరంబుల
మహతి నభోవాయునిహతిమొరయ
భాగీరథీ పయః పరిపూర్ణ మణికమం
డలువు హస్తంబున చెలువు మిగుల
బ్రణవ మంత్రా వృత్తి పావన స్ఫటికాక్ష
వలయంబు కర్ణ శష్కులిక వ్రేల
సమరనృత్యోచిత చమర వాలంబును
గక్షపాలయు భుజాగ్రమున మెఱయ
దేహకాంతు లకాల చంద్రికల నీల
జడలు మోక్షద్రు పల్లవ శంక సేయ
గగనమున నుండి వచ్చె నాకస్మికముగ
నారి పేరంపుఁ దపసి దైత్యారి కడకు."

స్వరూప చిత్రణము వ్యక్తియొక్క శారీరక స్వరూప నిరూపణము. శరీరము నావరించుకొనియున్న వివిధ వస్తు భహిఃస్థితి నిరూపణము నని రెండు విధములు. మొదటిదా వ్యక్తియొక్క సౌందర్యమునకో, వికృతత్వమునకో ప్రధానముగ ప్రసక్తి యేర్పడు నవసరములం దుండుటయుచితము. నారదుని విషయమై ఆ విధమైన ఆకార వర్ణనకు నిమిత్తములేదు. ఆహార్యాను గుణమైన ఆ రెండవ పక్కియే అవలంబనీయము. అతడొక మహామునీశ్వరుడు. ఆ మునివాలక మెట్టిదో అదియే మనకు గావలసినది. రూపముతో గాదు. అందును నిరంతర నాద బ్రహ్మోపాసకుడు, సంగీత ప్రపంచమున సనాతన ప్రతిష్ఠ గలవాడు, వీణాముని యని పేర్వడసినవాడు. ముందాతని మునివాలకము కంటె ముఖ్య దర్శనీయ మతని వీణ. అందులకే అన్నిటికంటె ముందుగా ఆ మహతి ప్రశంసను, అంతకంటె ముందుగా విన వచ్చు సంగీతము ప్రశంసను చేసిన కవి మెలకువ మెచ్చదగినది. ఆ జడలు మోక్షమను వృక్షముయొక్క పల్లవము లనుటలో ఆయన మూర్తీభవించిన మోక్షమను నర్థము గమ్యమానమగుచున్నది.

ఇక వ్యక్తి స్వభావ చిత్రణమునకు "వజ్రంబునకు నీఁక వైచిన బలశాలి! గజ కచ్ఛ పాశన ఘాతకుండు..." అని యిట్లు సాగిన గరుడని వర్ణన, "భోజకన్యా సరిద్రాజహంసము, సత్యభామా శుకీకేళి పంజరంబు..." అని సాగిన శ్రీకృష్ణ ప్రశంస, ద్వితీయా శ్వాసమున వివిధ దేవయోని నిరూపణము నుదాహరణములు. వస్తుస్థితి చిత్రణమునకు "జీర్ణపర్ణద్రు సంకీర్ణహిమమణి విభా! మాయాకిసల వంచ్యమానపికము.." అనిసాగిన మేరుపర్వతవర్ణన మొకచక్కని లక్ష్యము. ఆ వస్తు స్థితియే స్తబ్దముగా గాక క్షుబ్ధముగా నున్నప్పు డా యుచ్చల దుద్వేల స్థితి నెంత యతివేల కౌశలముగ తిమ్మనార్యుడు చిత్రించినాడో చూడుడు :

సందర్భము : ఇంద్రుని హజారమున కదనాభి శంసియై నిస్సాణము మ్రోగినది–

"అపుడా బద్ధళిలీన కాశ్యచయమై
యందూ పరిభ్రం శిత
ద్వీపమై దివ్యరథాగ్ర కేతుపట
సంధిత్సా మిళత్స్వాతమై
యపరాధూత ధుజావ లేప ఘట
వీరాలాపమై జంభవై
రి పురం బంతయు మందరక్షుభిత
వార్థింబోలె ఘూర్ణిల్లుచున్."

స్వర్గపుర మంతయు కలగుండు వడినది. చతురంగ బలములుదండడి సందడించినవి. ఆ స్థితిని అమరులకు పరిచిత పూర్వమైన సముద్ర మథనముతోనే సరిపోల్చుటలో స్వారస్య మున్నది.

(సశేషము)

## కమ్యూనిటీ రేడియో సెట్లు

గత జూలై నెలలో కమ్యూనిటీరేడియో సెట్లను నెలకొల్పిన గ్రామాలు, సంస్థలు :

సిద్దిపేట సమాచారకేంద్రం, మల్లియాల్ పంచాయతీ బోర్డు, సదాశివ పేట పురపాలక సంఘం (మెదక్ జిల్లా)

జడపేట అనబడే మల్కాం, కాపు సంఘం, ఖండ్యం (శ్రీకాకుళం జిల్లా)

నరసాపురం, వైజాగ్ సమాచారకేంద్రం, కొత్త వెంకోజిపాలెం (విశాఖపట్టణం జిల్లా)

వెల్లూరు II, కన్నాపురం (పశ్చిమ గోదావరిజిల్లా).

అన్నవరం (గుంటూరు జిల్లా).

గూనల్లకుంట, పెద్దసెట్టిపల్లి [ఎమ్] టి. చౌదరి వారిపల్లి, చిన్నక్కెపల్లి, జిల్లా సమాచారకేంద్రం, మన్నూరు, సరస్వతి పురం (కడపజిల్లా).

కాపుగల్, ఆకారం, షద్బుల్లాపూర్ (బోయనపల్లి పంచాయతీ)

పల్లివాడ, బుబ్బక, ఆరూరు (నల్గొండ జిల్లా).



# బంగారం కంట్రోలు, నిర్బంధ డిపాజిటు పథకాలలో మార్పులు

బంగారం కంట్రోలు, నిర్బంధ డిపాజిట్ల పథకాలను గురించి కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ టి.టి. కృష్ణమాచారి సెప్టెంబరు 21 వ తేదీన లోక్‌సభలో చేసిన ప్రకటనలో యీ క్రింది వివరాలున్నాయి.

బంగారం కంట్రోలు విషయంలో ప్రభుత్వ విధానం ప్రాతిపదిక లక్ష్యాలను పూర్వ ఆర్థిక మంత్రి యీ సభలో అనేక సార్లు వివరించారు. బంగారం దొంగ రవాణావల్ల మన విదేశమారక ద్రవ్యం వనరులకు దెబ్బతగులుతోందనడంలోఎవరికీ సందేహం వుండదు. బంగారం ముద్దలూ, కడ్డీల రూపంలో బంగారం వ్యాపారాన్ని అరికట్టి, తద్వారా బంగారం దొంగ రవాణా వ్యాపారుల ఆటకట్టించడమే యీ ఉత్తర్వు ప్రధానోద్దేశం. అంతేకాదు, 14 క్యారట్ల వన్నెకంటే హెచ్చు వన్నెగల బంగారం నగల తయారీని నిషేధించడం ద్వారా, బంగారానికి గిరాకీని తగ్గించడం యీఉత్తర్వు రెండవ లక్ష్యం. ఇవి మంచి లక్ష్యాలనీ, దేశప్రయోజనాల దృష్ట్యా, సమర్థనీయమనీ ప్రభుత్వం అభిప్రాయం. ఈ లక్ష్యాలను విడనాడే ప్రసక్తి లేదు. కాని ఆచరణలో ఎదుర్కోవలసి వచ్చే అనేక సమస్యలనూ, ప్రజల ఇబ్బందులనూ, బంగారంపై ప్రజలకు గల మోజునూ, బంగారం కంట్రోలును గురించిన ప్రజల అభిప్రాయాలనూ పరిశీలించిన మీదట ప్రభుత్వం యీ క్రింది నిర్ణయాలు చేసింది.

## స్వర్ణకారులకు రాయితీలు

బంగారంతో పనిచేసే వారిని గురించి ఆలోచించేటప్పుడు మొదట మరొకరిదగ్గర పనిచేయక తమంత తాముగా పనిచేసుకుంటున్న స్వర్ణకారులను గురించీ; ఆ తర్వాత పెద్దపెద్ద స్వర్ణకారుల వద్దా, నగల వ్యాపారస్థుల వద్దా పనిచేసే స్వర్ణకారులను గురించీ ఆలోచించవలసి వుంది. తమంత తాముగా పనిచేసుకుంటున్న స్వర్ణకారులకు పూర్వపు స్థితిని కల్పించడానికి గాను ఒక కార్యక్రమం వుంది. ఈ సమస్యను క్షుణ్ణంగా పరిశీలించాం. దీనికిగాను కేటాయించిన మొత్తం, స్వర్ణకారులందరికీ యథాస్థితి కల్పించేటప్పటికి, మరికొంత పెరుగవచ్చు. తమ జీవనాధారానికి పూర్తిగా బంగారు వస్తువులను తయారు చేయడం పైనే ఆధారపడిన యీ స్వర్ణకారులకు ఉపాధి కల్పించడానికి నిశ్చయించిన యీ బృహత్తర కార్యక్రమం ఒక్క రోజులో పూర్తి చేయడం అనేది సాధ్యం కాని విషయం.

ఒకరివద్ద నౌకరీ చేయక, నగలు తయారు చేసుకుంటూ తమంత తాముగా పొట్టపోసుకుంటున్న స్వర్ణకారులకు నామమాత్రపు రుసుము వసూలుచేసి లైసెన్సులు మంజూరు చేయాలని యిప్పుడు ప్రభుత్వం నిర్ణయించింది. ఇప్పటి నగలను కరిగించి అంతే వన్నెగల నగలను (అంటే 14 క్యారట్ల వన్నెకంటే హెచ్చు వన్నెకల) తయారు చేసేందుకు కొన్ని షరతులకు లోబడి, వారికి అనుమతి యిస్తారు. అంటే, వారు తమ వృత్తిని కొనసాగించుకొనవచ్చునన్న మాట. ఇక, లైసెన్సు గల వ్యాపారులు పురమాయించే నగలను తమ యింటివద్ద కూర్చునే తయారు చేసే స్వర్ణకారులు 14 క్యారట్ల వన్నెకు మించిన ముద్ద బంగారాన్ని ఒక పరిమితిలోబడి తమవద్ద నిలవ వుంచుకోవచ్చును. స్వర్ణకారులకు పునరుపాధి కల్పనకు జరిగే దీర్ఘ కాలిక కృషికితోడు పైన పేర్కొన్న ఈ చర్యల ద్వారా స్వర్ణకారులకూ, నగల తయారీ వృత్తిలోవున్న యితర పనివారికీ జీవనోపాధికి ఎట్టిలోటు వుండబోదని ప్రభుత్వం ఆశిస్తోంది.

ఈ మినహాయింపులు బంగారం విక్రయాన్నీ, హెచ్చు నాణ్యం గల బంగారం ఆభరణాల తయారీని నిరుత్సాహ పరచాలన్న ప్రభుత్వం యొక్క దీర్ఘ కాలిక విధానంలో ఎట్టిమార్పుకు తావివ్వవని శ్రీ కృష్ణమాచారి ఉద్ఘాటించారు. బంగారంతో కొత్త ఆభరణాలు చేయించుకోదల్చుకున్నవారు 14 క్యారట్ల బంగారంతోనే చేయించుకోవాలనీ, 14 క్యారట్లను మించిన బంగారాన్ని అమ్మడం గాని, 14 క్యారట్లు మించిన బంగారు ఆభరణాలను వ్యాపారులు ప్రదర్శించడం గాని జరగదని కూడా ఆయన స్పష్టీకరించారు. ప్రస్తుతం వున్న ఆభరణాలను 14 క్యారట్ల బంగారం ఆభరణాలుగా మార్చుకోవల్సిన అవసరం పరిమితంగా వుందనీ, ఆ విధంగా చేయించుకోదల్చిన వారు స్వంతంగా స్వర్ణకారులను పెట్టుకుని మార్పించుకుంటే వారికి ఉపాధి కల్పించిన వారు కాగలరని కూడా ఆర్థికమంత్రి అన్నారు.

## నిర్వహణాధికారి

ఆ చర్యలను అమలు జరపడానికి పాలక వ్యవస్థా స్వరూపంలో ప్రభుత్వం కొన్ని మార్పులు చేయదల్చిందనీ, ప్రభుత్వానికి సలహా యివ్వడానికీ, ఈ విధానం అమలు విషయంలో పెత్తందారీ తనం వహించడానికి ఒక సలహా సంస్థను నెలకొల్పడానికి ప్రస్తుత నిబంధనలు అవకాశమిస్తున్నాయనీ, అయితే ఈ విబంధనల అమలు బాధ్యత ప్రధానంగా కేంద్ర ఎక్సైజు శాఖకు అప్పగించారనీ, విషయాన్ని జాగ్రత్తగా పరిశీ

లించిన మీదట విధానం నిర్ణయించే బాధ్యతను అమలు బాధ్యతను వేరుచేయడం సముచితం కాదని భావించి, కేంద్ర రెవెన్యూ శాఖలో బంగారం కంట్రోలు అడ్మినిస్ట్రేటరును నియమించాలని ప్రభుత్వం నిర్ణయించినదనీ ఆయన బంగారం కంట్రోలు విధానం, నిర్వహణల వ్యవహారాలను చూస్తారనీ ఆయన చెప్పారు.

బంగారం కంట్రోలు నిబంధనలను మొదట్లో రూపొందించినప్పుడు దేశరక్షణ నిబంధనలకు సవరణలుగా ప్రకటించడం వీలైన పద్ధతని భావించబడిందనీ, గణించిన అనుభవం దృష్ట్యా (పరిశ్రమలలోనూ, వస్తువులలోనూ బంగారం వాడకాన్ని దృష్టితో వుంచుకొని సమాజంలో అధిక సంఖ్యాకులపై వర్తించే యీ పథకాన్ని కొద్దిపాటి మార్పులతో) పార్లమెంటు ఆమోదంతో ప్రత్యేక చట్టంగా రూపొందించాలని ప్రభుత్వం నిర్ణయించి త్వరలోనే ఒక బిల్లును పార్లమెంటులో ప్రవేశ పెట్టగలదనీ శ్రీ కృష్ణమాచారి చెప్పారు.

## నిర్బంధ డిపాజిటు పథకం

పార్లమెంటు ప్రస్తుత సమావేశంలో అనేకమంది సభ్యులు ఆతురతతో ఎదురు చూస్తున్న నిర్బంధ డిపాజిట్ల పథకం సంగతి ప్రస్తావించి, అది వర్తింప చేయదల్చిన 5 వర్గాలలో మూడు వర్గాలవారి — భూమిశిస్తు చెల్లించేవారు, నగరాలలో ఆస్తులున్నవారు, అమ్మకం పన్ను చెల్లించేవారు— విషయంలో ఆ పథకం యింకా అమలు జరగనేలేదని ఈ పథకాలను, వారి వారికి సంబంధించిన రాష్ట్ర ప్రభుత్వాలు, స్థానిక అధికారుల ద్వారానే అమలు పరచవలసి వుంటుందనీ, ముసాయిదా పథకాలను తయారుచేసి, రాష్ట్ర ప్రభుత్వాలకు వారి అభిప్రాయాలను తెలియజేయవలసిందిగా పంపించడం జరిగిందని కూడా వ్యక్తం చేశారు. అందలి సమాధానాలను బట్టి, వీనిలో అనేక కష్టనష్టాలు వున్నాయనీ, ముఖ్యంగా భూమిపన్ను చెల్లించేవారి విషయంలో గలవనీ, అర్థమవుతున్నది. భూమిపై విధించేపన్ను రేటేగాక, పన్ను విధించేకాలమూ, వసూలుచేసే విధానమూ, వసూలుచేసే వ్యక్తులు ఒక రాష్ట్రానికీ, మరో రాష్ట్రానికీ, ఒక్కమాదిరిగానే లేక అనేకవిధాలుగా వున్నాయి. మిగతా రెండు పథకాల విషయాలలో కూడా డబ్బు వసూలులో సాధక బాధకాలు ఉన్నాయని వ్యక్తంచేయడం జరిగింది. చాలా మునిసిపాలిటీలు పట్టణ ప్రాంతాలలోని ఆస్తులపై పన్నులు విధించక పోవడంవలన నిర్బంధ డిపాజిటును వసూలు చేయడంలో అనేక ఆచరణ సాధ్యంకాని సమస్యలు ఉత్పన్నమవుతాయి. అమ్మకపు పన్ను చెల్లించేవారు అంతకు పూర్వమే ఒకసారి అమ్మకపు పన్ను చెల్లించి వుంటారుగనుక వారికి యీ నిర్బంధ డిపాజిటు అదనపు బరువును కలిగిస్తుందనీ, అదీగాక యీ రెండు పథకాల పైనా వచ్చే ఆదాయం మిగతావాటితో పోల్చి చూస్తే చాలాతక్కువని కూడా రాష్ట్ర ప్రభుత్వాలు తెలియజేశాయి.

ఆచరణలో ఎదురయ్యే యీ సమస్యలే గాకుండా ఆ పథకం నిర్వహించవలసిన రాష్ట్ర ప్రభుత్వాలు అనేక చిక్కులరీత్యా భూకామందులు, స్వల్పాదాయ వర్గాలపైన, పన్ను రూపంలో కాకపోయినా ఆదా రూపంలోనైనా అదనపుభారం కలిగించడానికి సుముఖంగా లేవనీ శ్రీ కృష్ణమాచారి చెప్పారు. ఈ నిర్బంధ డిపాజిట్ల పథకం వల్ల ప్రధాన ఉపయోగం పొందేవి రాష్ట్ర ప్రభుత్వాలే కావటం, భూశిస్తు చెల్లించే వర్గాలనుంచి లభించే డబ్బంతా వారికే చెందవలసి వుండటంతో, మొత్తం ఈ పథకాన్నంతా మరోసారి పరిశీలించి తమ భావాలను వెలిబుచ్చవలసిందని రాష్ట్ర ప్రభుత్వాలను కోరటం సముచితమని భారత ప్రభుత్వం భావించింది. ఆవిధంగా నేను రాష్ట్ర ముఖ్యమంత్రులందరికీ లేఖలు వ్రాశాను. ఈ పథకాన్ని అమలు పరచాలో, మార్పు చేయాలో, లేదా దీన్ని మానేయాలో తెలుపవలసిందని వారిని కోరాను. వారు పంపిన సమాధానాలను బట్టి చూస్తే, భూశిస్తును చెల్లించే వర్గాలకు ఈ పథకాన్ని వర్తింపచేయరాదన్న భావాన్ని అందరూ దాదాపు ఏకగ్రీవంగా వెలిబుచ్చారు. పట్టణాలలో ఆస్తిపాస్తులు వున్నవారికీ, అమ్మకం పన్ను చెల్లించే వారికీ గూడా ఈ పథకాన్ని వర్తింప చేయరాదని వారిలో చాలామంది సూచించారు. భూకామందులకు పట్టణాలలోని ప్రజలకు ఈ నిర్బంధ డిపాజిట్ల పథకం అనువర్తింప చేయటం వలన స్వచ్ఛందంగా యిచ్చే విరాళాలు తగ్గుతాయన్న విషయాన్ని కొంతమంది ముఖ్యమంత్రులు తెలిపారు. ఇది విస్మరించటానికి వీలుగాని విషయం.

ఈ సిఫార్సులన్నిటినీ దృష్టియందుంచుకొని భారత ప్రభుత్వం ఈ నిర్బంధ డిపాజిట్ పథకాన్ని సమీక్షించింది. ఒకే ఆదాయపు వర్గాలకు ఒకే ఆర్థిక స్థాయికి చెందిన వ్యక్తులందరూ ఒకేవిధంగా త్యాగాలు చేయునట్లు చూడటం ధర్మం. జీతాలు పొందే పనివారికి సౌలభ్యం కలిగించకుండా మనం భూశిస్తును చెల్లించే వర్గాన్ని ఈ పథకం నుంచి మినహాయించలేము.

అందువల్ల భూమిశిస్తు చెల్లించేవారు పట్టణ ప్రాంతాలలో స్థిరాస్తులు గలవారు, అమ్మకంపన్ను చెల్లించే వారికి సంబంధించిన పథకాలను విడిచి పెట్టేయాలని భారత ప్రభుత్వం నిర్ణయించింది. ఆదాయపు పన్ను చెల్లించేవారి వర్గంలోనికిరాని జీతం తీసుకుంటున్నవారి విషయంలో కూడా యిదే పద్ధతి అవలంబించ బడుతుంది. ఇంతకుముందే డిపాజిటు చేయబడిన వారికి ఆ డబ్బును వడ్డీతోసహా సాధ్యమైనంత త్వరలో యిచ్చివేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఇంతవరకూ యీ పథకాలు అమలులోకి రాలేదు.

ఆదాయం పన్ను చెల్లింపుదారుల వర్గం క్రిందకు రాకుండా ఉంటూ నెలసరి జీతం పుచ్చుకొనే ఉద్యోగుల విషయంలో ఇటువంటి మినహాయింపే వర్తింపచెయ్యాలని

ప్రభుత్వం అభిప్రాయ పడుతోంది వీరు ఇప్పటికే ఇలా డిపాజిట్ చేసినసొమ్ము మొత్తాలు వడ్డీతోసహా వెను వెంటనే ఎటువంటి ఆలస్యం చేయకుండా తిరిగి ఇచ్చి వెయ్యడానికి ఏర్పాట్లు జరుగుతాయి ఇక ఆదాయంపన్ను చెల్లింపుదారుల పరిస్థితి వేరు వారికి సంబంధించినంత వరకు వారు చెల్లించే ఆదాయం పన్ను రేటు బాగా పెరిగింది వారికి ఇలా పెరిగినదాంట్లో కొంతభాగం ఐచ్ఛిక పద్ధతిని ఈ నిర్బంధ డిపాడిట్ పథకానికి విరాళంగా పేణా చెల్లించే అవకాశం ఉన్నది ఈ పథకం విడనాడే ఎత్తంలో వారికి పెద్దఇబ్బందే కలుగుతుంది

అందుకు కారణం ఏమంటే అయిదేండ్ల తర్వాత తిరిగి చెల్లించబడే డిపాజిటుకు విరాళం చెల్లించడానికి బదులుగా వారు పెద్ద మొత్తాలు ఆదాయంపన్ను చెల్లించవలసి వస్తుంది అందువల్ల ఆదాయంపన్ను చెల్లించే వారివిషయంలో ఈ పథకమున్నందుకూడా కొనసాగింప బడుతుంది ఈ మార్పులకు సభవారిమద్దతు లభించగలదని ఆశిస్తున్నాను

ఇప్పుడు నేను ప్రకటించిన నిర్ణయం మూలంగా ప్రభుత్వ ఆదాయానికి పెద్ద నష్టమే కలుగుతుంది స్వచ్ఛంద పొదుపు ఉద్యమంద్వారా ఇంకా ఎక్కువ మొత్తాలు రాబట్టడం ద్వారా ఈ నష్టాన్ని పూర్తిగా భర్తీ చెయ్యవచ్చునని ప్రభుత్వం ఆశిస్తున్నది ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో మొదటి అయిదు నెలలలో చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం ద్వారా చాలా పెద్ద మొత్తం – రూ 31 కోట్లువసూలైంది ఈ మొత్తం గత సంవత్సరంలో మొదటి అయిదు నెలలలో ఇలా వసూలైన దానికంటె రెండురెట్లు ఎక్కువ ఈ వసూళ్ళు జరపడానికి తీవ్రకృషి చెయ్యాలని ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది ఈ వసూళ్ళలో మూడింట రెండింతలు పుచ్చుకొనే రాష్ట్ర ప్రభుత్వాలు కూడా ఉత్సాహంతో ఈ కృషిలో పాల్గొనగలవని ప్రభుత్వం విశ్వసిస్తున్నది ★

# పారిశ్రామిక విశేషాలు

## కేంద్ర రంగం

సింథటిక్ మందుల ప్రాజెక్టు, భారీ విద్యుత్పరికరాల ప్రాజెక్టుల నిర్మాణ కార్యక్రమాలు త్వరిత గతిని జరుగుతున్నాయి రష్యా, భారతదేశాల నిపుణులు ఎలక్ట్రానిక్స్ ఫ్యాక్టరీకై హైదరాబాదు ప్రాంతంలో అనేక స్థలాలను పరిశీలించారు

## ప్రయివేటు రంగం

కొంతమంది ప్రయివేటు వ్యక్తులు కలిసి విదేశ సహకారంతో బోధన్‌లోని బగస్సీ వద్ద 5 కోట్ల రూపాయల ఖర్చుతో పేపరు, పేపరు గుజ్జు తయారు చేసే ప్లాంటును ఒకదానిని నెలకొల్పే విషయమై అందజేసిన ఒక పథకాన్ని భారత ప్రభుత్వం సూత్రప్రాయంగా అంగీకరించినది. ఈ ప్లాంటును నెలకొల్పేందుకు అవసరమైన ప్రాథమిక చర్యలను ఆరునెలలలోగా పూర్తి చేసేందుకు వీలుగా ఆమోద పత్రాన్ని అందజేసింది.

*సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్*

సింగరేణి గ్రూపుకుచెందిన బొగ్గు గనులలో 1963 జూన్ నెలలో 2,54,782 2 టన్నుల బొగ్గులభించగా అదేకాలానికి గత సంవత్సరం 2,42,893,0 టన్నులు బొగ్గు లభించింది.

1963 సం. లో జూన్ మాసాంతానికి లభించిన మొత్తం బొగ్గు 15,70,42 6 టన్నులుకాగా అదేకాలానికి గతసంవత్సరం 14,28,067 టన్నులు వుంది

*నిజాం షుగర్ ఫ్యాక్టరీ లిమిటెడ్*

1963–64 సం కాలానికి చెఱకుగానుగ ఆడేకాలం 1963 అక్టోబరు మొదటివారంలో ప్రారంభమవుతుంది.

*రైతులకు సహాయం*

చక్కెర కొరతను తీర్చడానికి గాను నిజాం షుగర్ ఫ్యాక్టరీ చక్కెర ఉత్పత్తిని అధికం చేయవచ్చు అందుచేత రైతులనుండి 1964–65 సం. కాలానికి నాలుగు లక్షల టన్నుల చెఱకును తీసుకోవడానికి ఉద్దేశించబడినది. 1963–64 సం కాలానికి ఉద్దేశింపబడిన చెఱకు 3½ లక్షల టన్నులు మాత్రమే

పైకారణాలవల్ల నిజాం షుగర్ ఫ్యాక్టరీ లిమిటెడ్ వారు కోటా విధానాన్ని తీసివేసి చెఱకును నాటే విషయంలో నిర్బంధాలను తొలగించి, యీ దిగువ సూచించిన విధంగా రైతులకు అడ్వాన్సుగా యిచ్చే పరపతి సౌకర్యం మొత్తాన్ని అధికం చేశారు.

అద్‌సాలి చెఱకు రూ 900 నుండి రూ 1,100 కు ఒకహెక్టరుకు, ఎక్ సాలి చెఱకు రూ 700 నుండి రూ. 800 కు. ఒక హెక్టరుకు,

*సందర్శనలు :*

ఆంధ్ర ప్రదేశ్ ప్రణాళిక, పంచాయతీరాజ్ శాఖలమంత్రి నా ఎమ్. చెన్నారెడ్డి జూలై 1 వ తేదీన యీ ప్రాంతాన్ని సందర్శించారు.

*చేతి పనులు*

దక్షిణ భారత దేశంలో బ్రిటిష్ ట్రేడ్ కమీషనరు శ్రీ ఎఫ్ ఎఫ్ డి. వార్డ్ హైదరాబాదుకువిచ్చేసిన సందర్భంలో 17–7–1963వ తేదీన హైదరాబాదులోని ప్రభుత్వ చేతి పనుల కుటీరపరిశ్రమల అమ్మకపు దుకాణాన్ని సందర్శించారు చేతిపనులలో గల రకాలను ఆయన మెచ్చుకున్నారు.

నెల్లూరుజిల్లా వరిగొండలో రంపపుపొట్టుతో తయారయ్యే బొమ్మల శిక్షణకేంద్రం ఒకటి, మెదక్ జిల్లా గుమడ్తలలో కర్ర బొమ్మల శిక్షణ కేంద్రం ఒకటి ప్రారంభించ బడ్డాయి.

సలహా సంఘం పునర్వ్యవస్థీకరించబడినది.



# నిత్యసత్యం

✲ బృందావనం రంగాచార్యులు

జనుల మనుగడమీద
స్వారిచేసిన వాడు
పరమ సాధువులపై
పగ వహించిన వాడు
తన పొగడ్తయె విన
దగిన గేయమ్ముగా
తన లీల నిఖిల మా
నవుల కాఖీలగా
సంచరించిన వాడు
జాలిజూపని వాడు
విలయాలు పుట్టించి
విసము వెళ్ళగక్కించి
ప్రగతి తత్త్వమున కా
పదలను గల్గించి
ప్రభు పదమ్మున కప
ప్రథలను సృజియించి
భూమి నేలిన వాడు

భూతసనుడగు వాడు
తూలిపోవక మానునా !
కూలి తీరక తప్పునా !

పెరిగిన కిరాతకము
హెచ్చిన దురాగతము
ప్రతి సమస్యయు విష
ఖాండ సదృశమై
ప్రతి శాసనము మహా
ప్రళయ సూచకమై
మనిషి మనిషికి మధ్య
మానవత్వము పుచ్చి
మానని గాయమై
దానవత్వము రెచ్చి
తాండవించుట గాంచి
తన్మయుండగు వాడు
పలుబడి దారుణ
జ్వాల వేసినవాడు

కాలవాహిని కడ్డు
కట్టలను సృష్టించి
రేల నాలుగు చెరగు
లేలగా నుంకించి
మిన్ను దాచినవాడు
వెన్ను విరచినవాడు
విశ్వ వీధుల నడుమ
పసరు తుఫానులో
కొట్టుకొని పోవులే ఖాయం
చిట్టచివరకు మిగులు న్యాయం

పదిలంగా ప్రబలంగా
కదలిన కంఠరవం
నదీశోపల ప్రతిక్షణం
మెదలుతున్న శుభక్షణం
ఎదురు గాక నిలుచునగనే
నిదురు కొనదు తన జనం
వాంఛింపదు నిశ్శ్వసనం ★

---

# అభ్యుదయం

నీటివసరుల సౌకర్యంగల జిల్లాలలో వ్యవసాయోత్పత్తిని అధికం చేయడానికిగాను సవరించబడిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమాన్ని రాష్ట్రంలో పదిజిల్లాలలో అమలు పరచడం జరిగింది మెట్ట భూముల్లోకూడా వ్యవసాయోత్పత్తిని పెంచడానికి తీవ్రతర వ్యవసాయ పథకం క్రింద మెట్ట భూములలో తీవ్రతర వ్యవసాయ కార్యక్రమాన్ని రాష్ట్రంలో రెండు ప్రాంతాలలో ప్రారంభించడానికి ప్రభుత్వం అంగీకరించింది. తెలంగాణా ప్రాంతంలో ఆదిలాబాదుజిల్లా, ఆంధ్ర ప్రాంతంలో అనంతపూర్ జిల్లా—యీ రెండు జిల్లాలూ 1963–64 సం. లో యీ పథకాన్ని అమలు చేయడానికి ఎంపిక చేయబడాయి.

ఈ పథకాన్ని అమలు పరచడంలో గల ముఖ్యోద్దేశం జొన్నపంట దిగుబడిని అధికం చేయడమే. ఈ పథకాన్ని సజ్జలు, మిగతా కాయ ధాన్యాలు, పప్పు ధాన్యాలు (ఉలవలు వినహా) పంటలకుకూడా ముందు ముందు విస్తరింప జేస్తారు. ఈ పథకాన్ని ఆంధ్ర ప్రాంతంలో గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు జిల్లాలలోనూ, తెలంగాణా ప్రాంతంలో నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాలలోనూ విస్తరింప జేస్తారు

ఈ పథకం క్రింద యీ రెండు జిల్లాలలోని రైతులకు ఒక్కొక్కరికి ఎకరాకు 2 పౌన్సుల చొప్పున రూ 11,780 లు విలువ చేసే పచ్చిఎరువుల విత్తనాలను ఉచితంగా అందజేసారు. పంటను తెగుళ్ళనుండి రక్షించుకోవడానికి గాను క్రిమి సంహారక మందుల్ని, మొక్కల సంరక్షణ సామగ్రిని 50 శాతం తగ్గింపు రేట్లకు రైతులకు అందజేస్తారు ఈ ఖర్చు రూ 57,000 ల మేరకు వుంటుంది వీటితో పాటు యీ రెండు జిల్లాలలోనూ ప్రతి బ్లాకూ మెట్ట భూముల్లో వుపయోగించే 20 సెట్ల వ్యవసాయ పరికరాలనుకలిగి ఉంటుంది ఈ పరికరాలను అమ్మకానికై పెడతారు వీటి విలువ రూ 38 000 ల వరకూ వుంటుంది ఈ పథకాన్ని ఆచరణలో పెట్టేందుకు 1963–64 సం కాలంలో 23 లక్షల రూపాయల మేరకు పరపతి సౌకర్యాన్ని రైతులకు కల్పించవలసిందిగా ప్రభుత్వం సహకార సంఘాల రిజిష్ట్రారును ఆదేశించింది

1963 జూలై 18వ తేదీనుండి మాస్కోలో భారతదేశం ప్రారంభించిన పారిశ్రామిక ప్రదర్శనలోని వ్యవసాయరంగంలో ప్రదర్శించడానికిగాను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తూర్పు గోదావరినుండి రస్తాలి రకం అరటిపళ్ళు గెలలు, కోడూరు, వెంకటగిరి, హైద్రాబాదుల నుండి బత్తాయి, దబ్బకాయలు పంపించింది.

# గెలుపు మనదే!



కథానిక :

ఊరికి ఉత్తరంగా వీధి చివరనున్నదా ఇల్లు. రెండు నిట్టాడులు గల పూరికొంప. తల వాకిలి దిగసాయించి, చుట్టూ ఎత్తుగా గల చిల్లకంప సరిహద్దులు. ఓ మూల పెరల బావి. ఇంకో ప్రక్క పాడిగేదెకు సోపరా. దాని చెంతనే చిన్న గడ్డివాము. ఆ వాముకి వెనుక భాగాన కూరగాయల పాదులు. ఆ పాదుల్లో ఏపుగా పెరిగిన చెట్లు విరగ్గాసి— ఇంటి సౌభాగ్యానికి నిదర్శనాలుగా నిలిచినయ్.

శీతాకాలపు సూర్యుడు బారెడు మేరకు పైకి ఎక్కినా ఎండలో వేడి లేదు. దూరంగా పొలాల గట్లపైనా, డొంకలోనూ వున్న తాటి చెట్లూ, ఈత చెట్లూ గాలికి గోలచేస్తున్నాయి. ఇంటి ఇల్లాలు నాగరత్తమ్మ అప్పుడే గేదె పాలు పితికి, పిడతలో పోసి, పొయ్యి మీద పెట్టి, చాటలో బియ్యం పోసికొని ఇంటి ముందు మెరాబాలో నాపరాయిమీద కూర్చుని మట్టిగడ్డలు ఏరుతూంది. అయిదేళ్ళ కూతురు అంతకుముందే పలకా, బలపమూ పుచ్చుకొని ఎలిమెంటరీ స్కూలుకి వెళ్ళింది.

ఆ ఉదయం ప్రశాంతంగా వుంది. కాని నాగరత్తమ్మ మనస్సు అట్లాలేదు. చైనా ముష్కరులు భారతదేశపు ఉత్తర సరిహద్దులపై ధర్మాధర్మ విచక్షణలేకుండా భారీ ఎత్తున ఆక్రమణంగా, అన్యాయంగా దాడులు ప్రారంభించారు. శాంతిగా, స్నేహంగా, సోదరభావంతో ఇంతకాలమూ నటిస్తూ— హఠాత్తుగా ఓ అర్ధరాత్రి దాటాక వెన్నుపోటు పొడిచారు. నిశ్చింతగా నిద్రపోతూన్న మంచివాణ్ణి ఓ కిరాతకుడు కత్తితో పొడిచిన

తాళ్ళూరు నాగేశ్వరరావు

పోటు లాంటిదే అది. ఉలిక్కిపడిన సింహం పగిది భారతజాతి యావత్తూ మేల్కొంది. వారి దొంగచాటు దాడుల్ని తిప్పికొట్టేందుకు, కుతంత్రంగా చొచ్చుకొని వచ్చి దురాక్రమణ చేసిన ప్రాంతాలనుంచి తరిమి కొట్టేందుకు, స్వాతంత్ర్య పరిరక్షణకు — మన సేనలూ, ప్రజలూ సమాయత్తమై ఉత్సాహంతో ముందుకు దుమికారు. మాతృభూమి రక్షణే జీవితాదర్శంగా మన జవానులు, అధికారులు అసమానధైర్య సాహసాల్ని ప్రదర్శించి, అపూర్వ త్యాగాల్ని చేశారు. మన సైనికులు తుపాకుల్లో చివరి గుండు అయిపొయ్యేదాకా, జట్టులో చివరి సైనికుడు నేలకొరిగే వరకూ— వీరోచితంగా భీషణ సమరం సాగిస్తూనే ఉన్నారు. తీవ్రంగా ప్రతిఘటిస్తూనే ఉన్నారు. కాని నేఫా ప్రాంతాల్లో అననుకూల వాతా

వరణం, అలలు అలలుగా అత్యధికసంఖ్యలో వచ్చిపడే చైనా సైనిక బలమూ, యుద్ధంలో వాళ్ళు ఉపయోగించే భారీ ఫిరంగులు, మోర్టారులు, మరతుపాకులు, ఆటోమేటిక్ రైఫల్సు మొదలైన ఆధునిక ఆయుధాలు, వాళ్ళ దొంగచాటు యుద్ధ సన్నాహాలూ, మోసాలూ — మనకు తాత్కాలికి అపజయాల్ని కలిగించినా, పునః సమీకరణ నిమిత్తం మన సైనికులు స్థావరాల్ని విడిచిపెట్టినా, 'గెలుపు మనదే' అన్న విశ్వాసం ద్విగుణీకృత మౌతూన్నది. అకుంఠిత ధైర్య స్థైర్యాలతో, అచంచల దీక్షతో మన సైనికులు నిర్విరామంగా పోరాటం సల్పుతున్నారు శత్రువులకు అపారనష్టాల్ని గావిస్తున్నారు నేఫా తూర్పు రంగంలో జరిగే పోరాటంలో నాగరత్తమ్మ భర్త నారయ్య కూడా వున్నాడు మాతృదేశ రక్షణ మహాయజ్ఞంలో కొంతమందిజవానులు అసువులు గోల్పోతున్నారు మరి తన భర్త పరిస్థితేమిటి ? తన కేదో భయం భయంగా వుంది. అమ్మ అంటూనేవుంది 'మిలిటరీలో జేరినాక వాడు మనవాడు కాదేః ఏ క్షణంలో ప్రాణం ఎగిరి పోతుందో చెప్పలేం ?' కాని ఆయనగారు సురక్షితంగానే వుంటారు యుద్ధంలో తీవ్రంగా పోరుసల్పి సలక్షణంగా తిరిగి వస్తారు. పైన భగవంతుడున్నాడు కర్మభూమియైన భారతదేశం పట్ల న్యాయం, ధర్మం, భగవంతుని అండ తోడుగా వుంటాయి తను దిగులు జెందనక్కర్లేదు వారి కే ఆపదారాదు అంతిమ విజయం భారత దేశానికే '... ఆమె ఆ విధమైన ఆలోచనల ఆవేశంలో వుండగా, తల్లి సుభద్రమ్మ ప్రక్కింట్లోంచి మహదాకుడుగా వచ్చింది

"ఏమే ః విన్నావా ? అక్కడి యుద్ధం జోరుగా సాగుతూన్నదట మన సైనికులు వేలకు వేలు చస్తున్నారట. ఇవాళ పేపర్లో పడిందట. వెంకట్రామయ్యగారు అన్నారు. నాకేమో మీ ఆయన్ను గురించి భయంగా వుంది "

గాలి తీవ్రతకు చెట్టునవున్న ఆకురాకు గజగజలాడినట్టు నాగరత్తమ్మ గుండె గజగజ లాడింది కాని వెంటనే నిలదొక్కుకున్నది.

"అవన్నీ నిజం కావే అమ్మా ః మన ప్రభుత్వం ప్రకటించిందిగా-మరణించిన వాళ్ల సంఖ్య స్వల్పమట అయినా దేశంకోసం ప్రాణాలకు తెగించి పోరాడే వాళ్ళను గురించి మనం అపశకునంగా అనుకోవట మేమిటి ? పైన భగవంతుడున్నాడు. భయపడక్కర్లేదు" అన్నది నాగరత్తమ్మ చాటలోని బియ్యంలోనికి వ్రేళ్ళు పోనిచ్చి గీతలు గీస్తూ.

'నీ గుండె ధైర్యం ఎట్లాంటిదే ' గొణుక్కుంటూ సుభద్రమ్మ ఇంట్లోకి వెళ్ళింది.

అదే రోజు భర్త దగ్గర్నుంచి నాగరత్తమ్మకు లేఖ వచ్చింది. అందులో ఇలా ఉంది

'ప్రియమైన శ్రీమతికి —

నేను యుద్ధరంగంలో ఈ క్షణం వరకూ క్షేమంగానే ఉన్నాను కాని నా క్షేమం కాదు కావల్సింది నా సోదర జవాన్ల క్షేమం, భారత దేశపు క్షేమం చైనా రాక్షసులు మనదేశంపై ప్రబలమైన దురాక్రమణ చర్య జరుపుతూన్న విషయం ఈ పాటికి నీకు తెలిసే వుంటుంది. తాత్కాలికంగా మనం కొన్ని అపజయాల్ని పొందుతూన్నమాట కూడా వాస్తవమే నిద్ర పోతున్న వాడి మీదకు దొంగచాటుగా దాడి జరిపితే — అల్లాంటి అపజయాలు తప్పవు సైనిక పునః సమీకరణ కోసం మనం కొన్ని స్థావరాల్ని ఖాళీ చేయాల్సికూడా వస్తూన్నది

నేను నేఫా తూర్పురంగం డివిజన్‌లో వున్నాను నవంబరు పదిహేనవ తేదీ రాత్రి వలాంగ్‌లో చైనా ముష్కరులు పెద్ద ఎత్తున దాడి ప్రారంభించారు. భారీ శతఘ్నులు, మోర్టారులు, ఆటోమేటిక్ రైఫిల్స్ మొదలైన ఆధునిక ఆయుధాలతో అత్యధిక సంఖ్యలో పెద్ద వరద వొచ్చినట్టు వొచ్చి పడ్డారు ఎంతనష్టం జరిగినప్పటికీ ఎన్ని వేలమంది మన చేతుల్లో నిహతులైనప్పటికీ ముందుకు పడద్రోసికొని వచ్చారు అయి నప్పటికీ పదిహేను దాడుల్ని తిప్పికొట్టాము. మూడు రోజుల పాటు భీషణ సమరం సాగింది పద్నాలుగు వేల అడుగుల ఎత్తున మంచుకొండల భీకర శీతల వాయువుల్లో, ఎముకలు కొరుక్కుతినే చలిలో రక్తం గడ్డకట్టే ఉష్ణోగ్రతలో, నీరూ, ఆహారం సరిగ్గా అందని దుర్గమమైన ప్రాంతాల్లో — శత్రుమూకను శక్తిమంతంగా ప్రతిఘటించాము. కాని 15 వేల సంఖ్యాబలంతో, ఆధునిక ఆయుధ సంపత్తితో మిన్ను విరిగి మీద పడ్డట్టుగా వచ్చిపడ్డ చైనా రాక్షస మూకను, వాళ్ళ దొంగ యుద్ధాన్ని, కుతంత్రపు ఎత్తులనూ, చాటు మాటు పోరాటాన్ని మనం పూర్తిగా ఎదుర్కోలేక పోయాము వలాంగ్‌నుంచి ఉపసంహరించుకోవాల్సి వచ్చింది కాని స్వతంత్ర భారత చరిత్రలో ఈ పోరాటాన్ని సువర్ణాక్షరాలతో అలంకరించవల్సి వుంటుంది. ఏడుమైళ్ళ పొడవున ప్రమాద భరితమైన పర్వత ప్రాంతంలో వున్న యుద్ధరంగంలో మన జవాన్లు గడగడ వణికించే చలిలో, త్రాగడానికి నీరూ, తినడానికి తిండీ దొరక్కపోయినా అగ్రస్థావరాల్ని అంటి పెట్టుకొని, అపూర్వమైన ధైర్య సాహసాలతో, మాతృదేశం పట్ల ప్రేమానురాగాలు నరనరాల్లో త్రొక్కుతూండగా, అకుంఠిత దీక్షతో, అంగుళం అంగుళం తీవ్రంగా పోరాడారు ఇందులో ఒక దాడిలో ఒక నాన్ కమీషన్డు ఆఫీసరు సిపాయ్ కెవాల్‌సింగ్ తన కందకం

లోంచి హఠాత్తుగా పులిలా బయటకు దుమికి శత్రువులపై గుళ్ళ వర్షం కురిపించి, చీల్చి చండాడి, ఎనిమిది మందిని చంపి, తాను శత్రువుల కాల్పులకు గురియై, వీరస్వర్గ మలంకరించాడు చరిత్రలో లిఖించ వల్సిన ఇలాంటి సంఘటనలూ, వీరమరణ గాధలూ అనేకం

ఏమైనా గెలుపు మనదే: అమితమైనగుండె నిబ్బరంతో, దృఢమైన ధైర్యసాహసాలతో, ప్రాణాలను లెక్క-చేయకుండా మాతృదేశ రక్షణకోసం వీరోచితంగా పోరాడే మన జవాన్లకే గెలుపు. ధర్మం, న్యాయం మన పక్షాన వుంది భగవంతుని బలం మన కుంది మన సైన్యాల సమీకరణ పెద్దఎత్తున జరుగుతూన్నది. వాళ్ళ దాడుల్ని త్రిప్పి గొట్ట గలుగుతున్నాం. దురాక్రమిత ప్రాంతా ల్నుంచి చైనా మూకను తరిమివేసే వరకూ విశ్రమించం. ప్రతి సైనికుడూ, ప్రతి ఆఫీసరూ స్వాతంత్ర్య పరిరక్షణకు కఠోర మైన ప్రతిజ్ఞ తీసుకొని — నిర్విరామంగా, హృదయపూర్వకంగా, గట్టి విశ్వాసంతో కృషి చేస్తున్నారు.

నన్నుగురించి కలలోనైనా దిగులు పడకు. దురదృష్టవశాత్తూ నేను యుద్ధ భూమిలో మృతిజెందినా — దుఃఖించ వల్సిన తరుణంకాదు ఈ భావానికి నీ కళ్ళు అప్పుడే నీళ్ళతో నిండవచ్చు. అదికాదు కర్తవ్యం ఈ ఆత్యయిక పరిస్థితిలో ప్రతి భారతీయుడూ, ప్రతి భారతీయస్త్రీ — మన దేశం పట్ల, ప్రభుత్వం పట్ల దృఢ విశ్వాసం కలిగి, దుర్మార్గులు పుట్టించే పుకార్లు, భయాలూ వినకుండా, దేశంకోసం శక్తి వంచన లేకుండా ఏదోరూపంలోపాటుబడాలి

మన పాపకు ముద్దులు. త్వరలోనే విజయాన్ని సాధించి తిరిగి వస్తాననిచెప్పు మీ అమ్మను అడిగానని చెప్పు ఆవిడను అనవసరంగా ఖంగారు పడొద్దని చెప్పు.

దేశరక్షణే జీవితాదర్శంగా యెంచి తుపాకి పట్టిన నీ భర్త — నాసరయ్య

ఆ ఉత్తరం చదువుకొని నాగరత్తమ్మ సంపూర్ణంగా సంతోషపడింది. తల్లికి చదివి వినిపించింది. కాని ఆవిడ అనవసరంగా నిట్టూర్పు విడిచింది

*　　*　　*

1962 అక్టోబరు 20 వ తేదీ అర్ధరాత్రి చైనా దుండగీడులు అన్యాయంగా, అక్రమంగా, అకారణంగా పెద్ద ఎత్తున ప్రారంభించిన దాడులు నెల రోజులు గడిచినా ఘోరంగా సాగుతూనే ఉన్నాయి. అతి ఆధునిక ఆయుధాలతో, అత్యధిక సంఖ్యలో చైనా ముష్కరులు — నాగరీక ప్రపంచానికే తలనొప్పిగా, శాంతియుత సహజీవనానికి వెన్నుపోటుగా, మానవత్వానికి మారణ హోమంగా, దురాక్రమణ చేస్తూనే ఉన్నారు. మన భూమిపైకి చొచ్చుకొని వస్తున్నారు భారీఎత్తున దాడుల్ని ఎదుర్కొ-నే సమర సన్నాహాల్ని చేసికొని వుండకపోవడం వల్ల, పునః సమీకరణ నిమిత్తం, వాతావరణం కల్సి రాకపోవడం చేత — మనం కొన్ని స్థావరాల్ని వదులుకో వాల్సి వచ్చింది తవాంగ్, జాంగ్, వలాంగ్ వాళ్ళ చేతుల్లో పడిపోయాయి దేశం తీవ్రంగా మేల్కొ-ంది ప్రతి భారతీయుని గుండె ఎర్రబడింది మాతృదేశ రక్షణకు దృఢంగా ప్రతిజ్ఞ తీసికోవడం జరిగింది దేశరక్షణనిధి స్థాపించబడింది శక్తివంచన లేకుండా ప్రజలు విరివిగా ధన, కనక, వస్తు రూపేణా విరాళాలు ఇస్తున్నారు యువకులు ఉత్సాహంగా సైన్యంలో చేరుతున్నారు డాక్టర్లు, ఇంజనీర్లు, చదువుకున్న వారు ఏమర్జన్సీ సర్వీసుల్లో ప్రవేసిస్తున్నారు దేశమంతా ఒక్క-సారి కదిలింది. నవ చైతన్యం నవభారత రక్షణకోసం, చైనా రాక్షసుల్ని తరిమి కొట్టేందుకు, పిల్లలు మొదలు... ..ఉత్సాహం, ఉద్రేకం, పట్టుదలా, పళ్ళబిగువూ ప్రజల్లో ఉవ్వెత్తుగా లేచాయి 'గెలుపు మనదే' ప్రతి భారతీయుని గుండెలో ఆ విశ్వాసం కాగడాలా వెలుగుతుండగా — ప్రజావాహిని ఉధృతంగా సాగింది.

భర్త దగ్గర్నుంచి మళ్ళీ ఉత్తరం రాక పోయేప్పటికీ నాగరత్తమ్మ భయపడింది ఆమె భయాన్ని తల్లి ద్విగుణీకృత పరిచింది.

"ఏమో ! నాకేమీ నమ్మకం లేదు. యుద్ధంలో వేలకు వేలు చచ్చారంట ఈ పత్రికలవాళ్ళు చచ్చినవాళ్ళ సంఖ్యను సరీగ్గా వేయడం లేదట — ప్రజలు భయపడతారని. నిన్న అంకయ్యగారి రామసుబ్బయ్య అన్నాడు మీ ఆయన ఏ తుపాకి గుండుకో..." ఆపైన ఆవిడగొంతు దుఃఖోద్వేగంతో వొణికింది

నాగరత్తమ్మ దిగులుతో పూర్తిగా క్రుంగిపోయింది ఆమె కళ్ళల్లో నీళ్ళు గట్లుతెగిన ప్రవాహమైనాయి.

ఆరోజే ఆమె భర్తనుగురించి వాకబుచేస్తూ మిలిటరీ ఆఫీసర్లకు ఉత్తరాలు వ్రాసింది సమాధానాలకోసం కళ్ళల్లో ఆశల కొవ్వొత్తుల్ని వెలిగించుకొని కూర్చుంది. వారం, పదిరోజులు గడిచినా జవాబులు రాలేదు ఆమెలో అధైర్యం జాస్తి కాజొచ్చింది. అందుకుతోడుగా తల్లి ఊళ్ళోవాళ్ళ కబుర్లను కూతురికి అందిస్తూ పిరికితనాన్ని పెంపొందించ సాగింది

ఓరోజు సాయంత్రం పాప బళ్ళోనుంచి ఏడుస్తూ ఇంటికివచ్చింది నాగరత్తమ్మ ఆదుర్దాతో దగ్గరకు తీసుకొని, "ఎందుకు పాపా ! ఏడుస్తున్నావు ?" అన్నది పాప ఏడూస్తూనే, "మరే...అమ్మా...బళ్ళోనే..

అంతా 'నాన్న యుద్ధంలో చచ్చిపోయాడు' అంటున్నారమ్మా !...నిజమేనా ?" అన్నది మునివేళ్ళతో కళ్ళు నల్చుకుంటూ,

" నాగరత్తమ్మకు గుండెల్లో తుప్పు కత్తులతో కెలికినట్లయింది "ఛ ఒర్రి దేనమ్మా! అంతా అబద్ధం ' నాన్నగారు యుద్ధంలో కులాసాగా ఉన్నారు గెలుపు మనదేగా ' త్వరలోనే వచ్చేస్తారు అట్లాంటి చెప్పుడు మాటలు విని ఏడ్వకూడదు మీ నాన్నగారు యుద్ధంలో చచ్చిపోరు మనకు దేవుడు తోడుగా వున్నాడు యుద్ధంలో విజయం సాధించే యింటికి వస్తారు." అన్నది నాగరత్తమ్మ చాటుగా కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ

"నిజంగా... !" అన్నది పాప గౌనుతో చెంపలపైకి జారిన కన్నీళ్ళను తుడుచుకుంటూ

"ఆఁ' ముమ్మాటికి నిజంగా" మనస్సులో గట్టిపడిన విశ్వాసంతో అంటూ నాగరత్తమ్మ పాపను హృదయానికి గాఢంగా అదుముకొంది.

ఆ రోజురాత్రి నాగరత్తమ్మకో కల వొచ్చింది కలలో – భర్త చైనా వాళ్ళకు ఖైదీగా దొరికినట్టూ, మన సరిహద్దులు దాటి తీసికెళ్ళినట్టూ, టిబెట్టు ప్రాంతంలో వాళ్ళ స్థావరాల్లో నానాబాధలూ పడినట్టూ ఆమెకు గోచరమైంది కల లెగిపోగా కెవ్వున కేక వేసింది నాగరత్తమ్మ ఆ కేకను ఎవ్వరూ వినలేదు ఓ గ్లాసు మంచినీళ్ళు త్రాగి తెల్లవార్లూ ఆలోచిస్తూనే కూర్చుంది

* * *

నవంబరు 21 వ తేదీన చైనా ముష్కరులు ఏకపక్ష యుద్ధ విరమణ చేశారు. అందులోని అంతరార్థాన్ని గూర్చి భారత దేశమే కాకుండా ప్రపంచమే ఆశ్చర్యాన్ని ప్రకటించింది సరిహద్దు సమస్యను శాంతి యుతంగా పరిష్కరించేందుకు కొన్ని మిత్ర రాజ్యాలు మధ్యవర్తిత్వాన్ని చేపట్టి, కృషిని సాగించ పూనుకున్నాయి. ప్రధాని నెహ్రూ, తదితర నాయకులూ – "యుద్ధ విరమణ శాశ్వతంగా జరిగిందను కోవటానికి వీల్లేదు. చైనావాళ్ళు ఏక్షణాన్నయినా మళ్ళీ మనపై దాడిచేయవచ్చు. మనం మన జాగ్రత్తల్లో, మనగడ్డ రక్షణలో పూర్తిగా మెలకువ గలిగి వుండాలి. శత్రువును సులభంగా ఎదుర్కొని పటిష్ఠంగా బుద్ధిచెప్పే బలాన్నీ, ధైర్యాన్నీ పొందివుండాలి భారతదేశపు ప్రతిపౌరుడూ ఆ కర్తవ్యాన్ని గుర్తించాలి ఆత్మ విశ్వాసంతో, శక్తివంచన లేకుండా, తీవ్రమైన దీక్షతో కృషిచేయాలి అనవసరపు వ్యయాన్ని తగ్గించుకోవాలి నిర్బంధపు పొదుపును అమల్లో పెట్టాలి. ఉత్పత్తుల్ని పెంచాలి బంగారంమీద వ్యామోహాన్ని వొదులుకోవాలి జాతీయ రక్షణ నిధికి విరివిగా విరాళాలివ్వాలి '' అంటూ ప్రకటనలు చేస్తున్నారు దేశంలో ఆత్యయిక పరిస్థితి అమల్లోనే వుంది.

నాగరత్తమ్మకు భర్తనుంచి ఏ జాబూ రాలేదు తల్లితోపాటు ఊళ్ళోవాళ్ళంతా 'నాసరయ్య యుద్ధంతో మరణించి వుంటాడు' అన్న అభిప్రాయాన్ని గట్టిపర్చుకున్నారు గానీ ఆమె మటుకు ధైర్యంగానే వున్నది నిత్యమూ భర్తనుంచి లేఖకోసం ఎరీక్షిస్తూనే ఉంది

ఓరోజు సాయంత్రం సుభద్రమ్మ వెండి మెట్టెలకోసం కావిడి పెట్టంతా వెతుకుతూ అడుగున ఈతాకుల బుట్టతీసి చూసింది ఆవిడగుండె ఆగిపోయినంత పనైంది అందులో తనుదాచుకున్న బంగారుమురుగులు లేవు గావుకేక పెట్టింది, "ఒసేయ్ అమ్మాయ్" పంచముందు పాచివూడుస్తూన్న నాగరత్తమ్మ తల్లికేదో ప్రమాదం వొచ్చిందని పరుగెత్తుకొచ్చింది

"ఇందులో బంగారపు మురుగులుండాలి. ఏమైనాయే !"

"ఏమో నమ్మా ' నాకేమీ తెలీదే"

"చోద్యంగా వుందే అయితే దొంగలెత్తుకెళ్ళారంటావా ?''

"మనింట్లో దొంగలెప్పుడు పడ్డారు ?"

"అయితే మరేమైనట్టు ?"

"ఏమో ' అంతుబట్టకుండా వుంది"

అంతలో స్కూలునుంచి పాపవొచ్చింది "అమ్మా ' అమ్మా' నేనేంచేశానోచెప్పుకో" అంటూ

''ఏంచేశావమ్మా '" అన్నది నాగరత్తమ్మ ఆప్యాయంగా.

"కావిడి పెట్టెలోని అమ్మమ్మ బంగారు మురుగులు తీసికెళ్ళి మా మాష్టారు కిచ్చానమ్మా ' ఆయన దేశరక్షణ నిధికి బంగారు నగలూ, డబ్బూ పోగు చేస్తున్నాడు మా స్కూల్లో అందరూ యిచ్చారమ్మా వాళ్ళ సుబ్బులు చెవిపోగు లిచ్చింది అత్తయ్యగారి శాంత చేతిగాజు లిచ్చింది కోటయ్య బాబాయిగారి అమ్మాయి మెడలో గొలుసిచ్చింది మరి నాకవేమీ లేవుగా అందుకని అమ్మమ్మ మురుగులిచ్చా అవిపెట్టెలో వూరికే మూలబడి వుండేవేగా.''

కూతురు చేసిన పనికి నాగరత్తమ్మ నిండుగా సంతోష పడింది. ఆమె కళ్ళల్లో ఆనంద బాష్పాలు నిలిచాయి

కాని సుభద్రమ్మ చిందులు తొక్కింది– బంగారు మురుగులు పోయినందుకు అవి ఆవిడ పెళ్ళినాటివి.

నాగరత్తమ్మ తల్లికి నచ్చజెప్పింది

''ఈ పరిస్థితుల్లో బంగారానికి విలువ ఇళ్ళల్లో, పెట్టెల్లో మూలుగుతూ వుండడం వల్ల రవ్వంత లేదు దేశంకోసం, ఎన్నో యేళ్ళ తరబడి, ఎంతోమంది త్యాగాలుచేసి

(మిగతా 37 వ పేజీలో)

# సంగ్రహప్రకటనలు

## రాష్ట్రీయ మెరిట్ స్కాలర్ షిప్పులు

రాష్ట్రంలోని బాలబాలికలు సహజమైన ప్రతిభను పెంపొందించుకోవటానికి వీలుగా వారి ఉన్నత విద్యకు వలసిన ఆర్థిక వనరులను సమకూర్చే బాధ్యతను స్వీకరించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించింది అటువంటి బాలబాలికల తల్లిదండ్రులు, లేక సంరక్షకుల నెలసరి ఆదాయం రూ 300/-లకు మించకుండాఉండి, పి యు. సి దానికి సమానమైన ఇతర పరీక్షలు అంటే హెచ్ యస్. సి (బహుళార్థ సాధక), ఇంటర్మీడియట్, ప్రి-మెడికల్, ప్రి-ఇంజనీరింగ్, ప్రి-అగ్రికల్చర్, ప్రి-వెటర్నరీ, ఇతర వృత్తి విద్యా కోర్సులలోనూ డిగ్రీ పరీక్షలలోనూ ప్రథమ శ్రేణిలో గానీ శ్రేణులు లేని చోట్ల సగటున 60 శాతంమార్కులువచ్చి ఉన్నవారికిమాత్రమే యీ స్కాలర్ షిప్పులు యిస్తారు

పోస్ట్ పి యు సి, పోస్ట్ గ్రాడ్యుయేటు కోర్సుల వారికిఇచ్చే మెరిట్ స్కాలర్ షిప్పులకు సంబంధించి ప్రభుత్వం పథకాన్ని తయారు చేసింది వర్తమాన ఆర్థిక సంవత్సరంలో యీ పథకం అమలుకై రూ 3 50 లక్షలను ప్రభుత్వం మంజూరు చేసింది దిగువ తెల్పిన వర్గాలలో ఆంధ్ర ప్రదేశ్ పబ్లిక్ సర్వీసు కమీషన్ నిర్వహించే పోటీ పరీక్షల ఫలితాల ప్రాతిపదికపై యీ స్కాలర్ షిప్పులుఇవ్వబడ్తాయి పోస్ట్ పి యు సి లోని 16-18 సంవత్సరాల మధ్య వయస్సు గ్రూపువారి స్కాలర్ షిప్పులు, పోస్ట్ గ్రాడ్యుయేటు కోర్సులోని 20-25 సంవత్సరాల మధ్యవయసు గ్రూపువారి స్కాలర్ షిప్పులు, పోటీ పరీక్షలు జరిగే సంవత్సరం జూలై 1 వ తేదీనాటికి గల అభ్యర్థి వయస్సును లెక్కలోకి తీసుకోవడం జరుగుతుంది ప్రతి సంవత్సరం ఇచ్చే స్కాలర్ షిప్పుల వివరాలు దిగువ ఇవ్వడం జరిగింది

పోస్ట్ పి. యు సి స్థాయి 300, పోస్ట్ గ్రాడ్యుయేటు స్థాయి 100, రాష్ట్రేతర ప్రాంతాలలోని విద్యాసంస్థలలో చదివే ఆంధ్ర ప్రదేశ్‌కు చెందిన విద్యార్థులకు పై తెల్పిన స్కాలర్ షిప్పులలో 50 శాతం ఇవ్వబడ్తాయి మిగతావాటిని రాష్ట్రంలోని విద్యాసంస్థలలోని విద్యార్థులకు ఇవ్వబడ్తాయి

ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీసు కమీషన్ నిర్వహించే పోటీ పరీక్షల ప్రాతిపదికపై సెలక్టు చేయబడిన అభ్యర్థులకు యీ పథకం క్రింద స్కాలర్ షిప్పులను ఇవ్వడం జరుగుతుంది కమీషన్ సెలక్టుచేసిన అభ్యర్థికి ఇదివరకే ఏదైన స్కాలర్ షిప్పు ఇవ్వబడుతున్న యెడల దేనినైనా ఒకదానిని వదులుకోవాల్సి ఉంటుంది

దిగువ తెల్పిన విధంగా స్కాలర్ షిప్పు మొత్తాలను ఇస్తారు

| | | రాష్ట్రంలోని విద్యాసంస్థల విద్యార్థులకు | రాష్ట్రేతర ప్రాంతంలోని విద్యా సంస్థలవిద్యార్థులకు |
|---|---|---|---|
| (అ) పోస్ట్ పి యు సి కోర్సులు | నెలకు రు | 75/- | 100/- |
| (ఆ) పోస్ట్ గ్రాడ్యుయేటు కోర్సులు | ... | 100/- | 125/- |

సంవత్సరంలో 10 మాసాలకాలం యీ స్కాలర్ షిప్పు మొత్తాలను ఇవ్వడం జరుగుతుంది

ప్రతి సంవత్సరం జూలై నెలలో ఆంధ్ర ప్రదేశ్ సర్వీసు కమీషన్ నిర్వహించే పోటీ పరీక్షల ఫలితాల ప్రకటన తర్వాత యీ పథకంక్రింద స్కాలర్ షిప్పులు ఇవ్వబడ్తాయి

యీ పోటీ పరీక్ష నిర్వహింపబడే సంవత్సరం మార్చి - ఏప్రిల్‌లో జరిగే మొదటి డిగ్రీ పరీక్షలోనూ, పి యు. సి దానికి సమానమైన ఇతర పరీక్షల (పై తెల్పిన)లో శ్రేణిని సంపాదించి తల్లి దండ్రుల లేక సంరక్షకుల నెలసరి ఆదాయం రూ. 300/-లకు మించని విద్యార్థులందరు యీ పోటీ పరీక్షలలో పాల్గొనే అర్హత కలిగిఉంటారు తహసీల్దార్ హోదాకు తక్కువ గాని రెవెన్యూ అధికారిగానీ, స్వతంత్రంగా వ్యవహరించే డిప్యూటీ తహసీల్దార్ గానీ జారీచేసిన ఆదాయం సర్టిఫికెటును అభ్యర్థి దాఖలు చేయాలి ఉద్యోగుల విషయంలో తల్లిదండ్రులు, లేక సంరక్షకుడు పనిచేసే కార్యాలయంఅధిపతి సంతకం చేసిన ఆదాయం స్టేటుమెంటును దాఖలు చేయాలి

జాతీయ స్కాలర్ షిప్పుల పథకంక్రింద గానీ, ఉద్యోగంలో ఉన్న ఉపాధ్యాయుల పిల్లలకై భారత ప్రభుత్వం ఏర్పాటుచేసిన మెరిట్ స్కాలర్ షిప్పు పథకంక్రిందగానీ ఉపకార వేతనాలుపొందే అభ్యర్థులు యీ పరీక్షలలో పాల్గొనే వీలులేదు.

దిగువ సబ్జక్టులలో పరీక్షలు జరుగుతాయి ఇంగ్లీషు, ఆధునిక భారతీయ భాషలు (తెలుగు, ఉర్దూ, హిందీ, తమిళం, కన్నడం

లేక మరాఠీ) సాధారణ విజ్ఞానం 16_18 సంవత్సరాలమధ్య వయసు గ్రూపువారికి పి యు సి స్థాయి పరీక్షలు. 20_25 సంవత్సరాలమధ్య వయసు గ్రూపువారికి డిగ్రీ స్థాయి పరీక్షలు ఉంటాయి

యీ పథకం క్రింద ఇచ్చే యీ స్కాలర్‌షిప్పు మొత్తాలను దిగువ షరతులకు లోబడి పి యు సి స్థాయి అభ్యర్థులకు ప్రథమ డిగ్రీపరీక్షలు పూర్తి అయ్యేవరకూ, పోస్ట్ గ్రాడ్యుయేటు స్థాయి అభ్యర్థులకు పోస్ట్ గ్రాడ్యుయేటు డిగ్రీ పుచ్చుకునే వరకు ఇవ్వడం జరుగుతుంది వార్షిక పరీక్షలో 50 శాతంకు తక్కువరాకుండా మార్కులు పొందే షరతుకు లోబడి సంవత్సరం సంవత్సరం యీ స్కాలర్‌షిప్పులను పునరుద్ధరించడం జరుగుతుంది

స్కాలర్‌షిప్పు పొందిన అభ్యర్థి విద్యాభ్యాసం సమయంలో పురోభివృద్ధి సంతృప్తికరంగా లేకున్నా, ప్రభుత్వ పూర్వానుమతి లేకుండానే కోర్సు పూర్తికానిదే మధ్యలో కోర్సును మార్చుకున్నా, కళాశాల తరగతులకు సక్రమంగా హాజరు కాకున్నా, యీ స్కాలర్‌షిప్పులను రద్దుచేయడం జరుగుతుంది

స్కాలర్‌షిప్పును కొనసాగించడానికి సత్ప్రవర్తన, సక్రమంగా తరగతులకు హాజరు కావడంకూడా షరతులలోఉన్నాయి. నిర్ణీత ఫారాలలో దరఖాస్తులను రెండు ప్రతులలో పంపాలి. హైదరాబాదులోని ఆంధ్ర ప్రదేశ్ పబ్లిక్ సర్వీసు కమీషన్ నుంచి యీ ఫారాలను పొందవచ్చు.

## ఖాదీ మండలి

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఖాదీ గ్రామీణ పరిశ్రమల మండలిని ఏర్పాటుచేసింది. ఇది 1963 సెప్టెంబరు 5 వ తేదీనుంచి అమలులోకి వస్తుంది. యీ మండలిలో దిగువవారు ఉన్నారు

(అ) ఆంధ్ర ప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమలబోర్డు అధ్యక్షులు, సభ్యులు యీ మండలికి వరసగా ఎక్స్ అఫీషియో అధ్యక్షులు, సభ్యులుగా వ్యవహరిస్తారు.

(ఆ) జిల్లా పరిషత్తు అధ్యక్షులు యీ మండలి ఎక్స్ అఫీషియో సభ్యులు

(ఇ) ప్రభుత్వం నియమించిన దిగువ సభ్యులు సర్వశ్రీ సి జగన్నాధరావు, యన్ అనంతరెడ్డి, ఎ బెంజిమన్, వై. చలపతిరావు, రంగబాబు, కె సుదర్శన్ రావు, రాజారెడ్డి, హీరాలాల్ మోరియా, జి నారాయణరెడ్డి, డి రామబ్రహ్మం, యల్ నారాయణ, ఆనం విశ్వనాధరావు, జె మధుసూధన్‌రావు, నందా నారాయణప్ప, యం. కిషన్‌రావు, బొజ్జం నరసింహులు ప్రభుత్వం నామినేటు చేసిన సభ్యుల పదవీ కాలం 1953 సెప్టెంబరు 5 వ తేదీనుంచి మూడు సంవత్సరాలు ఉంటుంది

## తీవ్రతర ఎరువుల ఉపయోగం పథకం

తెలంగాణా ప్రాంతంలోని సాంద్ర వ్యవసాయ కార్యక్రమాలు అమలు జరిగే మహబూబ్‌నగర్, కరీంనగర్, వరంగల్లు, నిజామాబాదు 4 జిల్లాలలో తీవ్రతర ఎరువుల వాడకం పథకం క్రింద అదనపు పరపతి సౌకర్యాలు కల్పించడానికి వీలుగా ప్రతి జిల్లాకు రు 5_00 లక్షల చొప్పున రు. 20_00 లక్షల అదనపు రుణాన్ని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం మంజూరు చేసింది

## వక్ఫ్ ఆస్తులను అమ్మడం అక్రమం

స్మశాన వాటికలు, ఇనాం భూములు మొదలయిన కొన్ని వక్ఫ్ ఆస్తులను ముతవలాలు, ముజావరులు లేక ఆయా మేనేజరులు అమ్ముతున్నట్టుగా ప్రభుత్వం దృష్టికి వచ్చింది. 1954 సం. వక్ఫ్ చట్టం మూడవ సెక్షనులోని (1) క్లాజు (1954 సం కేంద్ర చట్టం 2) క్రింద వక్ఫ్ స్థిరంగా అంకితమైన ఆస్తి. ముస్లిం శాసనం క్రింద ఈ ఆస్థి భగవంతుని పరమైనది. అందువల్ల యీ ఆస్తిని శాశ్వతంగా వారసత్వానికి యివ్వడం గాని దఖలుచేయడంగాని కూడదు

ఇనాములకు వర్తించే ప్రత్యేక శాసనంతో పాటు వక్ఫ్‌కు అనుబంధంగా వున్న ఇనాములు మష్రుతుల్ కిద్మత్ వక్ఫ్‌లు కాబట్టి వాటికి వక్ఫ్‌తో సమానస్థాయి వుంది. అట్టి ఆస్తుల అమక్కం చట్టవిరుద్ధం కాబట్టి, అట్టి ఆస్తులను కొనే ఆయన లేక ఆమె స్వంతబాధ్యతపైనే వ్యవహరిస్తున్నట్టుగా భావించబడుతుందని యిందు మూలముగా ప్రజలకు తెలియ జేయడమైనది.

## మత్స్య సలహాసంఘం పునర్వ్యవస్థీకరణ

ఆంధ్ర ప్రదేశ్ మత్స్య సలహా సంఘాన్ని యీ దిగువ అధికార, అనధికార సభ్యులతో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం పునర్వ్యవస్థీకరించింది

మత్స్య శాఖామంత్రి (ఎక్స్-అఫీషియో చైర్మన్), ఎక్స్ – అఫీషియో సభ్యులు · ఆహార వ్యవసాయ శాఖా కార్యదర్శి, ఆహార వ్యవసాయశాఖ ఆర్థిక సలహాదారుడు శ్రీ కె ఎన్ అనంతరామన్, ఐ సి ఎస్, జాలర్ల సహకార సంఘానికి సంబంధించిన సహకార సంఘాల సంయుక్త రిజిష్ట్రారు, కాకినాడలోని రాష్ట్రరేవుల అధికారి; సికిందరాబాదులోని సెంట్రల్ రైల్వే డివిజనల్ సూపరింటెండెంటు, విశాఖపట్టణంలోని సముద్ర గర్భంలో చేపలుపట్టే

కేంద్రం అసిస్టెంటు డైరెక్టరు, మత్స్యశాఖ డైరెక్టరు (ఈ సంఘం ఎక్స్ – అఫీషియో సభ్యుడు, కార్యదర్శి)

అనధికార సభ్యులు – శ్రీయుతులు ఎమ్. కృష్ణయ్య, ఎమ్.ఎల్.ఎ, ఎస్. వేమయ్య, ఎమ్.ఎల్.ఎ, జి. లచ్చన్న, ఎమ్.ఎల్.ఎ, ఎన్. గనేశ్వరరావు, ఎం.ఎల్.ఎ. పి. వెంకటస్వామిరెడ్డి, బాలె శ్రీరాములు; ఎమ్.ఎ. అప్పాయి నాయుడు, లంక వెంకటరావు

1963 ఆగస్టు 19 వ తేదీనుండి రెండు సంవత్సరాల పాటు యీ సంఘం పని చేస్తుంది

### వాణిజ్య పన్నుల అధికారి అధికారాలు

న్యూఢిల్లీలోని అప్లయిడ్ ఎకనామిక్సు రిసర్చి జాతీయ మండలి డైరెక్టరు జనరలు డా. పి. ఎస్. లోకనాథన్, తన ఆంధ్రప్రదేశ్ లోని కమర్షియల్ టాక్సు ఆచరణ విధానాన్ని గూర్చిన సమీక్షలో, రెండు లక్షలపైబడ టర్నోవరుపై పన్ను విధించే అధికారం సీనియరు ఉద్యోగులే నిర్వహించాలనీ, వర్తకుల దుకాణాల ఆవరణలను వాణిజ్య పన్నుల ఉప అధికారిగాని అంతకు పై తరగతి ఉద్యోగులే తనిఖీచేయాలనీ సిఫార్సు చేశారు

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం యీ సిఫార్సులను కొద్దిపాటి మార్పులతో అంగీకరించింది దీని ప్రకారం 3 లక్షల పైబడ్డ వ్యాపారంపై పన్ను విధించేఅధికారం వాణిజ్య పన్నుల అధికారికి వుంటుంది

### వ్యాపార వాహనాల అమ్మకం దారులు

ఇక్కడ వ్యక్తంచేసిన విధంగా ఆయా ప్రాంతాలలో వ్యాపార వాహనాల అమ్మకం దారులు నిర్వహించే రిజిస్టర్లను తనిఖీ చేయడానికి యీ దిగువ పేర్కొన్న అధికారులకు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం అధికారం యిచ్చింది రాష్ట్రరవాణా సంస్థ కార్యదర్శి, సహాయ కార్యదర్శులూ, ప్రాంతీయ రవాణా సంస్థ కార్యదర్శీ జంటనగరాలలో తనిఖీ చేయగలరు కడప, కాకినాడ డిప్యూటీ ట్రాన్స్‌పోర్టు కమీషనర్లూ; అన్ని ప్రాంతీయ రవాణా అధికారులూ తమ తమ పరిధులలో గల ప్రాంతాలలో తనిఖీ చేయగలరు



(34 వ పేజీ తరువాయి)

సాధించుకున్న స్వాతంత్ర్యాన్ని రక్షించుకునేందుకు, మానవత్వాన్ని మర్చిపోయిన రాక్షసుల్ని ఎదుర్కొనేందుకు – మనకు ఆయుధాలు కావాలి వాటిని విదేశాల్నుంచి తెప్పించుకోవాలి. అందుకు బంగారం హెచ్చుగా ఉపయోగపడుతుంది అత్యయిక పరిస్థితుల్లో బంగారం స్త్రీలకు అలంకారం కాదు దేశానికి అవసరం ఆ అవసరాన్ని గుర్తించి, భారతీయ స్త్రీలంతా తమ బంగారాన్ని ప్రభుత్వానికి ఉచితంగా సమర్పించాల్సిన తరుణమిది మనకంటె మన పాపే ఆ అవసరాన్ని త్వరగా గుర్తించి చక్కని పని చేసింది''

సుభద్రమ్మ ఏం మాట్లాడలేకపోయింది– మనస్సులో బాధపడడం కంటె

ఆ మరునాడు పగలు పదకొండు గంటలకు పాప స్కూలునుంచి పరుగెత్తుకొంటూ ఇంటకి వచ్చింది ఆ పిల్ల చేతిలో వార్తా పత్రిక ఉంది మాస్టరుగారు ఇచ్చారు

నాగరత్తమ వాకిట్లో నిలబడి పెరుగు అమ్ముకునే వెంకమ్మతో మాట్లాడుతూన్నది.

''అమ్మా! అమ్మా! ఈ పేపరుచూశావా! నాన్న బతికే వున్నాడమ్మా !''

నాగరత్తమ్మ కూతురు దగ్గర్నుంచి గబుక్కున పేపరుఅందుకున్నది చైనావాళ్లు విడుదలచేసిన కొంతమంది యుద్ధఖైదీల ఫొటో వుంది. ఆ ఫొటోలో నాసరయ్యా కూడా ఉన్నాడు భర్తనుచూసి నాగరత్తమ్మ కళ్ళు ఆనందోద్రేకంతో చెమర్చగా అప్రయత్నంగా పైటచెంగుతో తుడుచుకుంది

"నాన్న బొమ్మ పేపర్లో పడిందమ్మా ! మనమే గెలిచాం గెలుపు మనదే అమ్మా!" అన్నది పాప గంతులేస్తూ



# మనచరిత్ర-సంస్కృతి

# ఆంధ్ర చిత్రకళ

మనిషితోపాటే చిత్రకళ కూడా ప్రారంభమైంది కాబట్టి ఆంధ్రుల చరిత్రతోపాటే ఆంధ్ర చిత్రకళ కూడా ప్రారంభమైంది. ఆంధ్రజాతి అతి ప్రాచీనమైనది. ప్రపంచంలో అతి పురాతనమైన ఏ జాతికీ తీసిపోని ప్రాచీనత ఆంధ్రజాతికి వుంది. ఆంధ్రులను గూర్చిన ప్రసక్తి ఋగ్వేదంలో కూడా వున్నది. బహుశా ఆనాడు ఆంధ్రులు పుళిందులు మొదలయిన ఆటవిక జాతులతోపాటు ఆర్య సామ్రాజ్యపు సరిహద్దులలో నివసిస్తుండే మోటుజాతివారై వుండాలి. తనకు ఎదురుతిరిగిన శిష్యుల్ని విశ్వామిత్రుడు శపిస్తూ 'ఆంధ్రులలో కలిసి భ్రష్టులవ్వండి' అన్నట్టు వేదంలో వుంది. నిజమే. ఆదిలో ఆంధ్రులు అనాగరికులవలె అడవుల్లో, కొండల్లో సంచరించే ఆదిమ జాతివారై వుండవచ్చు. ఎంత అనాగరికులైనప్పటికీ వారిలోనూ చిత్రాలు గీసేవారూ, శిల్పాలు చెక్కేవారూ వుంటారు. ప్రతి జాతిలోనూ ప్రజల ఆశయాలను, ఆశల్ని అర్థంచేసుకుని; వారి విజయాల, పరాజయాల ఫలితాలను భౌతికంగా, మానసికంగా అనుభవించి; వారి ఆశయాలకు రూపకల్పనచేసి నలుగురికీ చాటిచెప్పి ఆనాటి సమాజాన్ని, భవిష్యత్తు మానవాళినీ ఉత్తేజితులనుచేసేవారు కొద్దిమంది ఉంటూనే వుంటారు. వారే చిత్రకారుడు, శిల్పి, కవి.

## విశ్వమానవ ప్రేమ

ఆంధ్రుల ప్రాచీన చిత్రలేఖనం క్రీస్తుపూర్వం రెవ శతాబ్దానికి చెందినట్టు కొంతమంది పరిశీలకులు భావిస్తున్నారు. వారి చిత్రాలను యీనాడు అజంతాలోని 9,10వ గుహల్లో చూడవచ్చు. ఎన్నుకున్న వస్తువును గూర్చి పరిపూర్ణ జ్ఞానం లేకపోవడం అంటూగాని, ప్రకృతికి సంబంధించిన ప్రాథమిక సూత్రాలు తెలియకపోవడం అంటూగాని వీరికి లేదు. వీరంతా యుగాలకొలదీ నిరంతర పరిశ్రమ, అకుంఠితదీక్ష, అలవాట్లతో పరిపూర్ణ ప్రజ్ఞను సంతరించుకున్న ప్రజ్ఞావంతులు. అయినప్పటికీ యీ చిత్రాలు ఆదిమ చిత్రకళగానే వున్నాయి. విశ్వమానవ ప్రేమ అనే బౌద్ధమత ధ్యేయాన్ని చాటి చెప్పడమే ఏకలక్ష్యంగాగల చిత్రకారులు గీసిన చిత్రాలు యివి. అజంతా చిత్రకారుడు మనుషులను, జంతువులను, పశువులను, జీవితంలో ఎదురయ్యే ప్రతి దానిని- పైన ఆకాశంలోని నక్షత్రాలను మొదలుకొని క్రింద నేలమీద గడ్డి వరకు సర్వాన్నీ-ప్రేమించేవాడు. మానవులు కాని చిత్రాలను చూసినప్పుడు కూడా వీటిలో మానవత్వం ఉన్నదనిపించేంత నేర్పుతో, విశాల దృక్పథంతో చిత్రించాడు ఆ చిత్రకారుడు. అజంతా చిత్రకారుడి హృదయ వైశాల్యం విశాలమైనది. సృష్టిలోని ప్రతి వస్తువుకూ అందులో స్థానం వున్నది. అజంతా గుహలను సందర్శించే ప్రతి వ్యక్తి హృదయమూ, ఎల్లప్పుడు కాకపోయినా చూసిన ఆ కొద్దిసేపయినా, సృష్టిలోని ప్రతి ప్రాణిమీదా దయతో, కరుణతో నిండిపోతుంది.

అమంచర్ల గోపాలరావు

అజంతా గుహల్లో వాడబడిన విధానాలు చరిత్రలో ప్రపంచంలోని ఏ దేశ చిత్రకారులు వాడిన విధానాలకూ తీసిపోవు. వాటిని మించకపోయినప్పటికీ వాటితో సరిసమానంగా మాత్రం వుండి తీరుతాయి. అజంతా చిత్రకారుడు దేన్నీ విడిచిపెట్టలేదు. ప్రతిదాన్నీ వ్యక్తం చేశాడు. ప్రతి సూక్ష్మ విషయాన్నీ అతను చిత్రించాడు. అయినా వ్యక్తం చేయదలచుకున్నదాన్ని పూర్తిగానూ, శక్తివంతంగానూ చెప్పగలిగాడు. చిత్రాలు వాస్తవ ధోరణిలోవున్నా కల్పన కనిపిస్తుంది. ఆకారాన్ని వ్యక్తం చేయడానికి వాడిన గీత, దాని స్వరూపం

అది వ్యక్తంచేసే బరువు నిజంగా శిల్ప, చిత్ర కళారీతుల సమ్మేళనానికి నిదర్శనం. అజంతా చిత్రాలలోని గీతలు ఎంతో సొంపుగా, సున్నితంగా, క్రమబద్ధంగా, అర్థవంతంగావుండి ఆ చిత్రకారుల నిర్మాణ కౌశలాన్ని చెప్పక చెప్పుతాయి. అజంతా చిత్రాలలో ఒక ప్రత్యేకమైన రూపాన్ని వ్యక్తం చేయడానికి గీతలు వాడబడినప్పటికీ, క్రమబద్ధమైన ఆ గీతల వాడకంలోనే ఆకృతి అనుకోకుండా వచ్చినట్టు అనిపిస్తుంది. ఇదే అజంతా చిత్రాల్లోని గీతల ప్రత్యేకత.

### ఆకృతి

పురాతన ఆంధ్ర చిత్ర, శిల్పకళల్లో సృజనాత్మకమైన, క్రమబద్ధమైన ఈ గీతలే గాకుండా యింకా చెప్పుకోదగ్గ విశేషాలు చాలా వున్నాయి. ఇందులోని ప్రాణుల రూపాలు ప్రాణంతో కదులుతున్నట్టు వుంటాయి. ముఖ్యంగా యిక్కడి మానవ రూపాలు భారతదేశంలోని మరి ఏ ఇతర చిత్రాలూ లేనంత చైతన్యవంతంగా వుంటాయి. వీటిలో వ్యక్తమయ్యే కదలిక అంతరంగిక ఆలోచనలకు, బాహ్య చేతలకు రెండింటికీ సంబంధించినది. కొంత కాలం పోతే యీ కదలిక, ఆ తరువాతి కాలంలోని అమరావతి, మహాబలిపురంలోలాగా ఆకృతినే మించిపోతుందేమో ననిపిస్తుంది. కాని మానవ రూపాల్లో, చూసేవారిలో ఆలోచనలను రేకెత్తించే గుణం వుంది. ఇదే ఆంధ్ర చిత్ర, శిల్పకళల విశిష్టతకు కారణం. అజంతా నుండి మహాబలిపురం వరకూగల ఆంధ్రుల కళను పరిశీలించిన అనేక మంది విమర్శకులు యీ విషయాన్నే వ్యక్తం చేశారు.

ఆంధ్ర చిత్ర, శిల్పకళలకు సంబంధించిన యీ తొలి దశ క్రీ. పూ. 3వ శతాబ్దం మొదలుకొని క్రీ. శ. 7వ శతాబ్దంవరకూ యించుమించు వెయ్యేళ్లు ఆవరించి వుంది. నిజంగా యీ కాలం ఆంధ్రులకు స్వర్ణయుగం. ఆ రోజుల్లో ఆంధ్రుల జీవితం ఉత్సాహంతో ఉరకలు వేస్తూ ఉండేది. ఆంధ్రులు దిగ్విజయ యాత్రలు చేసి, సామ్రాజ్యపు ఎల్లలను విశాలం చేసుకునే రోజులవి. ఆంధ్రదేశపు ఎల్లలు రాజకీయంగానే గాక, సాంస్కృతికంగానూ విశాలమౌతున్న రోజులు. ఆ రోజులలో ఆంధ్రుల శక్తి ఆకృతిని కూడా దాటిపోయింది.

### క్షీణదశ

ఆ తరువాత ఆంధ్రుల శక్తి, కళలు, సంస్కృతి యించుమించు పూర్తిగా ప్రాభవాన్ని కోల్పోయాయనే చెప్పవచ్చు. క్లిష్టమైనపరిస్థితులలోకూడా కాల ప్రవాహానికి ఎదురీది ధైర్యంగా నిద్రిస్తున్న అగ్నిపర్వతంవలె ఆంధ్రుల ప్రతిభ పూర్తిగా చచ్చిపోలేదని నిరూపిస్తున్నట్టుగా ఒంటరిగా నిలబడింది విజయనగర సామ్రాజ్యం. మళ్ళీ మరొకసారి ఆంధ్రుల ఉత్సాహావేశాలు కట్టలు తెంపుకొని ప్రవహించాయి. సంస్కృతీరంగంలోకి చొచ్చుకు పోయారు. విజయ ధ్వానాలతో సరిహద్దుల్ని చెరిపేసి కొత్త గీతల్ని గీశారు. ఈ కాలాన్ని జ్వర తీవ్రతగా అభివ్యక్తీకరించవచ్చు. ఆంధ్రుల మందగమనం అదృశ్యమైపోయింది. సాధ్యమైనంత త్వరలో గతకాలపు ప్రాభవాన్ని పునః ప్రతిష్టించాలన్న ఆరాటం, ఆతృత అధికమయ్యాయి. అందుచేత శాస్త్రీయ చిత్రకళస్థానే జానపద కళను ప్రవేశపెట్టడం జరిగింది. బ్రహ్మాండమైన శిల్పాలు మలచబడ్డాయి. చక్కటి కవిత్వం వ్యాప్తిలోకి వచ్చింది. యుద్ధాల్లో ఎన్నో గెలుపులు లభించాయి. కాని సమైక్యత దూరమైపోయింది. ఆంధ్రులు పూర్వపు కరుణ, ప్రేమ స్వభావాల్ని విడిచిపెట్టి, సామ్రాజ్య విస్తరణకాంక్షను పెంచుకుని, జానపద కళల వెంటబడి, కవిత్వానికి, శిల్పానికి అలంకారాలు తగిలించి, క్రిందబడి చివరకు తమలోని విరోధశక్తుల చేతుల్లోనే నాశనం కావలసివచ్చింది. మరోమారు ఆంధ్రదేశం ఛిన్నాభిన్నమైనది. ఆంధ్రులు ఒకనాడు నిర్మించిన బ్రహ్మాండమైన రాతికట్టడాలకేసి కొట్టి ఆంధ్రుల ప్రాభవం ధ్వంసం చేయబడింది.

### అలసిపోయిన శక్తి

ఎన్నో రాచరికపు తుఫానులూ, భూకంపాలూ కడచి దేశం యావత్తూ విశ్రాంతి తీసుకుంటూ వున్నప్పుడు గడచిన శతాబ్దం మధ్యకాలంలో ఆంధ్ర చిత్రకారుడు తిరిగి వెలుపలికి వచ్చాడు. ఈ విశ్రాంతి అభివృద్ధినిరోధక శక్తుల మీద విజయం సాధించి శాంతి సౌభాగ్యాలతో విశ్రాంతి తీసుకోవడం కాదు. బలిష్టమైన ఒక శక్తిని ఎదుర్కొని, గెలవలేక ఓటమిని అంగీకరించి, అలసటతో విశ్రాంతి తీసుకోవడం అది. భారతదేశంలోని మిగిలిన ప్రాంతాలన్నిటికంటే ఆంధ్రదేశం చాలా హీన స్థితిలో, క్లిష్టపరిస్థితుల్లో వదిలివేయబడింది. రాష్ట్రంలో ధనవంతులైన కళాభిమానులుగాని, కళాకారుల్ని పోషించే పెద్దపెద్ద నగరాలుగాని లేకుండా పోయాయి. వైభవం దిగజారిపోవడానికి అర్ధశతాబ్దం ముందునుండి విశాఖపట్టణంలోనూ, విజయనగరంలోనూ స్వయం ప్రతిభగల చిత్రకారుల, వృత్తిపనివారల కళాకౌశల్యాన్ని చూడగలుగుతున్నాం.

ఆ రోజుల్లో విజయనగరంలో తయారయిన బాణపు అమ్ములు, విశాఖపట్టణంలో తయారయిన యిత్తడి బొమ్మలు యీ నాడు ఎన్నో ప్రదర్శనశాలల్ని అలంకరించాయి. కాని ఆ తరువాతకూడా ఉన్న కొద్దిమంది కళాభిమానులు అలసిపోయి, ఏ మహత్తర కార్యానికన్నా శక్తిని వినియోగించే బలం లేక, కొంత కాలంపాటు సుఖంగా విశ్రాంతి తీసుకోవాలనే అభిలాషతో లలితకళలు వేటిపైనా శ్రద్ధ చూపించలేక పోయారు. ఆ నాటినుండి ఆంధ్రులు ఏదో తాత్కాలిక ఆనందంయిచ్చే తేలిక జీవితాన్ని గడుపుకొస్తున్నారు. జీవితాన్ని సుఖమయం చేసుకునే ప్రయత్నాలుగాని, భవిష్యత్తు మీద ఆశగాని లేకుండా నిస్తేజమైపోయి ఏదోవిధంగా బ్రతుకు వెళ్ళబోసుకుందాం అన్న ధోరణిలో వుండిపోయారు.

## సమీకరణ

అయినప్పటికీ ఆంధ్రదేశంలోని అతి సామాన్యమైన వీధిమనిషి, బీదతనమూ, బాధలూ, అసంతృప్తితో నిండిన యీ ప్రపంచంలో తను పోగొట్టుకున్న విశ్రాంతిని తిరిగి పొందాలని బలంగా కాంక్షిస్తూ ఆశలను పెంచుకున్నాడు. ఈ సమయంలో ఆంధ్ర చిత్రకారుడు చిత్రాలను అద్దంమీద త్రిప్పి వేయడం ప్రారంభించాడు. దేవుళ్ళను, దేవతలను చిత్రించాడు. పురాణేతిహాసాలను, కొన్ని సాంఘిక చిత్రాలనుకూడా చిత్రించారు. అవన్నీ శృంగారంతో కూడినవి. క్రమబద్ధమైన సుదూర భవిష్యత్తుపై కోరికను వ్యక్తంచేస్తున్నవి. ఈ చిత్రాలలో పూర్వపు ఆంధ్రుల చిత్రాలలోని అంత శ్శక్తిగాని, జీవంగాని వున్నట్టు లేదు. గీత చాలా ప్రధానమైనది స్వరూపాన్ని వ్యక్తం చేయడమేగాకుండా దానికి హద్దులనుకూడా నిర్ణయిస్తున్నది. అయినప్పటికీ పూర్వపు సృజనాత్మకత దీనికి లేదు ఈ చిత్రాలలోని కళ్ళు విశ్వాన్నిగాని, మానవాకృతి పూర్తిస్వరూపాన్నిగాని గుర్తించడంలో అర్ధనిమీలితాలైనట్టుగాక, తాము పోగొట్టుకున్న ఏ శక్తినో వెతుక్కుంటున్నట్టు కళ్ళు విప్పుకుని నిర్లిప్తంగా శూన్యంలోకి చూస్తున్నట్టు వున్నాయి అయినప్పటికీ వీటిలో రంగులు, వైవిధ్యము ఎక్కువగా వుండి హెచ్చుతగ్గులులేని రూపకల్పనకు కారణమైంది బహుశా యిది కళా ఉద్యమంగా పరివ్యాప్తిచెందిన భారతీయ చిత్రకళ స్వభావానికే విరుద్ధమైనది. ఈ కొత్తదానిని తంజావూరునుండి దిగుమతి చేసుకున్నారు. ఆ నాటికే అది సౌందర్యాన్ని, సొగసును పోగొట్టుకుని; భారతీయ కళాధ్యేయాన్ని వ్యక్తంచేయడంలో విఫలమై కేవలం అలంకార మాత్రంగా మిగిలి వుంది. పూర్వపు శక్తిసామర్థ్యాలు వుడిగి చైతన్యరహితమైన జీవితంతో నిరంతరానందాన్వేషణకై ప్రయత్నాలు లేక, ఏ ఆశా లేకుండావున్న సామాన్యునికి యీ చిత్రాలు తృప్తి కలిగిస్తుండేవి.

ఆ తరువాత దీనిస్థానే రవివర్మ చిత్రాలు వచ్చాయి ఇవికూడా లోగడ చిత్రాలవలె చైతన్యవంతం కానప్పటికీ ఈ చిత్రాలు జీవితాన్ని వ్యక్తంచేస్తూ, వివరిస్తూ, స్థూలజగత్తులో మనిషి సాధించవలసిన ధ్యేయాన్ని వ్యక్తంచేస్తుండేవి. స్థూలజగత్తునుమించి ఆలోచించే కోరిక ఆంధ్రులలో సన్నగిల్లినందువల్ల ఆనాటి మిగిలిన భారతీయులవలె ఆంధ్రులుకూడా ఈ చిత్రకళపై ఆసక్తి చూపించారు. ఆనాటి చిత్రకారునికి కావలసినది ఏదో విధంగా జీవితాన్ని, వెళ్ళబోసుకుని, సుఖంగా చనిపోవడమే పరస్పర నాశనంతో నిండిపోయిన యీ ప్రపంచం నుండి తప్పుకుతిరగాలని అతని వుద్దేశ్యం. చివరకు అతను, ఏ మహత్తర శక్తోతప్ప దీనినుండి విముక్తి కలిగించలేదని గుర్తించగలిగాడు.

## కొత్త విలువలు

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం మహాత్మాగాంధీ రాకతో మిగతా వారితోపాటు ఆంధ్రులు కూడా సరికొత్త జీవితంలోకి మరోసారి మేల్కొని తలెత్తిచూశారు. నిద్రపోతోన్న శక్తి మేల్కొంది. స్థూల జగత్తుకు మించిన దేనినో వాంఛిస్తూ దృష్టి సారించింది. దేశంనిండా స్వాతంత్ర్య భావాలు ప్రతిధ్వనించాయి. స్వేచ్ఛా భావాలతో బెంగాలు ముందుకు వెళ్ళిపోవడం ఆంధ్ర చిత్రకారులు పరిశీలించారు. స్థిరపడిపోయిన సనాతన సాంప్రదాయాలపై క్రొత్త విలువలను సృష్టించవలసిన అవసరాన్ని ఆంధ్రులతో సహా దేశమంతా గుర్తించింది.

అంతవరకూ చిత్రకళ అంటే వస్తువును వస్తువుగా చూపెట్టేదే అని అంతా అభిప్రాయపడుతుండేవారు. అవనీంద్రనాథటాగూరు కొత్త విలువలవైపు, సరికొత్త దృక్పథం వైపు నడిపించాడు.

ఆనాటి పరిస్థితిని వ్యక్తం చేస్తూ, శక్తిని ఉద్దీపింపజేస్తూ చిత్ర రచన చేసే అనేక మంది ఆంధ్రులు త్వరలోనే ఆంధ్రదేశంలోకూడా బయలుదేరారు. వాళ్ళల్లో చెప్పుకోదగ్గవారు దామెర్ల రామారావు, అడవి బాపిరాజు గారలు. ఇరువురూ భిన్న భిన్న రీతుల్లో చిత్రించారు. ఆ రెండూ రెండు విధాలుగా వ్యాప్తి

చెందాయి ఈ రెండు మార్గాలలోనూ అనేక మంది అనుయాయులు ఏర్పడ్డారు. దామెర్ల రామారావు బొంబాయి చిత్ర కళాశాలలో పట్టా పుచ్చుకున్నాడు ఆయన ఇంగ్లాండులో రాఫెల్‌కు ముందు తరం వారి చిత్రాల వల్ల ప్రభావితుడై స్వీయశైలిని జోడించి, ముఖ్య భావ ప్రకటనల్లో అజంతా గీతలను వాడి సిద్ధ హస్తుడయ్యాడు. ఆయనవి శృంగార చిత్రాలు. తన చుట్టూ వున్న జీవితాల్లో నుండే గాక పూర్వ చరిత్ర నుండి, పురాణాల్లో నుండి, సాహిత్యం నుండి యితి వృత్తాల్ని ఎన్నుకున్నాడు ఆయన శైలి వ్యక్తిత్వాన్ని కలిగి దేశ ప్రజలచేతా, విదేశ జనులచేతా ఒక ప్రత్యేకమైన శైలిగా గుర్తించబడింది ఈనాటికి కూడా ఆంధ్రదేశంలో అనేకమంది చిత్రకారులు యీ శైలిలోనే, కొద్దిపాటి మార్పులతో, చేర్పులతో చిత్ర రచన చేస్తున్నారు

బాపిరాజు నిశిత దృష్టి, సూక్ష్మ గ్రాహ్యత గల చిత్రకారుడు. ప్రమోద కుమార ఛటర్జీ ద్వారా ఆయన బెంగాలు చిత్రలేఖనంతో సుపరిచితుడై దాని ప్రభావానికి లోనయ్యి స్వీయప్రతిభ గల స్వంత శైలిని సృష్టించాడు. ఈతని రేఖలు అత్యంత సున్నితమైనవీ, మిగుల లయబద్ధమైనవీ, సృజనాత్మకమైనవీనూ ఈయన చిత్రాలు భావావేశంతో శృంగారంతో కూడినవి. సాధారణంగా భారతీయ పురాణేతిహాసాలనుండి ఈయన తన చిత్రాలకు వస్తువులను ఎన్నుకునే వాడు అప్పటి అభిప్రాయాలను ప్రతిబింబింపజేస్తూ, విపులీకరిస్తూ చిత్రాలను గీశాడు. పాశ్చాత్య ప్రభావంనుండి తప్పించుకోవడానికై గతంలోకి వెళ్ళి, భారతీయ సంస్కృతిని జోడిస్తూ వ్యక్తిత్వాన్ని సృష్టించుకున్నాడు అనేకమంది ఆంధ్ర చిత్రకారులు యీయన శైలిని అనుకరించారు కాని అందులోని భావ వేగాన్నీ, శుద్ధ ప్రకటననూ ఎవరూ అందుకోలేకపోయారు. ఈనాటికి కూడా బాపిరాజు చిత్రాలు విశిష్టమైనవిగా వుండిపోయాయి

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఆంధ్రదేశం కళా జీవితంలో కొత్త పుంత తొక్కింది విదేశ వత్తిడి, ప్రభావాలు మనమీద తొలిగిపోయాయి. మన చిత్రకారులు తేలిగ్గా ఊపిరి పీల్చుకోవడానికి వీలు కలిగింది. ఎంతోకాలం పరిశ్రమించి యీ తుఫాను గాలుల్ని ఎదుర్కొంటూ ధైర్యంగా నిలబడి అలసి పోయినతర్వాత యీ విశ్రాంతి వచ్చింది. అప్పుడు సత్యాన్ని వెతకాలనే బలీయమైన కోరికగాని, దూరంగా వుండిపోయిన ఆశయాన్ని అందుకోవాలనే ప్రయత్నంగాని, మానవ హృదయంలోని వైచిత్ర్యాలను పరిశీలించాలనే ఉద్దేశ్యంగాని లేవు కొత్త విషయాలను కనుగొనాలని గాని, దానిని ప్రపంచానికి తెలియజెప్పుదామనిగాని ఎవరికీ అనిపించలేదు ఏదో విధంగా తేలికగా పేరు ప్రతిష్ఠలు సంపాదించుకుందామనేదే ఒక అలవాటయి పోయింది జీవితంలోని యించుమించు అన్ని పథాలలోనూ యీ ధోరణి వ్యాపించిపోయింది.

## మందమైన రేఖ

ఈ లాంటి కాలంలో కూడా అనేక మంది ఆంధ్రచిత్రకారులు పుట్టుకొచ్చారు శృంగారంతో నిండిన చిత్రాలు ఈనాటివి పూర్తిగా వార్ధక్యం ఆవరించినట్టు అలసిపోయిన ఛాయలు యిందులో వున్నాయి. రామారావు, బాపిరాజు సృష్టించిన రేఖలు సృజనాత్మకమూ, వ్యక్తనీయముగా కాక మందంగా, అలంకారయుతంగా తయారయ్యాయి ఈ దళసరి లేఖ సొంపునే పోగొట్టుకుని, రూపాలపై బలమైన కప్పువలె ఆవరించి ఆకారాన్ని దాచివేసింది.

ఈనాడు చెప్పుకోదగ్గ చిత్రకారులుగా ఈ దిగువ పేర్కొన్న వారిని చెప్పక తప్పదు వీరంతా పాతదారుల్ని వదిలి పెట్టి కొత్త పుంతలు తొక్కారు కొత్త శైలులతో యింతకుపూర్వం ఆంధ్రదేశానికి తెలియని సరికొత్త పోకడల్లో చిత్రాల్ని గీశారు. అయినప్పటికీ ఆంధ్ర సాంప్రదాయమూ,హద్దులూమీరిపోలేదు. విజయనగరం నుండి పైడిరాజు, ఏలూరు నుండి మొక్కపాటి, మద్రాసు నుండి శ్రీనివాసులు ఆంధ్ర చిత్రకారుల్లో అగ్రశ్రేణి వారుగా అభివ్యక్తీకరించవచ్చు. వీరి చిత్రాలన్నీ భావప్రేరితమైనవీ, శృంగారమైనవీనూ. వీరి చిత్రాల్లో హెచ్చు తగ్గులు లేని అల్లికకై ప్రయత్నిస్తున్న కృషి కనిపిస్తుంది పైడిరాజు చిత్రాలలో మరికొంత చైతన్యమూ, జీవమూ తొణికిసలాడుతాయి శ్రీనివాసులు జెమినీరాయ్ చిత్రాలతో ఉద్దీపితుడై స్వంత శైలిలో చిత్రాల్ని గీసి అనేక ఉత్కృష్టమైన కళా ఖండాల్ని సృష్టించాడు

వీరంతా వివిధ శైలులలో చిత్ర రచన చేసినప్పటికీ వీరి చిత్రాలన్నీ అలంకార ప్రధానమై లోతు మృగ్యమైపోయి నట్టు వుంటాయి. సున్నితత్వంతో కూడి కొత్తదనానికై బలీయమైన కోరిక వుంటేనేగాని చిత్రాలలో లోతు సాధ్యం కాదు. విరుద్ధ ఆవేశాలూ, విభిన్న భావా

లలో యీనాటి చిత్రకారులు మునిగి పోయారు ప్రస్తుతం వుంటున్న పరిధులూ,సాంప్రదాయాలూకొత్తదనానికై చేసే ప్రయత్నాలకు అడ్డుగోడలుగా నిలిచాయి. అందుచేత వీరు రాత్రికీ, పగలుకూ మధ్య సంధ్యలో కొట్టుమిట్టాడుతున్నారు కొత్త లోకాలను, కొత్త జీవితాలను అన్వేషించే ప్రయత్నానికి తగినంత బలం లేకపోయింది. కేవలం అలంకార పద్ధతిలో ప్రకాశవంతమైన రంగుల సమ్మిశ్రితంతోనే చిత్రాలు గీస్తున్నారు చిత్రకారుడు లోకం వైపు దృష్టి సారించకుండానే, తన హృదయాంతరంలోకి చూపుల్ని పంపించకుండానే తను కట్టుకున్న నాలుగు గోడల మధ్యా భావాలను బంధించేసి గతాన్నీ భవిష్యత్తునూ లోపలకు దూరి రానీయలేదు చిత్రాలలోకి దిగుమతి చేయలేదు ప్రజల ఆశయాలను, అభిరుచులను వ్యక్తం చేయడానికి గాని, ప్రగతిలోకి ప్రజలను నడిపించడానికిగాని బలమైన అభిప్రాయంతో కూడిన ప్రయత్నమే లేదు నిజంగా ఆంధ్ర చిత్రకళకు యిది సంధికాలం ఈ సమయంలో ఆంధ్ర చిత్రకారుడు తన వ్యక్తిత్వాన్ని తాను చూసుకోవాలని చీకట్లో తడుములాడుతున్నాడు

## నిజమైన స్వేచ్ఛ

ప్రపంచమంతా వెతుకుతున్న కొత్త జీవితంవైపు ఆంధ్ర చిత్రకారుడుకూడా నిద్ర మేల్కొని దృష్టి సారించాడు ఈనాటి చిత్రకళ సనాతన సాంప్రదాయాలకుపూర్తిగా భిన్నమైనది ప్రపంచం కోరుతున్న కొత్త విలువలను ఆంధ్ర చిత్రకారుడు ఆసక్తితో గుర్తించడానికి ప్రయత్నిస్తున్నాడు మిగతా వారి లాగానే యితడుకూడా పరిధులను విశాలంచేసి, సనాతన సాంప్రదాయాలను వెనక్కు నెట్టివేశాడు నిజమైన స్వేచ్ఛతో ఊపిరి తీశాడు ప్రపంచంలోని మిగిలిన వారి వలెనే యీయనకూడా కొత్త మార్గాలకై పరిశోధనలు ప్రారంభించాడు.

ఈనాడు ఆంధ్ర చిత్రకారుడు కళ కళకొరకే అన్న వాదాన్ని నమ్ముతున్నాడు పూర్వపు యితిహాసాలను చిత్రాలకు వస్తువులుగా దింపడంలేదు కథలను వర్ణించడంలేదు వివిధ రంగుల సమ్మిశ్రితంతో, చైతన్యవంతమైన జీవంతో సరికొత్త ధోరణిలో చిత్రాల్ని నిర్మించడమే ఈయన ధ్యేయం

ఈనాటి యువ చిత్రకారులలో యస్ వి రామారావు, రెడ్డప్ప నాయుడు, మధుసూదనరావు, ఆంజనేయులు, అజీజ్, వై జె దేవ్ చెప్పుకో దగ్గవారు వీరంతా భావవ్యక్తీకరణలో అధునాతన పద్ధతులను అనుసరిస్తున్నప్పటికీ వీరెవరూ యింతకు పూర్వంవున్న ఏ 'ఇజం'లనూ అనుకరించడంలేదు.

సర్వ స్వాతంత్ర్యాన్ని కోరే నేటి ఆంధ్ర కళాకారుడు కేవలం శుద్ధవాదాన్ని చిత్రాల్లో చొప్పించలేక పోతున్నాడు. కొన్ని సమయాలలో ఒకే చిత్రంలో వివిధ దృక్పథాలను మేళవించడం జరుగుతుంటుంది కాబట్టి యీ నాటి ఆంధ్ర చిత్రకళను సమీకరణ చిత్రకళ అనవచ్చు నిజంగా యీనాడు ఆంధ్ర చిత్రకారుడు పూర్తిగా నిద్ర మేల్కొని, భావవ్యక్తీకరణకు కొత్త దారులను, బాటలను వెతకడానికై అకుంఠిత దీక్షతో కృషి చేస్తున్నాడు

ఈనాడు ఆంధ్రదేశం తను పోగొట్టుకున్న వ్యక్తిత్వాన్ని తిరిగి పొందే ప్రయత్నంలో సరియైన బాటలోనే వున్నదనవచ్చు బహుశా యీ ప్రారంభం తన వాస్తవ స్వరూపాన్ని గుర్తించడానికి కారణం కాగలదని, తద్వారా ప్రపంచానికి తిరిగి మరొకసారి భారతదేశం మార్గదర్శి కాగలదని ఆశించవచ్చు. ★



# ప్రగతి పథంలో

(జిల్లాలనుంచి అందిన అభివృద్ధి కార్యక్రమాలను గురించిన సంక్షిప్త వార్తలు)

కడప జిల్లా

*ఉత్తమ గ్రామీణ రేడియో గోష్ఠి :*

పొరుమమిల్ల పంచాయతీ సమితికి చెందిన రంగసముద్రం, గ్రామీణ రేడియో గోష్ఠిలో 1962 సంవత్సరానికి కడపజిల్లా అంతకూ ఉత్తమ గోష్ఠిగా నిర్ణయించబడింది. జిల్లా కలెక్టరు గోష్ఠికి బహుమతులు అందజేశారు. కడప జిల్లాలో మొత్తం 40 గ్రామీణ రేడియో గోష్ఠులు ఉన్నాయి.

గుంటూరు జిల్లా

*సాంద్రవ్యవసాయ పథకం :*

రేపల్లె బ్లాకులో వున్న మొత్తం 10 గ్రామాలలోనూ ఆగస్టు 1 వ తేదీనుండి సాంద్రవ్యవసాయ కార్యక్రమానికి ప్రారంభోత్సవం జరిగింది. ఆగస్టు మొదటి పక్షంలో రెండు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాలు_ ఒకటి వెల్లటూరులోను, మరొకటి ఉప్పూడిలోను_నిర్వహించబడ్డాయి 50 మందివరకూ స్త్రీలు యిక్కడ శిక్షణ పొందారు.

*రైతులకు సహాయం*

ఆగస్టు మొదటి పక్షంలో ఈమని బ్లాకులో రైతులకు రు. 25,000 ల మేరకు ఐ ఎమ్. ఎస్ ఋణాలు పంపిణీచేయబడ్డాయి. ఇంతవరకూ ఈ బ్లాకులో 7319 మంది గ్రామీణ స్వచ్ఛంద సేవాదళాల, పథకంలోనూ, 31,345 మంది రక్షణ శ్రామిక బ్యాంకు పథకంలోనూ తమ పేర్లను నమోదు చేసుకున్నారు.

రక్షణ శ్రామిక బ్యాంకు సహకారంతో ఈమని, పెదకొండూరు, గొడవర్రు గ్రామాలలో శ్రమదానం నిర్వహించబడింది

*ఎరువుల పంపిణీ*

ఆగస్టు నెలలో ఐపూరు బ్లాకులో 441 మణుగుల ఎరువులు పంపిణీ చేయడం జరిగింది. 120 ఎకరాల భూమి జపాను వరిసాగు పద్ధతిలో సాగులోకి తీసుకురాబడింది. వీటికితోడు 26 అధునాతన వ్యవసాయ పరికరాలు పంపిణీ చేయబడ్డాయి

ఖమ్మం జిల్లా

*పాఠశాల కొత్త భవనం .*

పాలేర్ పంచాయతీ సమితికి చెందిన గోకినపల్లిలో ఆగస్టు 20 వ తేదీన బాలికల ప్రాథమిక పాఠశాల కొత్త భవనానికి ప్రారంభోత్సవం జరిగింది సమితి భాగం రు. 1000 మించకుండా, యీ భవన నిర్మాణం ఖర్చు చెరిసగం ప్రాతిపదిక మీద భరించడం జరిగింది.

కరీంనగర్ జిల్లా

*వ్యాస రచనపోటీ*

కరీంనగర్ ఎస్. ఆర్. ఆర్. ఆర్. ప్రభుత్వ ఆర్ట్సు కళాశాల విద్యార్థులకు సెప్టెంబరు 1 వ తేదీన కరీంనగర్ జిల్లా పౌరసంబంధాల కార్యాలయానికి సంబంధించిన జిల్లా సమాచార కేంద్రంలో వ్యాస రచనపోటీ ఒకటి నిర్వహించబడింది. ఈ కళాశాల విద్యార్థులు పదిమంది యీ పోటీలో పాల్గొన్నారు.

*గ్రామీణ స్వచ్ఛంద సేవాదళం ఆసక్తి*

వెల్‌చెల్ గ్రామంలో గ్రామీణ స్వచ్ఛంద సేవాదళానికి చెందిన 250 మంది వాలంటీర్లూ, రక్షణశ్రామిక బ్యాంకుకు సంబంధించిన 66 మంది వాలంటీర్లూ, 1963 జనవరిలో యీ పథకాలు ప్రారంభమైనప్పటి నుండీ అన్ని విధాలా గ్రామం అభివృద్ధి చెందడానికి ఎక్కువ ఆసక్తి చూపుతున్నారు.

నాలుగు చిన్ననీటి వనరుల చెఱువులను రూ. 10,143 ల ఖర్చుతో మరమ్మతు చేసే కార్యక్రమం చేపట్టబడింది. అందులో అప్పుడే రెండింటి మరమ్మతు పూర్తయింది.

*సాగుక్రింద అధికభూమి .*

జపాను వరిసాగు పద్ధతి క్రింద 320

ఎకరాల భూమిని సాగులోకి తీసుకురావడం జరిగింది.

### కృష్ణా జిల్లా

*మరింతగా కంపోస్టు గోతులు :*

ఆగస్టు నెలలో 76 మణుగుల మేలుజాతి విత్తనాలను పంపిణీ చేయడం జరిగింది. విస్సన్నపేట పంచాయతీ సమితిలో 15 కంపోస్టు ఎరువు గోతులు త్రవ్వి, 958 టన్నుల కంపోస్టు తయారు చేయబడింది.

దీనికితోడు 1082 మణుగుల అమోనియం సల్ఫేటును, 1193 మణుగుల సూపర్ పాస్ఫేటును, 436 మణుగుల యితర రసాయనిక ఎరువులను, 1,000 మణుగుల తెలగపిట్టును ఆగస్టు నెలలో పంపిణీ చేయడం జరిగింది.

### కర్నూలు జిల్లా

*హంద్రీ వంతెన :*

ముఖ్యమంత్రి ఆగస్టు 28 వ తేదీన కర్నూలువద్ద హంద్రీ వంతెనకు ప్రారంభోత్సవం చేశారు. 7 లక్షల రూపాయల ఖర్చుతో నిర్మించబడిన యీ వంతెన పొడవు 576 అడుగులు.

### మెదక్ జిల్లా

*కొత్తరోడ్డు నిర్మాణం :*

మెదక్ జిల్లా పరిషత్తు రహదార్ల స్థాయీ సంఘం జిల్లా కలెక్టరు అధ్యక్షతన సమావేశమై యితర అనుమతులతో పాటు కొత్త రోడ్డు నిర్మాణానికిగాను రు 1,54,500 లను, పాఠశాల భవనాల మరమ్మతుకుగాను రూ 30,500 లను, పరికరాలకుగాను రూ 72,646 లను యివ్వడానికి అనుమతించారు. సాంఘిక సంక్షేమం క్రింద ఆయా పథకాలకు రూ 2,12,940 లను కేటాయించారు.

### నల్గొండ జిల్లా

*గ్రామ సహాయకుల శిక్షణ :*

చౌటుప్పల్ పంచాయతీ సమితికి చెందిన లింగోత్తం గ్రామంలో మూడు రోజుల గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం ఒకటి నిర్వహించబడింది వివిధ గ్రామాలనుండి ఎన్నిక చేసిన 50 మంది గ్రామీణులకు గ్రామీణ స్వచ్ఛంద సేవాదళంలోను, పశుపోషణాభివృద్ధిలోను, అధునాతన వ్యవసాయ పద్ధతులలోనూ శిక్షణ యివ్వబడింది.

ఈ శిక్షణ శిబిరానికి సమితి అధ్యక్షుడు ప్రారంభోత్సవం చేశారు.

*విద్యుచ్ఛక్తి సౌకర్యం :*

నల్గొండ జిల్లా చౌటుప్పల్ గ్రామంలో విద్యుద్దీపాలకు సెప్టెంబరు 3 వ తేదీన రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు అధ్యక్షుడు ప్రారంభోత్సవం చేశారు.

*మహిళా మండలి సమావేశం :*

నల్గొండ జిల్లా రెండవ మహిళా మండలి సమావేశానికి నాగార్జునసాగర్ ప్రాజెక్టువద్ద ఆంధ్ర ప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు అధ్యక్షుడు ప్రారంభోత్సవం చేశారు

### నిజామాబాదు జిల్లా

*సాంద్రవ్యవసాయ కార్యక్రమం:*

నిజామాబాద్ జిల్లాలో నిజామాబాద్, నవిపట్, అరమూరు, మోర్తాడ, భీమ్‌గల్, బోధన్, యడపల్లి, బాన్స్‌వాడ, యెల్లారెడ్డి, దోమ్‌కొండ పంచాయతీ సమితుల బ్లాకులలో సాంద్ర వ్యవసాయ పథకం బాగా వ్యాప్తిలో వుంది ఈ పథకం యిప్పుడు 231 గ్రామాలను ఆవరించి వుంది.

పైలట్ ప్రాజెక్టు పథకం క్రింద అధునాతన వ్యవసాయ పరికరాలను పంపిణీ చేయడానికి గాను జిల్లా పరిషత్తు ఆగస్టు నెలలో బాన్స్‌వాడా బ్లాకు పంచాయతీసమితిని ఎన్నిక చేసింది ఇందుకై రూ. 9632 లను యిచ్చింది.

### శ్రీకాకుళం జిల్లా

*ప్రణాళికా గోష్ఠి:*

బొబ్బిలి ఆర్. ఎస్. ఆర్. కె. రంగారావు కాలేజీ ప్రణాళికా గోష్ఠికి శ్రీకాకుళం జిల్లా కలెక్టరుఆగస్టు 26 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

### విశాఖ జిల్లా

కసింకోట బ్లాకులో గనపర్తి పంచాయతీ ఉత్తమమైనదిగా ఎన్నిక చేయబడింది. ఆగస్టు 29 వ తేదీన కసింకోటలో జరిగిన సమావేశంలో దీనికి రూ. 1,000 ల రొఖ్ఖాన్ని బహుమతిగా యివ్వడం జరిగింది.

విశాఖపట్నం జాయింటు కలెక్టరు వద్ద నుండి యీ బహుమతిని పంచాయతీ అధ్యక్షుడు అందుకున్నారు.

### వరంగల్లు జిల్లా

*గ్రామీణ స్వచ్ఛంద సేవాదళంలో మరింతగా సభ్యులు:*

ఆగస్టు నెలలో ములుగు పంచాయతీ సమితిలో గ్రామీణస్వచ్ఛంద సేవాదళాల్లోను, రక్షణ శ్రామిక బ్యాంకులలోనూ సభ్యుల సంఖ్యను పెంచే ప్రయత్నాలు విరివిగా జరిగాయి. 3260 మంది పురుషులు 1740 మంది స్త్రీలు గ్రామీణ స్వచ్ఛంద సేవాదళాల్లోనూ, 6710 మంది పురుషులు, 3010 మందిస్త్రీలు రక్షణ శ్రామిక బ్యాంకులలోనూ తమపేర్లను నమోదు చేసుకున్నారు.

పైలట్ పథకం క్రింద 25 చెరువులను మరమ్మతు చేయడం జరిగింది

### తూర్పుగోదావరి జిల్లా

నర్సాపురం సమితి బ్లాకులో మొత్తం వున్న 19 పంచాయతీలలోనూ గ్రామీణ స్వచ్ఛంద సేవాదళాల పథకాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. జూలై మాసాంతానికి 6014 మంది పురుషులు 683 మంది స్త్రీలు పైదళాలలో నమోదయ్యారు. 14,494 మంది పురుషులు, 14,167 మంది స్త్రీలు రక్షణ శ్రామిక బ్యాంకుల్లో నమోదయ్యారు.

*అదనపు భూమి సాగుదల.*

ఈ బ్లాకులో పై నెలలో రక్షణ శ్రామిక శక్తికి బదులుగా వచ్చిన రూ. 242 ల మొత్తాన్ని శ్రామికబ్యాంకులో డిపాజిటు చేయడం జరిగింది. అదనంగా 18 ఎకరాల భూమి సాగులోకి తీసుకు రాబడింది. ✻



# పదినీముల్యాలు

జలదస్వన గంభీరత,
నెలుఁ గొప్పఁగ దంతదీప్తులెసఁగ
ముకుందుం
దలరుచెవుల నఖిలజనం,
బులువిన ధృతరాష్ట్రభూవిభున
కిట్లనియెన్॥

జననాథ నీ యెఱుంగని,
పనులుగలవెయైనఁ దగవుఁ
బరమహితంబుం
దనవారికిఁ జెప్పనతగు,
ననివచ్చితి భారతాన్వయము ప్రియ
మొందన్॥

క్షీరోదకగతిఁ బాండవ,
కౌరవు లొడఁగూడి మనకి
కార్యంబది నీ
వారసి నడుపుము వా రన,
వీ రనఁ గురుముఖ్యా! నీకు
వేఱుంగలదే॥

భరతకులంబు ధర్మమును
బాడియు సత్యముఁబొత్తుఁ బెంపునుం
గరుణయుఁ గల్గియుండు ననఁగా
నుతిఁగన్నది యందు సద్గుణో
త్తరులరు నీవు నీయనుఁగుఁ
దమ్ముఁడు నీతనయుల్ యశోధురం
ధరశుభశీలు రీ సుచరిత
క్రమమిప్పుడు దప్ప నేటికిన్॥

ఈ వంశంబున కెల్ల నీవ కుదు
రిం దెవ్వారిచందంబు లె
క్కైవరిల్లినఁ గీడు మేలుఁ దుది
నీయం దొందెడుంగాన స
ద్భావం బారసి లోనిపొత్తు వెలి
వృత్తంబున్ జనస్తుత్యముల్
గావింపందగు నీక యెవ్విధమునం,
గౌరవ్యవంశాగ్రణీ॥

వినుము సుయోధనాదు లగు
వీరు సదర్ములుగాక కార్యము
ల్గొనక మహార్థసిద్ధి యెడలుఁ దమ
కిట్లన కన్వయంబున
ర్తన మిదిగాదు నాక బెడిదంపుఁ
దనంబున బంధుకోటికిన్
మనసులు నొవ్వఁగా నవ
గుణంబులకుం బయిలోడ
రేమియున్॥

కౌరవపాండవుల్ తెఱఁగు
గైకొని శాంతతఁ బొందియున్కి మే
లారయ నాకు నీకుఁ గుల
మంతకు నీన్నృపకోటి కుర్వికిం
బోరిత మైన నింతకును
బుట్టు మహాపద గావునన్ ధరి
త్రీరమణాగ్రగణ్య గణుతించి
యవశ్యముఁ బొం దొనర్పవే॥

నీకు వలసినఁ దీర్పంగ నేరవచ్చు.
నధిప తెఱఁగు నీవశమున
యదియు కాన
నీకు వీరలఁదేర్చుట నెఱియ కాదె.
సిద్ధమెవ్వారిఁదెలివొందఁజేయనేర్తు॥

అందు వృకోదరార్జునుల
నాహవరంగమునందు మీఱువా
రెందఱొ యెన్న మా యిచట
నీగురుభీష్ములఁ గ్రేణి సేయువా
రెందఱొ వారు వీరు నని
నీల్గుటకంటె భవద్బలంబులై
యందఱుఁ గూడు టొప్పదె
జనాధిప శాంతి యొనర్పు
మెమ్మెయిన్॥

జగతిఁగల జనపతులు నీచరణపీఠ,
మర్థిఁ గొలువసముద్రవేలావృతోర్వి
యెల్ల నేలుట యొప్పదే తల్లి ప్రజల
యెడ విరోధంబు వాటించు
టెంత మేలు॥

నరనాథ నీ యుపేక్షా
పరుఁడ వయినఁ గౌరవులక
పాండవులక కా
దరయఁగ భూప్రజకెల్లను,
దురితం బొనరించినట్ల తుదిఁ
గీడు సుమీ॥

కౌరవపాండవులం దె
వ్వారలకుం జావు నొవ్వ
వచ్చిన మేలు
ర్వీరమణ చిత్తమునఁ నె
ట్లారయుమా నీకు దుఃఖమగు
నెట్లయినన్॥

వీరును వారుఁ బండితులు
విక్రమవంతులు బాహుగర్వదు
ర్వారులు లోనిరత్త బవరంబున
నాఱడిఁ జావబోవనె
ట్లూరక యుండవచ్చుఁ గడు
నొప్పెడుమేనులు వాఁడికైదువుల్
కూరఁగ నాటినం బుడమిఁ
గూలుట కక్కట యోర్వవచ్చునే॥

ఇట్లుగాక యుండ నీరెండు
దెఱఁగుల,
వారిఁ గాచికొనుము వసుమతీశ
నీదుప్రాభవంబు నీతియు,
శాంతియు,
నఖిలజనులు బొగడునట్లు గాఁగ॥

అని చెప్పి వెండియు॥

పాండవులు తండ్రిసచ్చిన
ప్రజలు వారి,
నరసి ప్రోచితి శైశవ మాది గాగ

నడుమ నిష్కారణమ దిగవిడువఁ దగునె,
పార మొందంగ రక్షింపు గారవమున॥

**పాండు కుమారులు నీకుం బరమభక్తిం బ్రణమిల్లి యందఱు నొక్కమాటగా నీతోఁ జెప్పుమని నాకుం జెప్పినవిధంబు వినుము తనపంపునం బండ్రెండు వత్సరంబులు వనంబున వసియించితిమి; పదుమూఁ డగు నేఁడు జనపదంబున నజ్ఞాత వాసంబునుం జలిపితిమి. మా తండ్రి సమయంబు పరిపాలించి యే మర్ధరాజ్యంబెట్లునుం బడయుదుమని కృతనిశ్చయులమై పడితిమి. తల్లియుఁ దండ్రియు నెల్ల చుట్టంబులు నేడుగడయును మాకుఁ దాన మావలన నేరమి గల్గినం గినిసి యిట్లు గాదట్లని చక్కంబెట్టునది. తనగల పదివేలేండ్లకుం దన్న కాని మఱి యెఱుఁగ మెట్టివారమైనను మమ్మును దుర్యోధనాదులనుం దలంపరు. తనయందుఁ దెఱఁగు గలిగిన నెవ్వరు కొఱ గాకున్నను గులంబు పాడి సెడక చెల్లునని రనిపలికి మఱియు నిట్లనియె॥**

సారపుధర్మమున్ విమల
సత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁ
బాఱిన దైనయవస్థ దక్షు లె
వ్వార లుపేక్షసేసి రది
వారలచే టగుఁగాని ధర్మ ని
స్తారకమయ్యు సత్యశుభ
దాయక మయ్యును దైవ
ముం డెడున్॥

**అని యీ సభ్యులకు జెప్పుమనిరి. నీవును సభాసదులైనరాజులు నే మనియెద రనుం దేను ధర్మంబును నీతియును మున్నిడుకొని మనోవాక్ప్రకారంబు లేక రూపంబైన సత్యంబకాఁ జెప్పితి నిత్తెఱఁగు మీకు మేలు క్రోధమాన మత్సరంబులు విడిచి యిట్లు చేయుండు ॥**

పాండవులకుఁ దగినపాలు
మేదినిఁ బంచి,
యిచ్చుకంటె గార్య మెద్దిగలదు
ధర్మమెద్ది సముచితంబగు విధమెద్ది,
శక్యమెద్ది చెపుఁడ **వాక్యవిదులు॥**

అనిపలికి **మహారాజా,**
వినుమని ధృతరాష్ట్రితోఁడ
వెండియుఁ దా ని
ట్లనిచెప్పె వాసుదేవుఁడు,
తనమదినలలేక కార్యదశ తెలియఁగన్॥

వారితండ్రి పాలు వారికినిచ్చి నీ,
పాలు నీవుఁ బుత్రపౌత్రచయము
ననుభవించి సుఖుల రై యుండుఁ
డిది బంధు,
మిత్రసుజన కోటి మెచ్చు తెఱగు॥

ఎఱుఁగవె యజాతశత్రుని,
నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు
మిము నె
త్తెఱఁగున ననువర్తించెనొ,
యెఱుఁగవె తగుచేవ గలుగు
టెఱుఁగవె యధిపా॥

**నీ వెఱుఁగు దైనను జెప్పెద విను మింద్రప్రస్థపురంబున నుండి పాండవాగ్రజుఁడు నీకుం బెంపునుం బేరునుం జేయంగోరి**

మద మడగించి భూపతిసమాజము
నెల్లను నిన్నుఁ గొల్వఁ జే
యుదునని పూని దిగ్విజయ
మున్నతిఁ జేసి మహావిభూతితో
మదిమది నుండ నీసుతుఁడు
మంత్రులు నొబలు జూదమార్చి సం
పదఁగొని యంతఁ బోవక సభన్
ద్రుపదాత్మజ భంగపెట్టరే॥

**దానికి నీ వొడంబడితి**
ధర్మజుఁ డంతయుఁజూచి సత్యముం
బూని వృకోదరార్జునులు
బొంగులుగాఁ జెడజేతఁ గన్న నీ
రూనఁగ నొత్తుకొంచుఁ జని
యుగ్ర వనంబున దుఃఖమగ్నుఁడై
దీనతనుండి పూన్కిఁదగఁ
దీర్చియుఁగూడి మనంగఁ గోరెడిన్॥

తనుఁదాన పోలుంగా కే,
మనవచ్చు నజాతశత్రు
నతి శాంతతయున్
వినయము గౌరవమును నే,
జనపతులకుఁ గలవు చెపుమ
సౌజన్యనిధీ॥

ఏ నింతాడితి నీసం,
తానం బిరుదెఱఁగునకు హితము
గోరి భవ
త్సూనునిమతియతిలోభము,
మానిచి పాండవులఁ దెమ్ము
మనుజాధీశా॥

వారలు శాంతశూరులు
భవచ్చరణంబులు గొల్వఁ బూని యు
న్నారటఁ గాక మీ కది
మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండుదురు
భూవర రెండుదెఱంగులందు నీ
కారయఁ బథ్యమేది **యగు**
నవ్విధమేర్పడ నిశ్చయింపుమా॥

అనవుడు రోమహర్షణము
లంగములం బొడమన్ సదస్యు లె
ల్లను బ్రియమంది నెమ్మనములం
బురుషోత్తముఁ డింత యొప్పఁ బ
ల్కు నె మఱుమాటలాడ నయ
కోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁడిం
దనువరి యెవ్వఁ డంచు నచ
లాకృతులై నెఱి నూర కుండగన్॥

**(తిక్కన–భారతము–ఉద్యోగ పర్వము)** ★

# ప్రభుత్వ నిర్ణయాలు

* సైన్సు అకాడమీ ఒక దానిని స్థాపించి, దానికి రూ. 50,000 లను గ్రాంటుగా యివ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

* హైదరాబాదులోని నేత సహకార స్పిన్నింగుమిల్లుకు నిర్వహణ పెట్టుబడిగా 10 లక్షల రూపాయల మేరకు ఋణాన్ని యివ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

* చేనేత సంస్థలకు పంపిణీ చేయడానికిగాను తెలంగాణా ప్రాంతానికి కేటాయించిన రూ. 68 లక్షలతో సహా రిజర్వుబ్యాంకు ఆఫ్ ఇండియా రాష్ట్రంలోని కేంద్ర సహకార బ్యాంకులకు యిచ్చే మొత్తం రూ. 200 లక్షల ఋణానికి గ్యారంటీ యివ్వడానికై ప్రభుత్వం నిశ్చయించింది.

* హైవేస్ శాఖలోని వర్క్-ఛార్జి సిబ్బందిని పి. డబ్ల్యు. డి. సిబ్బందితో సమానంగా పరిగణించడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

??? ??

# ప్రశ్నలు - సమాధానాలు

!!!!!

శ్రీ ఆర్. చంద్రయ్య, ఎర్రవహాడ్,
నిజామాబాద్ జిల్లా

ప్రశ్న దయచేసి యీ సమాచారాన్ని అందజేయండి.

(1) బ్లాకులలో వున్న ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలలో పనిచేసే సిబ్బంది చేత యింజక్షను చేయించుకుంటే వారికి డబ్బు యివ్వాలా ? లేక ప్రభుత్వమే ఆ ఖర్చును భరిస్తుందా?

(2) ఒకవేళ ధనవంతుల వద్దనుండి డబ్బు తీసుకుని బీదవాళ్ళ వద్దనుండి డబ్బుతీసుకోకుండానే చికిత్సచేస్తారా లేక అందరికీ సమానంగానే చికిత్స చేస్తారా ?

సమా: ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో పనిచేసే వైద్య అధికారులకు ప్రాక్టీసు చేయనందుకుగాను నెలకు రూ 100 అలవెన్సు యిస్తూ వుంటారు అందుచేత వారు ప్రయివేటు ప్రాక్టీసు చేసి రోగులకు యింజక్షన్లు యిచ్చినందుకు డబ్బు పుచ్చుకోవడానికి వీలులేదు

ఒక్కొక్క కేంద్రానికి సంవత్సరానికి రూ 20,000 ల సహాయక గ్రాంటును స్టేజి 11 క్రింద అన్ని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు యివ్వడానికిగాను బ్లాకులన్నింటికీ అందజేయడం జరుగుతుంది. సిబ్బంది వేతనాలు, అలవెన్సులు, మందులను కొనడం మొదలయిన యితర ఖర్చులు యీ గ్రాంటునుండే ఖర్చుచేయాలి ఒకవేళ ప్రాథమిక ఆరోగ్య కేంద్రం సాంవత్సరిక ఖర్చు ఆ సంవత్సరం దానికిచ్చిన రూ 20,000 ల ఖర్చును మించి వున్నట్లయితే, అలా మించివున్న డబ్బును ఆయా కేంద్రాలకుసంబంధించిన పంచాయతీ సమితుల సాధారణఆదాయాలనుండిపొంది, మరుసటి సంవత్సరం ఆయా కేంద్రాలకు యిచ్చేగ్రాంటులనుండి ఆ డబ్బును సర్దివేయడంజరుగుతుంది

ధనవంతులకు, బీదవారికి — ఇరువురకూ ఉచితంగానే చికిత్స చేయబడుతుంది. ఇరువురినీ ఒకేరకంగా చూస్తారు.

శ్రీ వి శ్రీనివాసాచార్యులు, పామర్రు,
గుడివాడ తాలూకా

ప్ర: వృత్తులను కోల్పోయిన స్వర్ణకారులకుగానీ, వారి పిల్లలకుగానీ ఏమైనా స్కాలర్‌షిప్పులు, పుస్తకాలగ్రాంట్లు, ప్రత్యేక ఫీజులరాయతీల సౌకర్యాలు కల్పించబడ్డాయా? ఏ విధంగా అవి వారికివర్తిస్తాయి.

సమా 14 కారట్లనుమించి బంగారు నగల తయారీపై విధించిన నిర్బంధం కారణంగా వృత్తులను కోల్పోయిన స్వర్ణకారుల పిల్లలకు XII తరగతి వరకు ఉచిత విద్యా సౌకర్యాన్నికల్పిస్తూ ప్రభుత్వం ఉత్తరువులను (9-7-63 తేదీ జి. ఒ. ఎమ్ ఎస్. నెం 1708 పరిపాలన) జారీచేసింది. అయితే యిట్టివారు తమతండ్రులు వృత్తులను కోల్పోయినట్లున్నూ వారి వార్షికాదాయం రూ. 1,800 లకు మించనట్లున్నూ ఒక సర్టిఫికెట్టును అందజేయవలసి వుంటుంది. రాష్ట్రంలోగల అన్ని సెకండరీ పాఠశాలల అధికారులకు యీ విషయంలో అవసరమైన ఉత్తరువులను యివ్వడం జరిగింది. అందుచేత పై సౌకర్యాలను పొందడానికి అర్హులైన వారు ఆయాసంస్థల అధికారుల వద్దకువెళ్ళి ఉచితవిద్యా సౌకర్యాన్ని కల్పించవలసిందిగా కోరవచ్చును. స్కాలర్‌షిప్పులు, పుస్తకాలఅలవెన్సులు, ప్రత్యేకఫీజు రాయితీలు మొదలయిన సౌకర్యాలనేమీ ప్రభుత్వం కల్పించలేదు.

శ్రీ ఎ. సుబ్రమణ్యం, పేలమ్ ఎస్టేట్,
కులిమ్ (పి. ఒ) ద కెడా, మలయా.

ప్ర. హైదరాబాదు,విజయవాడల్లోని ఆకాశవాణి కేంద్రాలు విదేశాలలోని ఆంధ్రుల కొరకు ఏమన్నా ప్రత్యేక ప్రోగ్రాములను నిర్వహిస్తాయా ?

సమా ప్రథమంలో హైదరాబాదులోని ఆకాశవాణి కేంద్రం ప్రోగ్రాములన్నీ ఆంధ్రప్రదేశ్‌లో నివసించే వారిగురించే ఉద్దేశించబడ్డాయి. అయినప్పటికీ షార్టువేవ్ ట్రాన్సిమిటర్ ద్వారా (హైదరాబాదు-బి)

ప్రసారం చేయబడే తెలుగు ప్రోగ్రాములు వాతావరణం అనుకూలంగా వున్న సమయాలలో బయటివారికికూడా వినిపిస్తాయి. విదేశాలలోని భారతీయులు గానీ, విదేశీయులుగాని వినడానికి వీలుగా ఢిల్లీలోని **ఆకాశవాణి** కేంద్రానికిచెందిన ఎక్స్టర్నల్ సర్వీసు విభాగం ఉద్దేశించబడినది. ఇంగ్లీషు ప్రోగ్రాములేకాక యీ విభాగం విదేశ శ్రోతలకొరకై హిందీ, తమిళం, కొంకణి, గుజరాతీ భాషలలో కూడా ప్రోగ్రాములను ప్రసారం చేస్తున్నది.

*శ్రీ మహాకాల లక్ష్మయ్య, నరసారావుపేట.*

ప్ర : గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా తుమ్మురుకోట గ్రామం వద్ద భూగర్భంలో రెండుకోట్ల టన్నులమేరకు యినుప ఖనిజం నిధులు వున్నట్టు కొంతకాలం క్రిందట పత్రికలలో వార్తలు వచ్చాయి. దయచేసి వీటి వివరాలు తెలియజేయండి ?

సమా : గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా తుమ్మురుకోట రిజర్వుడు ఫారెస్టులో ఏ విధమైన ఇనుప ఖనిజం నిధులూ భూగర్భంలో వున్నట్టు భారతదేశపు భూగర్భ పరిశోధనల సర్వే నివేదికలో ప్రచురించ బడలేదు.

*శ్రీ టి వి.ఎస్ నమ్మాళ్వార్, రాఘవపురం:*

ప్ర. ఎట్టి పరిస్థితులలో జిల్లాలలో కాజీల అధ్వర్యంలో పనిచేసే నాయిబ్ కాజీలను తొలగించడం జరుగుతుంది? నాయిబ్ కాజీలు అక్రమంగా తొలగింపబడితే వారికి ఎక్కడ న్యాయం చేకూర్చ బడుతుంది ?

సమా: 1880వ సం.పు కాజీలచట్టం విభాగం 2 క్రింద ప్రభుత్వం కాజీలను నియమిస్తుంది. నాయిబ్ కాజీలను కాజీలు నియమిస్తారు వీరు కాజీల కార్యాలయానికి సంబంధించిన పనులలో కాజీలకు సహాయపడతారు. ఈ కాజీలు తమ యిష్టప్రకారం నాయిబ్‌లను తొలగించుటకు గాని, సస్పెండు చేయుటకుగాని అధికారాన్ని గలిగి యున్నారు. నాయిబ్‌లను తొలగించడంపై కాజీల చర్యలను పరిశీలించుటకు ప్రత్యేకంగా న్యాయస్థానముగానీ, యంత్రాంగం గాని యీ చట్టం క్రిందలేదు. ఒకవేళ అక్రమముగా నాయిబ్ ఉద్యోగంనుండి తొలగింపబడినా, లేక సస్పెండు చేయబడినట్టయితే ఆ ప్రాతిపదికపై తిరిగి ఉద్యోగంలో చేరే చట్టబద్ధమైన హక్కు కలిగి నప్పుడు అతనికి న్యాయం చేకూర్చ గలిగేది ఒక్క సివిలు కోర్టు మాత్రమే.

*శ్రీ విక్రం బలరామస్వామి, చిలకలపల్లి, శ్రీకాకుళం జిల్లా:*

ప్ర ఇప్పుడు బ్లాకులలోని వయోజన విద్యా పాఠశాలలను ప్రభుత్వం గుర్తిస్తున్నదా ? గుర్తిస్తునట్లయితే అట్టి గుర్తింపును పొందడానికి ఎవరికి దరఖాస్తు చేయవలసి వుంటుంది?

సమా పంచాయతీ సమితులు నిర్వహించే అన్ని వయోజన విద్యా పాఠశాలలకు గుర్తింపు లభిస్తున్నది ఈ గుర్తింపుకై దరఖాస్తు చేయదలచిన వారు వారికి సంబంధించిన బ్లాకు డెవలప్‌మెంటు అధికారి ద్వారా జిల్లా విద్యాధికారికి దరఖాస్తు చేయవచ్చును.

వయోజనవిద్యాపాఠశాలల ఉపాధ్యాయుల కొరకై ప్రభుత్వం విజయవాడ వద్ద పటమటలో ఒక శిక్షణ పాఠశాలను నిర్వహిస్తున్నది. ఈ పాఠశాలలో శిక్షణపొందదలచుకున్నవారు బ్లాకు డెవలప్‌మెంటు అధికారి ద్వారా జిల్లా విద్యాశాఖాధికారికి దరఖాస్తు చేయవలెను. 



ఇంటిముందు గుర్రం వచ్చి ఆగింది.

గులేరీ లోపలినుంచి పరుగెత్తుకుంటూ బయటికి వచ్చింది. ఆ గుర్రం ఆమెకు గుర్తే! బయటకువచ్చి దాని వీపుమీద గోముగా నిమిరింది. ఆ గుర్రంతో వచ్చిన నథూను రక రకాల ప్రశ్నలు వేసి పుట్టింటి కబుర్లు తెలుసుకున్నది.

గులేరీ పుట్టింది చంబాలో! మెట్టినిల్లు లక్కడ్‌మండీకి, ఖజియారాకు సమీపంలో ఎత్తుప్రదేశంలోవున్న ఒక కుగ్రామం. ఖజియారాకు ఒక మైలు దూరంలో చిన్నచిన్న కొండలు, గుట్టలు వున్న ప్రదేశ మొకటి వున్నది. అక్కడ నిలబడిచూస్తే పల్లంలో వున్న చంబా యిళ్ళు ఏవో బిందువులవలె కన్పిస్తాయి.

పంజాబీ కథ

**మూలం :**

శ్రీమతి అమృతాప్రీతమ్

**అనువాదం :**

శ్రీమతి డి. మంజులత

గులేరీకి మనస్సు బాగాలేనప్పుడల్లా భర్త మానక్‌ను వెంటబెట్టుకొని ఆ గుట్టల మీదికి వెళ్ళి కూర్చుంటుంది. అక్కడ కూర్చుంటే ఆమె కెందుకో హాయి అనిపిస్తుంది. అక్కడికి చంబా గ్రామానికి చెందిన యిళ్ళు బొమ్మరిళ్ళకుమల్లే కన్పిస్తాయి. ఆ బొమ్మరిళ్ళు ఆమె హృదయానికి ఆనందాన్ని కలిగిస్తాయి.

అనువాదభారతి

ఆమె సంవత్సరానికొక పర్యాయం-ఆశ్వయుజ మాసంలో పుట్టింటికి వెళ్ళి తీరవలసిందే! ఎందుకంటే ఈ మాసంలోనే వాళ్ళ ఊళ్ళో పెద్ద ఎత్తున ఉత్సవాలు జరుగుతాయి. ఆ ఉత్సవాలకు కొన్ని రోజులు ముందుగానే ఆమె తలిదండ్రులు మనిషిని పంపిస్తారు. ఆ సమ

యానికి గులేరీ స్నేహితురాళ్ళంతా అత్త వారిళ్ళ దగ్గరనుంచి పుట్టింటికి వస్తారు. అంతా కలుసుకొని కులాసాగా కబుర్లు చెప్పుకుంటారు, తమతమ అనుభవాలను ముచ్చటించుకుంటారు. ఉత్సవాల సమయంలో వాళ్ళు అనుభవించే సంతోషం అంతా ఇంతా కాదు.

ఇద్దరు ముగ్గురు పిల్లలున్నవాళ్ళు పిల్లల్ని వాళ్ళ తాత ముత్తవ్వల దగ్గర వదలివస్తారు ఇక మరీ చిన్నపిల్లలుంటే-వెంట తీసుకొచ్చి పుట్టింట్లో అడుగు పెట్టడం తడవుగా తల్లికి అప్పగిస్తారు ఉత్సవాలకు కొత్త బట్టలు కుట్టించుకుంటారు ''చునరియా''లకు రకరకాల రంగులు వేయించి వాటి మీద రకరకాల అల్లికలు కుట్టడంలో నిమగ్నమవుతారు ఉత్సవాలలో రకరకాల రంగురంగుల గాజులు కొంటారు సుగంధపు తైలాలను, ఘుమఘుమలాడే సబ్బులనుకొని, ఉపయోగించి తిరిగి యౌవనవతులమని ఊహించుకొని సంతోష పడుతుంటారు

గులేరి పుట్టింటికి వెళ్ళే ఈ మహూర్తం కోసమే ఎదురుతెన్నులుచూస్తున్నది ఇలా ఎదురుచూసేది ఒక్క గులేరియేకాదు ఎటువంటి యువతులయినా – ఎప్పుడు ఆశ్వయుజం వస్తుందా అని ఎదురు చూస్తారు

గులేరి నిరీక్షణ ఫలించింది పుట్టింటి నుంచి గుర్రం వచ్చింది గుర్రం వెంట వచ్చిన నాథూని ఎంతో మర్యాద చేసింది

నేను పుట్టింటికి వెళ్తున్నానని గులేరి ఎవ్వరితోనూ చెప్పలేదు. అలా చెప్పవలసిన అవసరమేలేదు ఆమె మొహం మీద నృత్యం చేస్తూన్న ఆనందోత్సాహాలే చెప్పక చెబుతాయి మానక్ చిలమ్ దమ్ము పీల్చుకుంటూ అకస్మాత్తుగా కళ్ళు మూసుకున్నాడు – పొగాకు ఘాటు సహించలేక అలా చేశాడో లేక భార్య మొహంమీద నృత్యంచేస్తున్న ఆనందోత్సాహాలను పరికించి అలా చేశాడో మరి!

''మీరు ఉత్సవాల నాటికి వస్తారు కదూ ?''అని అడిగింది గులేరీ భర్తపక్కన కూర్చుంటూ!

ఎందుకో మానక్ చేతులు వణికినాయి! చేతిలోని చిలమ్ అవతలబెట్టి మాటా పలుకూ లేకుండా కూర్చున్నాడు.

''మాట్లాడరేమిటి ?''అని కొంచెం కోపంగా అన్నది గులేరి

''గులేరీ! ఒక సంగతి చెప్పనా ?''

''మీరు చెప్పే సంగతేమిటో నాకు తెలుసులెండి ఏదో సంవత్సరానికొకసారి పుట్టింటికి వెళ్తున్నాగదా—ఇప్పుడు కూడా వెళ్ళవద్దని అంటే ఎలా చెప్పండి''

''ఇదివరలో ఎప్పుడైనా వెళ్ళవద్దని అన్నానా ?''

''అయితే మరి ఈసారి ఎందుకు చెబుతున్నట్టు ?''

''ఈసారి ఈసారి .''మానక్ నసిగాడేగాని, నోటి నుంచి మాటరాలేదు. నిట్టూర్చి వూరుకున్నాడు

''అత్తగారు లక్షణంగా వెళ్ళిరమ్మని దీవిస్తూవుంటే మధ్యన మీరు వెళ్ళవద్దని పోరు పెడతారేమిటి ?'' గులేరి గునిసింది.

''మా అమ్మ!'' మానక్ మధ్యలోనే ఆగిపోయాడు.

ఆ రెండవ రోజున పెందలకడ లేచి చక్కగా అలంకరించుకొని బయలుదేరి వెళ్ళడానికి సిద్ధపడింది గులేరీకి ఏ వయస్సు పిల్లలూ లేరు – అత్తగారింటి దగ్గర వదిలి వెళ్ళటానికి! నథూ గుర్రం మీద జీను సిద్ధంచేశాడు. అత్త మామలిద్దరూ తలనిమిరి గులేరినిఆశీర్వదించారు.

''నీతో కొంతదూరం నేనూ వస్తా, పద!''అన్నాడు మానక్! గులేరీ సంతోషానికి మేరలేకపోయింది. వెంటనే లోనికెళ్ళి పిల్లనగ్రోవి తెచ్చి పమిట చెంగు చాటున దాచిపెట్టుకున్నది.

ఖజియారా దాటారు. ఆ తరువాత మరొక కోసుదూరం నడిచారు అక్కడి నుంచే చంబాకు వెళ్ళే మార్గం ఏటవాలుగా వుంటుంది. పిల్లనగ్రోవి బయటికి తీసి గులేరి మానక్ చేతి కిచ్చింది 'మోగించరేం?'అని ప్రశ్నించింది-అలాగే నిలబడిపోయిన భర్తనుద్దేశించి గులేరి మానక్ చెయ్యి పుచ్చుకున్నది. మానక్ ఉలిక్కిపడి ఆమెవైపు దీక్షగా చూశాడు

''మురళి మోగించరేం ?'' అని గులేరీ మళ్ళా ప్రశ్నించింది

మానక్ మురళిని పెదాలమీద పెట్టుకొని ఊదాడు. కాని ఎటువంటి స్వరమూ బయటికి పెగిలిరాలేదు! అది చెడిపోయిందేమో!

''గులేరి! వెళ్ళవద్దునువ్వు! మరొకసారి చెప్తున్నా—నీ ప్రయాణం మానుకో గులేరీ!''

మానక్ తన చేతిలో వున్న పిల్లనగ్రోవిని గులేరికి తిరిగి యిచ్చివేశాడు

''ఇంతలో మునిగిపోయిందేమిటండీ ? మీ రెలాగూ-సంబరాని కొస్తారాయె! పోనీ అప్పుడు మీతోనే తిరిగివస్తా! సరేనా ?''

మానక్ మారు మాట్లాడలేదు. గులేరీ మొహంలో మొహంపెట్టి చూశాడు. ''గులేరి! ఇక నువ్వు తిరిగిరావు! తిరిగి వస్తావనుకోవటం శుద్ధ అబద్ధం!'' అని చెబుతున్నట్టుగా వున్నాయి ఆ చూపులు! అయితే నోరు తెరిచి ఒక్కమాటకూడా చెప్పలేదు.

గులేరీ, మానక్ — ఉభయులూ ఒక రాతిని ఆనుకొని నిలబడ్డారు. నథూ పది గజాల ముందుకువెళ్ళి గుర్రాన్ని నిలబెట్టాడు. అయితే మానక్ మనస్సుకు ఎంత కళ్లెంవేసి ఆపినా ఆగటంలేదు....

మానక్ మనస్సు అటూ ఇటూ తిరుగుతూ ఏడు సంవత్సరాల వెనక్కు వెళ్ళిపోయింది. ఈ రోజుల్లోనే తను మిత్రులతో కలిసి-ఇదే దారిన చంపా ఉత్సవాలు చూట్టానికి వెళ్ళాడు. ఉత్సవాలలో రకరకాల గాజులు, బట్టలు, - ఒకటేమిటి సమస్త వస్తువులు అమ్ముతున్నారు. ఈ ఉత్సవంలోనే తను మొదటిసారి గులేరీని చూశాడు. ఇద్దరి చూపులూ కలిశాయి. ఆ తరువాత తను గులేరీని వివాహం చేసుకోవడానికి తీర్మానించుకున్నాడు.

సంప్రదాయం ప్రకారం మానక్ తండ్రి పిల్ల తండ్రికి కొంత కట్నం యిచ్చుకోవాలి. గులేరీ తండ్రి ఎంత డబ్బు అడుగుతాడోనని మానక్ భయపడ్డాడు. అయితే గులేరీ తండ్రికి కొన్ని ఉన్నతాదర్శా లుండటంవల్ల - కట్నం విషయంలో ఆయన కేటువంటి పట్టింపులు లేవని, కుర్రవాడు గౌరవనీయమైన కుటుంబానికి చెందినవాడై, గుణవంతుడై వుంటే ఒక్క పైసాకూడా కోరడని తరువాత మానక్‌కు తెలిసింది.

ఆ తరువాత ఉభయుల వివాహం ఎటువంటి అడ్డూ, ఆటంకమూ లేకుండానే జరిగిపోయింది

"ఏమి టివ్వాళ మీరు అదే పనిగా ఆలోచిస్తున్నారు ? మీ మనసులో ఉన్న విషయ మేమిటో చెప్పండి ?''అని గులేరీ మానక్ భుజం పుచ్చుకొని అడిగింది.

మానక్ గులేరీవైపు చూశాడు, కాని మాట్లాడలేకపోయాడు.

గుర్రం సకిలించేప్పటికి - గులేరీకి ప్రయాణం విషయం గుర్తుకొచ్చింది. ఆమె ముందుకు నడుస్తూ-''మరొక రెండు మైళ్ళునడి స్తే 'పూలవనం' వస్తుందికదూ? ఆ వనం మధ్యనుంచి వెళ్తూంటే ఎంత ఆనందంగా వుంటుంది ! అవునుకదూ ?'' అని అన్నది !

"అవును !"అని అన్నాడు మానక్ నెమ్మదిగా !

''మీరు నా మాటలు వింటున్నట్టు లేదు !''

''అవును గులేరీ ! నిజం చెబుతున్నావు ! నాకు నీ మాటలు విన్పించటంలేదు.'' దీర్ఘంగా నిట్టూరుస్తూ అన్నాడు మానక్ !

ఉభయులూ ఒకరి మొహం ఒకరు చూచుకున్నారు. అయితే ఒకరి భాష మరొకరికి అర్థంకాలేదు.

''ఇక నేను వెళ్తాను. చాలా దూరం వచ్చారు మీరు వెళ్ళిపోండి."అని గులేరీ నెమ్మదిగా అన్నది.

''నువ్వుకూడా చాలా దూరం నాతో పాటు నడిచే వచ్చావు. గుర్రంమీద కూర్చోనేలేదు. గుర్రంమీద కూర్చో ?" అని అన్నాడు మానక్ వెనుకటిలాగానే-నెమ్మదిగా !

"ఇదుగో, తీసుకోండి, మీ పిల్లనగ్రోవి ?

''తీసుకెళ్ళరాదూ నీతో !"

''అయితే ఉత్సవాలకు వచ్చినప్పుడు విన్పిస్తారు కదూ ? '' గులేరి నవ్వుతూ అన్నది. ఆమె కళ్ళు సంతోషంతో మెరిశాయి.

మానక్ ఆమె మొహాన్ని చూడలేక మరొకవైపుకు తిప్పుకున్నాడు. అతని నేత్రాలలో నీళ్ళు తిరిగాయి.

గులేరీ పుట్టింటివైపుకు బయలుదేరి వెళ్ళిపోయింది. మానక్ తన స్వగ్రామంవైపు మళ్లాడు.

ఇంటికి వచ్చి రావటంతోనే మానక్ అతి కష్టం మీద మంచంవరకూ వెళ్ళి దభాలున దానిమీద చేరగిలబడుతూ- 'అమ్మా !'అని పిలిచాడు, భారంగా !

"ఏం బాబూ ! చాలా ఆలస్యంచేశావు ! ఇంటిదాకా వెళ్ళి దిగబెట్టి వస్తావేమోననుకున్నా !''అన్నది తల్లి !

''లేదమ్మా ! మధ్యనుంచే తిరిగొచ్చాను.''అన్నాడు, మానక్ బాధగా నూతిలోనుంచి మాట్లాడుతున్నట్టు !

''ఆడవాళ్ళల్లాగా ఏడుస్తావేమిటిరా ? ధైర్యంతెచ్చుకో!"అన్నది తల్లి కోపంగా!

''నువ్వుకూడా ఆడదానివేగా ? ఆడదానివై ఒక్కసారి యేడవరాదూ ?''అని అనాలనిపించింది మానక్‌కు ! కాని అనలేదు.

మానక్‌కు గులేరీ-అన్న మాటలన్నీ గుర్తుకొచ్చాయి. అవును ఈరోజు తనకెవరి మాటలూ విన్పించటంలేదు.

ఏడు సంవత్సరాలు గడిచిపోయాయి-పెళ్ళిజరిగి ! గులేరీ కింతవరకు పిల్లలు కలగలేదు.

''ఎనిమిదో సంవత్సరంకూడా గడిచిపోవటం నా కిష్టంలేదు." అని అంటూ వుండేది తల్లి. ఐదువందల రూపాయలు ముందుగానే కట్నంక్రింద చెల్లించి పిల్లను ఎప్పుడో కుదిర్చింది. ఎప్పుడు గులేరి పుట్టింటికి వెళ్తుందా, ఎప్పుడు కొడుక్కి రెండో పెళ్ళిచేసి కొత్తకోడల్ని తెచ్చుకుందామాఅని పొంచి కూర్చున్నది.

మానక్ మనస్సు మందగించిపోయింది. గులేరీ అతనిపట్ల చూపిన ప్రేమ మాటిమాటికి గుర్తుకొస్తున్నది. ఎంత మరచిపోదామన్నా, గులేరీ మరుపుకు రావటం

లేదు. అయితే కొత్త భార్య కడుపున పుట్టబోయే ఒడ్డ పసిడినవ్వులు గుర్తుకొచ్చినప్పుడు మాత్రం అతని మనస్సు కేదో చక్కిలిగింత పెట్టినట్లయింది అంతే!

ఏడవరోజున మానక్ ఇంటికి కొత్త కోడలు వచ్చింది

మానక్ మేల్కొనే వున్నాడు గాని, అతని హృదయంమాత్రం నిద్రపోతున్నది అతనికి తెలియకుండానే అతని శరీరం అతన్ని నానా ఆటలూ ఆడించింది కొత్త భార్య పుట్టింటికికూడా వెళ్ళివచ్చాడు

ఒకరోజున ఉదయమే పొలంవెళ్ళి గట్టుమీద కూర్చొని చిలుందమ్ము పీలుస్తున్నాడు పక్కనుంచి వెడుతూ అతని బాల్యమిత్రుడు కనిపించాడు!

"ఏమోయ్! భవానీ! ఇంత ఉదయానే ఎక్కడికి బయలుదేరావు?'' మానక్ అడిగాడు

భవానీ నివ్వెరపోయి నిలబడ్డాడు అతని వీపుమీద చిన్న మూట ఒకటి వున్నది!

'ఎక్కడికీలేదు!'అన్నాడు ముక్తసరిగా

''ఇలారా! చిలుం పీలుద్దాం రా!" మానక్ మళ్ళీ పిలిచాడు

భవానీ వచ్చి అతనిచెంత కూర్చున్నాడు చిలుం పీలుస్తూ — ''చంబా వెళ్తున్నా ఇవ్వాళ అక్కడ ఉత్సవాలు జరుగుతాయికదూ!" అని అన్నాడు

ఉత్సవాల సంగతి వినేప్పటికి మానక్ మనస్సును ఎవరో బాకుతో పొడిచినట్లయింది తెలియని బాధ అతన్ని మెలికలు తిప్పి వేసింది

'అవును, ఇవ్వాళ ఉత్సవాలుకదూ?' ఈ మాటలు ఎలాగో మానక్ నోటినుంచి వెలువడ్డాయి

''ప్రతి సంవత్సరమూ ఇప్పుడే గా జరిగేది!'' అన్నాడు భవానీ మానక్ వైపుచూస్తూ! ఏడు సంవత్సరాలక్రితం మనిద్దరం కలిసి ఉత్సవాలకు వెళ్లాం! ఆ సంగతి మరచిపోయావా? ఆ ఉత్సవంలోనేగా గులేరీని నువ్వు ప్రేమించావు!" అన్నట్టున్నాయి అతని చూపులు!

భవానీ ఏమీ అనలేదు కాని మానక్‌కు మాత్రం చాలా సంగతులు విన్నట్టు అనిపించింది అతనికి భవానీమీద కోపం కూడా వచ్చింది

కొద్దిసేపటికి భవానీ లేచి బయలుదేరాడు అతని వీపున వేలాడుతున్న మూటలో పిల్లనగ్రోవికూడా వున్నది భవాని ఉత్సవాలకు వెడుతున్నాడు

మానక్ అతను వెళ్ళిపోతూవుంటే వెనుకనుంచి చూస్తూ నిలబడ్డాడు అతని వీపుమీద వేలాడుతున్న మూటను, ఆ మూటలోనుంచి బయటికి తొంగి చూస్తున్న మురళిని చూస్తూ నిలబడ్డాడు

''భవానీ, భవానీ మురళి ఉత్సవాలకు వెళ్తున్నారు'' మానక్‌కు తన మురళి గుర్తుకొచ్చింది పుట్టింటికి వెళ్తున్న గులేరీతో-తన మురళిని ఆమెకుయిస్తూ- 'దీన్నికూడా నీ వెంటే తీసుకెళ్ళు!''అని చెప్పాడు.

పరుగెత్తి భవానీని కలుసుకొని తనుకూడా ఉత్సవాలకు వెళదామనుకున్నాడు తనకంటే ముందే ఉత్సవాలను చూడడానికి వెళ్ళిన తన మురళికోసం వెళదామనుకున్నాడు

మానక్ చిలుం అవతలపడేసి పరుగెత్తాడు కాని కొంచెందూరం వెళ్ళి ఆగిపోయాడు. అతనికి వణుకు పుట్టింది నేలమీద కూలబడిపోయాడు

మానక్‌కు ఆరోజు పగలూ, రాత్రి కూడా ఉత్సవాలకు వెళ్తున్న భవానీయే కనిపించాడు

ఆ రెండవరోజు మధ్యాహ్నపువేళ మానక్ తనపొలంలో కూర్చొనివున్నాడు ఉత్సవాలనుంచి తిరిగివస్తున్న భవానీ కన్పించాడు

మానక్ అతన్ని తప్పుకోవాలని చూశాడు. భవానీని చూడడంతోనే ఉత్సవాలు గుర్తుకొస్తున్నాయి గతం యావత్తూ గుర్తుకొచ్చి బుసలుకొడుతూ తనను బాధిస్తుంది

అందుకే మానక్ భవానీకి కన్పించకుండా తప్పుకున్నాడు కాని భవానీ అతన్ని వెతుక్కుంటూవచ్చి అతని ఎదుట చతికిలబడ్డాడు బాగా కాలిన బొగ్గుమీద అప్పుడే నీళ్ళుపోస్తే ఎలా వుంటుందో, అలా వున్నది భవానీముఖం.

మానక్‌కు భయంవేసింది. భవానీ వైపు ఏమిటని ప్రశ్నార్థకంగాచూశాడు, మానక్!

'గులేరీ చనిపోయింది!'

'గులేరీ చనిపోయిందా?'

'అవును! నువ్వు మళ్ళా పెళ్ళిచేసుకున్నావని తెలుసుకొని శరీరంమీద కిరసనాయిలు పోసుకొని ఆత్మహత్య చేసుకున్నది'

"కిరసనాయిలా?"

ఆ తరువాత మానక్ మారు మాట్లాడలేదు అతని మౌనంచూచి భవాని భయపడ్డాడు. ఆ తరువాత మానక్ తల్లిదండ్రులు భయపడ్డారు, ఆ పైని అతని రెండవభార్య భయపడింది. మానక్ ఎవరితోనూ మాట్లాడటంలేదు ఎవరినీ గుర్తించడంలేదు కూడాను.

మానక్ భార్య విచారించింది! తలి

(తరువాయి 54వ పేజీలో)

# పబ్లిక్ వర్క్సు శాఖ కార్యకలాపాలు



## కొత్తగూడెం థర్మల్ ప్రాజెక్టు - రెండవదశ

కొత్తగూడెం థర్మల్ కేంద్రం మొదటి దశ పనులు శీఘ్రంగా అమలు జరుగుతున్నాయి. తొలిదశ కార్యక్రమం క్రింద తృతీయ ప్రణాళికాంతంలోగా ఒక్కొక్కటి 60 మె. వా. ల శక్తిగల రెండు సెట్లను నెలకొల్పడానికి ప్రతిపాదించారు. రాష్ట్ర ప్రభుత్వ అభ్యర్థనను పురస్కరించుకొని కేంద్ర ప్రభుత్వం ఇప్పుడు ఈ ప్రదేశంలో రెండవదశ కార్యక్రమం క్రింద 60 మె.వా. ల శక్తిగల మరో రెండు సెట్లను నెల్పకొల్ప డానికి అంగీకరించింది. అవసరమైన సహాయం చేయడానికి ఐ. డి. ఏ. సూత్ర ప్రాయంగా అంగీకరించింది. రెండవ దశ పనుల విషయంలో ముందుగానే చర్యలు తీసుకోబడినవి. ఈ సంవత్సరాంతం లోగానే అవసరమైన పరికరాలకొలకు ఆర్డరు చేస్తారు. రెండవ దశవల్ల కలిగే లాభాలను 4 వ ప్రణాళిక తొలి కాలంలో ఉపయోగం లోకి తీసుకురావడానికి, కొత్తగూడెంలో 1,000 మె. వాట్ల శక్తితో సూపర్ థర్మల్ స్టేషనును స్థాపించాలనే ధ్యేయాన్ని సాధించడంలో దీనిని తొలి ప్రయత్నంగా గుర్తించ డానికి యీ అంచనాలు ఉపయోగపడతాయి.

## దిగువ సీలేరు జలవిద్యుత్ పథకం

ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా ప్రభుత్వాల మధ్య 4-9-1962 తేదీన సీలేరు నదీజలాల పంపిణీ విషయంలో ఒక ఒప్పందం కుదిరింది. ఈ ఒప్పందం మేరకు బలిమేల ఆనకట్ట దిగువ ఆగకుండా ప్రవహించే 2100 క్యూసెక్కుల నీటిని, బలిమేల ఆనకట్ట దిగువ అరగానిలోని మొత్తం నీటిని యీ రాష్ట్రంలోని ప్రాజెక్టుల అభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం ఉపయోగిస్తుంది.

డొంకరాయివద్ద ఒక ఆనకట్ట నిర్మించ డానికి తలపెట్టారు. ఇది గుంటవాడలోని ఎగువ సీలేరు జలవిద్యుత్ ప్రాజెక్టు స్థలానికి దిగువన 25 మైళ్ళ దూరంలో వుంది. ప్రథమ దశలో ఒక్కొక్కటి 100 మె. వా. ల శక్తిగల మూడు హైడల్ సెట్లను నెలకొల్పు తారు. ప్రథమ దశ వ్యయం అంచనా రూ. 25.34 కోట్లు.

ఈ ప్రాజెక్టు ప్రారంభ పనులను త్వరలో చేపట్టడానికి ప్రతిపాదించారు. ★

---

(53వ పేజీ తరువాయి)

దండ్రులు విచారించారు. అయితే అందరికీ ఒకందుకు సంతోషం వేసింది. కొద్ది రోజులలోనే మానక్ భార్య తల్లి కాబో తున్నది. ఒంటరిగావున్న మానక్‌తో తల్లి యీ విషయం చెప్పింది. కాని ఆ విషయం తనకేమీ అర్థంకానట్లు చూశాడు మానక్!

మానక్‌కు అర్థం కాక పోయినా — ఈ విషయం మాత్రం చాలా ప్రధానమైనదే! మానక్ తల్లి తన కొత్త కోడలికి ధైర్యం చెప్పింది. "నీకు బిడ్డ పుట్టినరోజున మానక్ మళ్ళా మామూలు మనిషిగా మారతాడు!' అని దిలాసా యిచ్చింది.

కాని ఆ ఆశకూడా ఫలించలేదు. మానక్ భార్య మూగ బిడ్డను కన్నది. మానక్ తల్లి పిల్లవాడికి స్నానంచేయించి మెత్తని పట్టువస్త్రంలో చుట్టి తీసుకెళ్ళి మానక్ ఒడిలో పడుకోబెట్టింది.

మానక్ ఆ కుర్రవాడివైపు అలాగే కొంచెంసేపు చూచి — "అవతలికి తీసికెళ్ళు! నాకు కిరసనాయిలుకంపు వేస్తున్నది!'అని బిగ్గరగా అరచాడు. ★

# లలనావనం



## * స్త్రీ విద్యాభివృద్ధి *

—ఇల్లిందల సరస్వతీదేవి

స్త్రీ విద్యా ప్రశంస ఎత్తగానే విన్నవారు విచిత్రంగా నవ్వే దశ ఇప్పటికీ మన దేశములో దాటిపోయిందని రూఢిగా చెప్పటానికివీలులేదు.

కాని — మూడు దశాబ్దాల క్రిందటకూడా స్త్రీవిద్య గొప్పవారి సొత్తు. అది సామాన్యులకు అందరాని ఫలము. వెలగల నగలు చేయించుకున్నట్లూ, మిలమిల మెరిసే జలతారు పట్టు పుట్టాలు ధరించినట్లూ కలవారింటి ఆడపడుచులు కొందరు పట్టణాలలో మాత్రమే ఉన్న కళాశాలల్లో ఉన్నత విద్యాభ్యాసము చేసేవారు.

స్త్రీ విద్యావశ్యకతను గురించిన ప్రచారము కందుకూరి వీరేశలింగం పంతులుగారి కాలమునుండి సాగుతూనేఉన్నది "విద్యకూ విజ్ఞానానికీ స్త్రీ పురుష భేదము లేదు. సంసార శకటాన్ని నడుపవలసిన స్త్రీ పురుషులు విధిగా విద్యనేర్వాలి ఒకరు ముందుకూ ఒకరు వెనుకకూ శకటాన్ని లాగితే దాని నడక సక్రమముగా ఉండదు" అన్న విషయాలు సంఘ సంస్కర్తలు ప్రబోధము చేసినవే పరాయి పరిపాలనలో కూడా స్త్రీ విద్యకు అనువైన పాఠశాలలూ, కళాశాలలూ విరివిగా లేకపోయినా అక్కడొక్కటీ ఇక్కడొక్కటీ లేకపోలేదు ఆయినా మగబిడ్డలతోపాటు ఆడబిడ్డలకువిద్యచెప్పించగల ఆర్థికస్తోమత కలవారయినా అందరూ చెప్పించలేకపోయినారు.

ఆ నాడు సంఘములో స్త్రీ విద్యను గురించిన దురభిప్రాయాలు తరతరాలుగా నరనరాలలో జీర్ణించి ఉండేవి. "సంసారము దిద్దుకుంటూ బిడ్డలను పెంచటమే స్త్రీల ధర్మము ఆ ధర్మము నిర్వహించటానికి స్త్రీలకు విద్య ఎందుకు ? అమ్మమ్మ చదివిందా ? పోనీ నాయనమ్మ చదివిందా ? అక్షర జ్ఞానము లేని వాళ్ళు బిడ్డలను పెంచారు. సంసారాలు నిర్వహించారు పదిమందిలో మంచిపేరు తెచ్చుకున్నారు మరి ఈ చదువులు దేనికి ? ఉద్యోగాలు చేయనా, ఊళ్లేలనా ?" ఈ ధోరణిలో ఆనాటి భావపరంపర సాగిపోయేది. ఈధోరణిని ఎదిరించి చదువుకున్న అమ్మాయిలను బూచినిచూచినట్టు చేసేవారు. "చదువుకున్న అమ్మాయిలు కాపరాలు చేస్తారా ? బిడ్డలను పెంచుతారా ? సంసారాలను నిర్వహిస్తారా ?" ఇలాంటి ప్రశ్న పరంపర సంఘవ్యాప్తమయిపోయేది.

కాని దేశములో అంతకు పూర్వము ఉన్న సమిష్టి కుటుంబాలు విడిపోతూ వచ్చాయి ఆర్థిక సంపద చితికిపోయింది అజ్ఞానమువల్ల కుటుంబాలకు కుటుంబాలు క్రుంగిపోయాయి తల్లుల అవిద్య, అజ్ఞానాలవల్ల శిశుమరణాలసంఖ్యపెరుగుతూవచ్చింది స్త్రీలు ఎంత తెలివికలవారయినా ఒకరి మీద ఆధారపడి ఉండవలసినవారే అయినారు. ఎంతటి దీనదశలో ఉన్నా, వారు గౌరవంగా నాలుగు డబ్బులు సంపాదించి కుటుంబ సహాయానికి గాని తమను తాము పోషించుకోవటానికిగానిమార్గములేదు. వితంతువులు, భర్తృపరిత్యక్తలు పుట్టింట చాకిరిచేస్తూ అష్టకష్టాలు పడుతూ జీవచ్ఛవాలవలె బ్రతుకుతూ ఉండేవారు బాధలు భరించలేని వారు ఆత్మహత్యలకు పూనుకునేవారు.

నాయకులూ, సంస్కర్తలూ విరివిగా చేసిన ప్రచారమువల్లనయితేనేమి, క్రమంగా స్త్రీ విద్యకు తగిన వసతులు ఏర్పడినందువల్లనయితేనేమి, స్త్రీ విద్యవల్ల ప్రత్యక్షంగా కనబడిన లాభాలవల్ల నయితేనేమి, సంఘములో స్త్రీ విద్య అంటే కొంతవరకూభయం తగ్గింది. "అవసరమేకాదు– స్త్రీ విద్య అతి ముఖ్యము" అని ప్రజానీకముతెలుసుకున్నది. "మగపిల్లవాడితోపాటు ఆడపిల్లనుకూడా చదివించ వలసినదే" నని అందరూ గ్రహించుకున్నారు. ఈ విషయములో అభిప్రాయ భేదము క్రమంగా తగ్గిపోయింది.

కాని స్వతంత్ర భారతములో గ్రామాలలో ప్రాథమిక మాధ్యమిక పాఠశాలలూ, తాలూకాలలో హైయ్యర్ సెకండరీ పాఠశాలలూ, జిల్లాలలో కళాశాలలూ, అక్కడక్కడ స్త్రీలకు ప్రత్యేక కళాశాలలూ వెలసిన ఈ రోజులలో విద్యావతుల సంఖ్య ఎంత పెరిగింది ? పదిహేడవ స్వాతంత్ర్య దినోత్సవము జరుపుకున్న నవభారతములో ఈనాడు నూటికి అయిదుగురు కూడా విద్యావతులు లేరని లెక్కలవల్ల తేలింది. ఇది దేశాన్నిపట్టి పీడిస్తున్న సమస్యలలో ఒకటి. మనదేశంలో విద్యావతుల సంఖ్యను వృద్ధి

చేయటానికి మార్గాలు ఏవి? అభివృద్ధికాక పోవటానికి కారణాలు ఏవి? ఆ అవరోధాలను తొలగించట మెట్లా?

మనది సంక్షేమ రాజ్యము. (Welfare State) ప్రజలందరికీ సమాన హక్కులు—సమానావకాశాలు కల్పింపబడతాయని మన రాజ్యాంగచట్టము హామీ యిస్తున్నది. ఒకటి కాదు — పది అడుగులు ముందుకు నడచిన పురుషునితో సమానముగా స్త్రీనినడిపించాలి. ఇందుకు తగిన మార్గాలు అన్వేషింపబడాలి.

ఈ ఉద్దేశ్యముతో అఖిలభారత స్థాయిన ఒక కమిటీ 1958 మే నెలలో ఏర్పడ్డది. దీనికి అప్పుడు కేంద్ర సంఘ సంక్షేమ సంఘాధ్యక్షురాలయిన శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ అధ్యక్షురాలుగాను, మరిఏడుగురు సభ్యులుగానూ నియమింపబడ్డారు.

1 ప్రాథమిక, మాధ్యమిక స్థాయిలలో స్త్రీ విద్యాభివృద్ధికి తగిన మార్గాలు ఏవి?

2. విద్యాభివృద్ధి చేసుకొని స్వతంత్ర జీవనము చేయదలచిన వయోజనులకు అవకాశాలను కల్పించే మార్గాలు ఏవి?

3 సంఘ శ్రేయస్సుకొరకు పాటుబడే సంస్థలు ప్రభుత్వ సహకారముతో ఈ కార్య భారము నిర్వహించగలవా?

4 విద్యలో ఒకభాగముగా చేతిపనులలో శిక్షణ యిచ్చినట్లయితే వయోజనులకు ఉపయుక్తంగా ఉంటుందా?

పై అంశాలను పరిశీలించి రిపోర్టు తయారు చేయవలసిందిగా ఆ కమిటీ ఆదేశింపబడ్డది

ఈ కమిటీ 30 మే 1958 లో అప్పుడు ఉపాధ్యక్షులుగాఉన్న యస్ రాధాకృష్ణపండితులచే ప్రారంభము కావించబడ్డది ఆ సందర్భంలో వారు "అన్ని వృత్తులలో గృహిణీత్వమే స్త్రీకి గొప్పదిగా భావించబడ్డది. ఈ భావము ఎప్పటికీ ఇలాగేఉంటుంది—ఉండాలి కూడా. కాని—అంతమాత్రంచేత ఇతరరంగాలలో ఆమె అభివృద్ధి సంకుచితము కారాదు" అంటూ "నిర్మాణయుతమైన మార్గాలను కనిపెట్టి, తలపెట్టిన కార్యాన్ని సాధించండి" అని కమిటీని ప్రబోధించారు

నిర్ణీతకాలములోఅధ్యక్షురాలు స్వయంగా రాష్ట్రప్రభుత్వాలను సందర్శించి, వారితో స్త్రీ విద్యను గురించి చర్చించి పరిస్థితులను పరిశీలనచేయటము జరిగింది రాష్ట్ర ముఖ్య మంత్రులనూ,విద్యామంత్రులనూ, విద్యాశాఖ కార్యదర్శులనూ, డైరెక్టర్లనూ, ఉన్నతోద్యోగులను సందర్శించి ఆమె చర్చించారు. స్త్రీ విద్యాభిమానులయిన సంఘ సంస్కర్తలనూ, స్త్రీజనసంక్షేమ సంఘాలనూ సందర్శించారు. సభ్యులు తమకు కేటాయించిన ప్రాంతాలకు వెళ్ళి స్త్రీ విద్యా సమస్యలను క్షుణ్ణంగా పరిశీలించారు. తలిదండ్రులనూ ఉపాధ్యాయులనూ విడివిడిగా కలిసికొని చర్చించారు. అనేక సంస్థలను దర్శించారు స్త్రీ విద్యకు సంబంధించిన కేంద్ర సంస్థలనూ రాష్ట్ర సంస్థలనూ దర్శించి వాటి రిపోర్టులను సేకరించారు. వీరు దేశమంతాతిరిగి సేకరించిన సమాచారాన్నిబట్టి స్త్రీ విద్యాభివృద్ధికి కొన్ని సూచనలు చేయగలిగారు. ఆ సూచనలను పంచవర్ష ప్రణాళికలుగా విభజించారు.

స్త్రీ విద్యకు ప్రత్యేక ప్రణాళికలూ, ప్రత్యేక వసతులూ అవసరము. దేశములో పురుషుల విద్యా సౌకర్యాలకంటె స్త్రీ విద్యకు పరిస్థితులను అనుసరించి ప్రత్యేక వసతులు కల్పించబడాలి. స్త్రీ జీవితము పురుషుడి జీవితము వంటిదికాదు. జీవితములో ఆమె పాత్ర వేరు. గృహిణిగా, మాతగా ఆమెకు ఎనలేని బాధ్యతలు ఉన్నాయి. ఆమె తన బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించటానికి కొంత విద్య కావాలి. ఇంతేకాకుండా సంఘసేవ చేయటము, రోగులకు ఉపచరించటము, మంత్రసాని పనిచేయటము, చిన్నబిడ్డలకు బోధించటము, చిన్నచిన్న చేతిపనులు చేయటము మొదలయినవికూడా గృహిణికికావలసినవే. వీటన్నిటిలో శిక్షణ పొందటానికి ఆమెకు కొంతవరకూ విద్య అవసరము.

స్త్రీ విద్యా కార్యక్రమాలను నిర్ణయించేటప్పుడు వయసునుబట్టి గ్రూపులను చేయటము జరిగింది. 5 నుండి 11 సంవత్సరాల వరకూ ఒక గ్రూపు, 11 నుండి 16 సంవత్సరాల వరకూ ఒక గ్రూపు; 16 సంవత్సరాలు దాటిన స్త్రీలు వివాహితలుగాని, అవివాహితలుగానీ కుటుంబ బాధ్యతలు నిర్వహించుకుంటూ జీవనాధారాన్ని సంపాదించుకునే వారు ఒక గ్రూపుగా నిర్ణయింపబడ్డది. ఈ ప్రణాళికలన్నీ, అవసరము వచ్చినప్పుడు స్త్రీ స్వతంత్ర జీవనము చేయటానికి ఉపకరించేవిగానూ, సామాన్య పరిస్థితులలో ఆమె తన ధర్మాలను నిర్వర్తించటములో సహకరించేవిగానూ ఉండవలెనని తీర్మానించారు

జాతీయ స్త్రీ విద్యా పరిషత్తు నిర్మాణమయినప్పుడు అధ్యక్షురాలిగా శ్రీమతి రక్షాశరణ్ నియమింపబడినారు రాష్ట్రస్థాయిలో కూడా స్త్రీ విద్యా సంఘాలు నియమింపబడ్డాయి. ఆంధ్రప్రదేశ్‌లో 1961 సెప్టెంబరులో శ్రీమతి అమ్మన్నరాజా అధ్యక్షురాలిగా, ఏడుగురు అధికార సభ్యులూ, తొమ్మిది మంది అనధికార సభ్యులతో ఒక కమిటీ నిర్మాణమయింది. దీని పక్షాన రాష్ట్రములోని విద్యాశాఖాధికారుల సెమినారు ఒకటి నిర్వహింపబడ్డది. ఈ సెమినారులో 23 అంశాలు ప్రభుత్వ దృష్టికి తీసుకొని రాబడినవి వాటిలో ముఖ్యమైన అంశము ప్రాథమిక పాఠశాలలలో సాధ్యమైనంతవరకూ స్త్రీలనే ఉపాధ్యాయినులుగా నియమించబడవలెనన్నది మాధ్యమిక ఉన్నత పాఠశాలలు సాధ్యమైనంతవరకూ బాలికలకొరకు ప్రత్యేకముగా నెలకొల్పబడవలెనన్నది రెండవది ఒకవేళ ప్రత్యేక పాఠశాలలు నెలకొల్పటానికి వీలు కాని పక్షములో ఉపాధ్యాయినులను కొందరినయినా విధిగా ఆ పాఠశాలలలో నియమించాలన్నది మరొకటి బాలికలకు ప్రత్యేక పాఠశాలలకు అనుబంధంగా వసతి గృహాలు ఉండాలి. ఈ వసతి గృహాలకు అనుభవజ్ఞులయిన స్త్రీలను (రిటైరయిన ఉపాధ్యాయినులైనా సరే) వార్డెనులుగా నియమించాలన్నదికూడా సూచనలలో చేర్చబడ్డది

కాని ప్రత్యేక పాఠశాలలూ, వసతి గృహాలూ సౌకర్యాలూ కల్పించినంత

(తరువాయి 57వ పేజీలో)



అనంతపూర్ జిల్లాలోని లేపాక్షి దేవాలయంలో ఒక చిత్రం. (చూ. వ్యాసం 38_పేజీ)



చెంచులు.



ఆగస్టు 28వ తేదీన కర్నూలు జిల్లాలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ప్రారంభోత్సవంచేసిన హంద్రీనది వంతెన.

# జాతీయ బహుమతులు పొందిన ఉపాధ్యాయులు



శ్రీ ఎమ్. శ్రీనివాసరావు, శ్రీకాకుళంజిల్లా నరసన్నపేట జిల్లా పరిషదున్నత సెకండరీ పాఠశాల ప్రధానోపాధ్యాయులు.



శ్రీ తాడికొండ సుబ్బారావు, పశ్చిమ గోదావరి ఉండిలోని ఎస్. వి. స్పెషల్ పి. ఎస్. హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాల ప్రధానోపాధ్యాయులు.



శ్రీ వి. వెంకటశాస్త్రి, కర్నూలు జిల్లా జిల్లెలలో సమితి ఎలిమెంటరీ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు.

---

దేశానికి చేసిన అశేషమైన సేవలకు ప్రతిఫలంగా ఆంధ్ర ప్రదేశ్‌కు చెందిన యీ ఆరుగురు ఉపాధ్యాయులకు, భారత ప్రభుత్వం జాతీయ బహుమతులను యిచ్చి గౌరవించింది.

---



శ్రీ మేడిసెట్టి లక్ష్మణస్వామి, కాకినాడ తాలూకా కరపలోని సమితి జూనియర్ బేసిక్ పాఠశాల ఉపాధ్యాయులు.



శ్రీ శేషం రామస్వామి, కరీంనగర్ ప్రభుత్వ మాధ్యమిక పాఠశాల సహాయ ఉపాధ్యాయులు.



శ్రీ ఆర్. టి రంగారెడ్డి, చిత్తూరు జిల్లా పాకాలలోని జిల్లా పరిషదున్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు.



మద్రాసు గవర్నరు శ్రీ విష్ణురాం మెఢీ 18_8_1963 వ తేదీన హైదరాబాదు మక్కా మసీదును దర్శించినప్పటి దృశ్యం.

# నెల తక్కువ పిల్లలు - వారి పెంపకం

—డాక్టర్ వేమిరెడ్డి రాజేశ్వరమ్మ

గర్భవతులైనతరువాత నవమాసాలు నిండకుండా ప్రసవించగా పుట్టిన పిల్లలను నెల తక్కువ పిల్లలంటారు. లెక్కకు నెలలు నిండినా తగినంత బరువు లేకుండా తక్కువ బరువున్న పిల్లలను కూడా నెలలు తక్కువ పిల్లలు అని అనడం కద్దు. $5\frac{1}{2}$పౌనులు అంతకంటె తక్కువ బరువుండే యిటువంటి పిల్లల పెంపకంలో చాలా జాగ్రత్త వహించాలి వీరి ఆరోగ్య, భద్రతా విషయంలో మరీ జాగ్రత్తగా ఉండాలి బరువులో ఎక్కువ ఉన్న పిల్లలకంటె ఇటువంటి పిల్లలకే ఎక్కువ ఆహారం కావాలి ఇటువంటి పిల్లలకు పాలు త్రాగించడంకూడా కష్టం. ఎక్కువ పాలు ఇమిడేంతగా పొట్టలు ఉండవు. పైగా జీర్ణశక్తి సులభంగా దెబ్బతినేట్టుగా ఉంటుంది పూర్తినెలల బిడ్డలకు పౌనుకు $2\frac{1}{2}$ఔన్సుల లెక్కన పాలుపడితే నెల తక్కువ బిడ్డలకు 3 ఔన్సులు లేదా $3\frac{1}{2}$ ఔన్సులు పట్టవలసి ఉంటుంది ఈ పిల్లలకు విటమిన్ 'సి' చాలా అవసరం. అందువల్ల ఒకనెల జరగ్గానే 25 మిల్లీగ్రాములు ఒక్కసారి పాలలో కలిపి ఉంటుంది. దీనితోపాటు విటమిన్ 'డి' కూడా ఇవ్వడం మంచిది. ఈ పిల్లలకు శరీరంలో ఇనుప పదార్థంకూడా లోపించి ఉంటుంది కాబట్టి ఆ పదార్థాన్ని డాక్టరు సలహాతో మందులరూపంలో ఇవ్వడంఅవసరం.

ఇటువంటి పిల్లలకు తొలి రోజులలో పాలు ఎక్కువ ఇవ్వకుండా మరీ తక్కువ కాకుండా అతి జాగ్రత్తతో యివ్వవలసి ఉంటుంది. ఏ మాత్రం తేడావచ్చినా యీ పిల్లలకు విరోచనాలు పట్టుకుంటే వాటినుండి తేర్కొనడానికి కొంతకాలం పట్టవచ్చు. ఈ జాగ్రత్త ఇటువంటి పిల్లలు $5\frac{1}{2}$ పౌ॥ బరువు వచ్చేంత వరకూ వహించాలి ఆ తరువాత మామూలు పిల్లల్ని పెంచినట్టే పెంచవచ్చు. మరీ చిన్నపిల్లలకు ట్యూబు పొట్టలోనికి పోనిచ్చి పాలు త్రాగించవలసి వస్తుంది. బిడ్డ మింగ గలిగిన స్థితిలోవుంటే కొన్నిసార్లు 'పిప్పెట్టు'తో త్రాగించవచ్చు ఈ పిల్లలను మంచంలోనే ఉంచి వెచ్చగాఉండేట్లు చూచిపాలుత్రాగించాలి తలక్రింద ఉయ్యాలలో కొద్దిగా ఎత్తుపెట్టి త్రాగించితే పాలు సులభంగా లోపలికి వెడతాయి ఇటువంటిపిల్లల పొట్టలు చాలా చిన్నవిగా ఉంటాయి. కాబట్టి ఎక్కువ పాలు త్రాగనూలేరు, ఒక వేళ త్రాగినా ఇముడ్చుకోనూ లేరు. అందువల్ల ఎక్కువగా త్రాగిస్తే ఒక్కొక్కసారి వూదాగామారి వుక్కిరి బిక్కిరి అవుతారు, లేదా వాంతి చేసుకుంటారు అందువల్ల ఎక్కువగానూ కాకుండా, తక్కువగానూ కాకుండా జాగ్రత్తగా పాలు పడుతూ అవసరాన్నిబట్టి తక్కువ తక్కువగా ఎక్కువ సార్లు ఇవ్వవచ్చును. పుట్టిన తరువాత రెండు మూడు రోజులు ఆహారం యివ్వకపోయినా పరవాలేదు. $3\frac{1}{2}$ పౌ॥ కన్నా తక్కువవున్న పిల్లలకు రెండు గంటల కొకసారి చొప్పున రోజుకు 12 సార్లుగా పాలు యివ్వాలి. $3\frac{1}{2}$-$4\frac{1}{2}$ పౌ॥ పిల్లలకు పగలు రెండు గంటల కొకసారి వంతున, రాత్రి 3 గంటల కొకసారి వంతునా పాలు యివ్వాలి. $4\frac{1}{2}$పౌ॥ దాటిన పిల్లలకు రాత్రిపగలు కూడా 3 గంటల కొకసారి పాలివ్వాలి. ఇటువంటి పిల్లల్లో చాలామంది తల్లిపాలను స్వయముగా త్రాగలేరు అందువల్ల పిండి పోయవలసిఉంటుంది. $3\frac{1}{2}$ పౌ॥ కన్నా తక్కువబరువు పిల్లలకు సగం తల్లిపాలు, సగం గ్లూకోజు మొదటి వారంలోనూ; తరువాత మూడుపాళ్ళ తల్లిపాలు, ఒకపాలు గ్లూకోజు యివ్వడం మంచిది. $3\frac{1}{2}$, $4\frac{1}{2}$ పౌ॥ మధ్య వుండే పిల్లలకు 3 పాళ్ళ తల్లిపాలు, 1 వంతు గ్లూకోజు మొదటి వారంలోనూ, ఆ తరువాత పూర్తిగా తల్లిపాలు ఇవ్వవచ్చును. $4\frac{1}{2}$పౌ॥ దాటిన బరువు ఉన్నట్లయితే పాలు పల్చన చేయాల్సిల అవసరం ఉండదు. మామూలుగానే పట్టవచ్చును. ★

---

(56వ పేజీ తరువాయి)

మాత్రాన స్త్రీవిద్య ఆశించినంతగా అభివృద్ధి చెందజాలదు స్త్రీ విద్యావశ్యకత ఎంతబాగా గ్రహించిన వారికయినా — బాల బాలికలను సమాన దృష్టితో చూసే వారికయినా ఆడ పిల్లలకు ఉన్నతవిద్య చెప్పించవలెనంటే వెనుకడుగే పడుతున్నది మగపిల్లవాడు పై చదువులు చదివి, ఉద్యోగము చేసి తమను పోషిస్తాడన్న తల్లిదండ్రుల ఆశ దీనికి కారణంగా కనబడుతుంది. రెండవది ఆడపిల్లకు ఎంతవిద్య చెప్పించినా వివాహము చేసుకొని అత్తవారింటికి వెళ్ళిపోతుందన్నది. మూడవది ఆడపిల్లకు ఎంతవిద్య గరపినా కట్న కానుకలు లేనిదే వివాహము కావటము దుస్తరమన్నది

సంఘములో జీర్ణించిపోయిన కొన్ని విశ్వాసాలూ, దురాచారాలూ ఒక్కనాటితో నశించవు. విజ్ఞానమూ సంస్కారమూ ప్రబలమయి ప్రచారము పొందితేగాని సంఘములో ఆశించిన మార్పు కలుగదు దీనికి కొంత కాలము పట్టవచ్చు.

ఒక్క స్త్రీ విద్యావతి అయినట్లయితే ఒక కుటుంబానికంతా విద్యనేర్పిన ఫలితము కనబడుతుంది ఇది అందరికీ తెలిసిన పాత మాటే. అయినా జ్ఞప్తికి తెచ్చుకొని తక్షణ కర్తవ్యంగా స్త్రీలే ముందడుగువేసి ఆచరణలో పెట్టతగినది. ✲

# చింతలూ - అశోకాలూ

"సత్యశ్రీ"

ఏడవకే, ఏడవకే, ఇక నా చెల్లీ;
చూడు వెలుగునదె మచ్చతోడి జాబిల్లి!
పసివాడి నశించిన నిన్నటి లిల్లీ,
హసియించునులే రేపే నీకై మల్లీ!!

ఎందుకేడ్పు నా చిట్టి తమ్ముడూ నువ్వు?
కుందనేల? ఆనందంతో ఇక నవ్వు,
ముళ్లులేని కాశ్మీర గులాబీ పువ్వు,
ముడుచు తల్లి తన తలలో, లేదికదవ్వు!

వలదు నిరాశెల్లపుడూ నిలువదు ఎగ్గు;
కలదు శిధిల శిశిరాన వసంతపు మొగ్గు!
వెలుగు నడిరేయి యెదలో వేకువ నిగ్గు!!
మెలగు కన్నె మొన కడుపున వెన్నుకి ఉగ్గు!!

ఏలవంత? మీరెరుగర? నిజమీ వింత -
కొలుచు సరిసమము సిరులను అణువుల ముంత
కొలచి కురియు సరివరసము లీ వసుధంత!!
నిలువ దీపైని చింత అశోకం చెంత!!!

పడిలేచిన మానవుడే పొందును గెలుపు!
పడి పూచిన మాలతియూ చిందును వలపు!!
విడివడెనదె, మరో ప్రపంచపు తలుపు!!!
పడలేదా వీనుల రమ్మను పిలుపు?!

సునో భాయి! విశ్వంలో సుస్వర "సర్గమ్"!
కను చెల్లీ! కరతలమున కోరిన స్వర్గమ్!!
ఏకమైరి మానవు లొకటే ఒక వర్గమ్!!!
లోకంలో శోకం యింక విసర్గమ్!!!!

---

(60వ పేజీ తరువాయి)

ప్రవేశపెడుతోంది చాలాచోట్ల యీ పథకం దిగ్విజయంగా అమలు జరుగుతున్నది

ఆయా గ్రామాల్లోను, పట్టణాల్లోను వుండే బాలబాలికలందరూ నిర్బంధంగా విద్యను అభ్యసించటమే యీ పథకంయొక్క లక్ష్యం వయస్సును బట్టి, బాలబాలికలందరనూ, కొన్ని విభాగాలుగా విభజించారు ఆయా 'గ్రూపు'ల్లోవుండే బాలబాలికలందరూ విధిగా విద్య నభ్యసించాలి. ప్రతిరోజూ పాఠశాల తరపున ఎవరోఒకరు ఇళ్ళకువచ్చి పిల్లలను తీసుక వెడుతుంటారు ఇందుకు ఎలాంటి జీతమూ వసూలు చేయరు.

నేటిబాలలే రేపటిపౌరులు. అంటే మన దేశంయొక్క భవితవ్యం నేటిబాలల మీదనే సంపూర్ణంగా ఆధారపడి వున్నది. ఈనాటి బాలలు బాగా చదువుకొని, విద్యారంగంలో నిపుణులైతే, ముమ్ముందు వీరంతా బాధ్యతాయుతమైన పౌరులుగా తయారవుతూనే, దేశానికి ఎంతో సేవచేయవచ్చును. ఎలాంటి విద్యను అభ్యసించినా, అది వృధాకాదు. ఏదోరంగంలో విద్యావంతుల ప్రతిభను విని యోగించ వచ్చును.

ఈనాడు దేశం ఆత్యయిక పరిస్థితిని ఎదుర్కొంటున్నది చైనావారు మన భూభాగాన్ని కాజేయాలన్న దుష్టబుద్ధితో, సంవత్సరం క్రితం దురాక్రమణజరిపారు. మనప్రభుత్వం కూడా కట్టుదిట్టంగా ఏర్పాట్లు చేస్తున్నది. ఆత్యయిక స్థితిలో సమరభూమిలో ఎలాంటి ప్రధానమైన పాత్ర నిర్వహింప బడుతుందో, దేశమంతటాకూడా అదే పాత్రను నిర్వహించవలసి వుంటుంది. అన్నిరంగాలలో నిపుణులుముందుకు వచ్చి ప్రభుత్వానికి సాయపడాలి. అదే విధంగా విద్యారంగంలోకూడా అగ్రగణ్యులైనవారు, యీ స్థితిలో, దేశానికి అండగా నిలుస్తున్నారు వీరంతా చిన్నతనంలో చదువుకోకుండా వున్నట్లయితే యీనాడు స్వాతంత్ర్య రక్షణ నిమిత్తం దేశానికి సేవచేయ గలిగేవారా?

భారతదేశంయొక్క అభివృద్ధి అందరి మీదా ఆధారపడి వున్నది. అన్నిరంగాలలో జరగవలసిన అభివృద్ధికి నిపుణుల ఆవశ్యకత ఎంతైనా వున్నది ఈనాడు చక్కగా విద్య నభ్యసించి, ఆయారంగాలలో ప్రావీణ్యం సంపాదించినవారు రేపటిరోజున దేశం యొక్క అభివృద్ధి కార్యక్రమాలను దిగ్విజయంగా నిర్వహించవచ్చును.

అందువల్లనే ప్రతిబాలుడూ, ప్రతిబాలికా చదువుకోవలసిన అవసరం ఎంతైనా వున్నది వారివిద్య దేశానికి ఎంత ఉపకరిస్తుందో, అంతకుమించిన రీతిగా వారి 'వ్యక్తిత్వాన్ని' పెంపొందించటానికి కూడా సాయ పడుతుంది

# నిరక్షరాస్యతా నిర్మూలన

వాసిరాజు ప్రకాశం

తమ్ముళ్ళూ! చెల్లాయిలూ!

ఏ దేశస్థులయినా, ఏ కులస్థులయినా బాలలందరికీ ఒకటేకర్తవ్యం — శ్రద్ధగా చదువుకొని, తాను చదువుకొన్న బడికీ, తన తల్లిదండ్రులకీ, తన దేశానికీ మంచిపేరు తీసుకురావటం —

ఎక్కడో ఒక రిద్దరు మినహాయిస్తే, బాలలకు సాధారణంగా బాధ్యతలు, బరువులు ఏమీవుండవు ముఖ్యంగా పదిహేను, పదహారు సంవత్సరాలు వచ్చేవరకూ ఎలాంటి చీకూ, చింతా లేకుండా నిశ్చింతగా గడపవచ్చును. ఇండ్లల్లో నిర్వహించవలసిన 'రాచకార్యాలు' ఎమీవుండవు. అంత చిన్నతనంలోనే, వుద్యోగంచేసో, కాయకష్టంచేసో డబ్బు సంపాదించుకొనిరమ్మని ఏ తల్లీ తండ్రీ తమ పిల్లలను బలవంత పెట్టరు.

పేదవారయినా, ధనవంతులయినా తలిదండ్రులు, పిల్లలవద్దనుంచి కోరేది ఒక్కటే — బుద్ధిగా చదువుకోమని. ప్రతి నెలా రూపాయిలు, రూపాయిలు జీతాలు కట్టేది అందుకే. అడిగీ, అడక్కమునుపే పుస్తకాలు కొనిచ్చేది, మంచిమంచి ఖరీదైన బట్టలు కొనిచ్చేదికూడా చక్కగా చదువుకొంటారనే.

ప్రతి తల్లీ, తండ్రీ — తమ పిల్లవాడు పెద్ద పెద్ద చదువులు చదవాలనీ, బుద్ధిమంతుడు కావాలనీ, వుద్యోగం చేయాలనీ, ఫలానా వారబ్బాయి 'చాలా మంచివాడని' నలుగురూ అనుకోవాలనీ, ఆశించటంలో తప్పేమున్నది?

ఏ దేశంయొక్క అభివృద్ధియైనా, ఆ దేశంలోని విద్యావంతులమీద చాలావరకు ఆధారపడి వుంటుంది ఉన్నత విద్యల నభ్యసించిన వారికీ, ఆయా రంగాలలో నైపుణ్యం లభించటమే కాకుండా, ప్రాపంచిక జ్ఞానం (Worldly knowledge) బాగా పెరుగుతుంది ఉచితమేమిటో, అనుచితమేమిటో సులభంగా తెలుసుకొనగలుగుతారు. ఏంచేస్తే దేశానికి ప్రయోజనం వుంటుందో విద్యావంతులకే బాగా తెలుస్తుంది.

ఈనాడు భారతదేశం అన్నిరంగాలలో ముందంజ వేస్తున్నది. విజ్ఞానరంగం ప్రతిరోజూ కొత్తదనాన్ని సంతరించుకొంటున్నది మన శాస్త్రవేత్తలు, రాత్రింబవళ్ళూ, ప్రయోగశాలల్లో కూర్చొని, పరిశోధనలుచేసి ఎన్నో క్రొత్త క్రొత్త విషయాలను వెలుగులోకి తీసుకువస్తున్నారు.

అదేవిధంగా అన్ని రంగాలలోను అభివృద్ధిని సాధిస్తున్నాం. గ్రామసీమల పునరుద్ధరణకు వేరొకవైపున కృషి జరుగుతున్నది. దేశాన్ని సస్యశ్యామలంగా చేయగల ప్రాజెక్టుల నిర్మాణం శరవేగంతో సాగిపోతున్నది.

ఈ అభివృద్ధి సాధిస్తున్నది విద్యావంతులే. వారంతా చిన్నతనంలో శ్రద్ధగా చదువుకొని, విశేషమైన విజ్ఞానాన్ని సంపాదించారు కనుకనే, యీనాడు యీ విధంగా దేశానికి సేవచేయ గలుగుతున్నారు.

వాస్తవం చెప్పుకోవాలంటే, యీ రోజున మనకు ఎన్ని సౌకర్యాలు, వసతులు వున్నాయో, అవన్నీ మన తాత ముత్తాతల తరంవారికి లేవు. మనకు, స్వాతంత్ర్యం వచ్చిన పదహారు సంవత్సరాలలో ఎన్నెన్నో అభివృద్ధికరమైన మార్పులు వచ్చాయి. పాతరోజుల్లో, హైస్కూలులో చదువుకోవాలంటే — వున్నవూరు విడచి, ఎన్నో ఆమళ్ళ దూరం వెళ్ళవలసి వస్తుండేది. అలా వెళ్ళటానికి కూడా, సౌకర్యాలు వుండేవి కావు ఒకచేత్తో పుస్తకాలు, మరోచేత్తో మధ్యాహ్నపు భోజనం పుచ్చుకొని కాలికి బుద్ధిచెప్పడమే....: కాని ఈ రోజునో! లెక్కకుమించినన్ని సౌకర్యాలు వున్నాయి. గడపదిగితే బోలెడన్ని ఆధునిక వాహనాలు, ఊళ్ళోనే స్కూలు

అందువల్ల, యీనాడు చదువుకోవాలంటే పూర్వీకులు పడినన్ని కష్టాలు పడవలసిన అవసరంలేదు. చేయవలసిందల్లా ఒక్కటే — "చదువంటే శ్రద్ధ వహించటం." శ్రద్ధవుంటే దానంతటఅదే వస్తుంది చదువు

ఈ సందర్భంలో, మన రాష్ట్రంలో విద్యావంతుల పరిస్థితిని గురించి తెలిసికొందాం. దేశమంతటా నిరక్షరాస్యతను నిర్మూలించేందుకు భారీఎత్తున కృషి జరుగుతున్నది. మన రాష్ట్రానికి సంబం

## బాలానందం

ధించినంతవరకు, ఆ మధ్య జరిగిన జనాభా లెక్కల ప్రకారం, 21.19 శాతం మాత్రమే విద్యావంతులున్నారు. అంటే పరోక్షంగా చెప్పాలంటే, 78.81 శాతం చదువురానివారున్నారు. విద్యావంతులయిన వారిలో 16 85 శాతం గ్రామాలలోను, 41.78 శాతం పట్టణాలలోను వుంటున్నారు అంటే మొత్తంమీద మన రాష్ట్రం వెనుకబడివున్నదని చెప్పక తప్పదు. విశేషం ఏమంటే, కొన్ని దశాబ్దాల క్రితం–అంటే తెల్లదొరలు–మన దేశాన్ని పరిపాలిస్తుండే రోజుల్లో ఇక్కడ విద్యావంతులయినవారు నూటికి, కోటికి ఒకరుండేవారు. మనకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత పరిస్థితి బాగా మెరుగు పడింది ఎలాంటి పల్లెటూరిలోనయినా 'ఒకబడి' వుంటూనేవున్నది.

దేశంలో నిరక్షరాస్యతను నిర్మూలించి, ప్రతిఇంటా సరస్వతీ మాతను ప్రతిష్ఠింపచేయటానికి మన కేంద్రప్రభుత్వమూ, రాష్ట్ర ప్రభుత్వమూ– రెండూ–కృషిచేస్తున్నాయి. ప్రతి ఏటా బడ్జెటులో ఎన్నో విద్యాకార్యక్రమాలను రూపొందిస్తున్నారు. గ్రామాల్లో, అడిగినచోటల్లా, కాదనకుండా పాఠశాలలను నెలకొల్పుతున్నారు. వెనుకబడిన వర్గాల పిల్లలకు అదనంగా స్కాలర్‌షిప్పులను మంజూరు చేస్తున్నారు. తతిమ్మావారికికూడా చాలారకాల స్కాలర్ షిప్పులను ఇచ్చి, విద్యార్థులను ప్రోత్సహిస్తున్నారు. కళాశాలల్లోను విశ్వవిద్యాలయాల్లోను అదనంగా ప్రతి ఏడూ సీట్లను కేటాయించి, అధిక సంఖ్యాకులకు విద్యావకాశాలుకల్పిస్తున్నారు.

దేశంలో అమలు జరగవలసిన విద్యా విషయిక కార్యక్రమాలను కేంద్రప్రభుత్వం ఎప్పటి కప్పుడు నిపుణులతో చర్చిస్తూ వుంటుంది. కేంద్రస్థాయిన వున్న సలహాల సంఘంకూడా, కొత్తగా అమలు జరిగే కార్యక్రమాలలోని మంచీచెడులను సూచిస్తూ, లోగడ అమలు జరిగిన కార్యక్రమాల ఫలితాలను సమీక్షిస్తూ వుంటుంది కేంద్రంలో వున్న నిపుణులుకూడా దేశంలోని విద్యా పరిస్థితిని ఎప్పటి కప్పుడు సింహావలోకనం చేస్తూ, దానిని ఆధారంగా చేసికొని కొత్త కొత్త మార్పులను చేస్తుంటారు.

రాష్ట్రంలో విద్యారంగంలో ఇటీవలనే ప్రవేశపెట్టబడిన నూతన పథకాల్లో నిర్బంధ ఉచిత విద్యావిధానంకూడా ఒకటి. మునిసిపల్ కార్పొరేషన్, పట్టణాలపురపాలకసంఘాలు, పంచాయతీ బోర్డుల సహకారంతో యీ పథకాన్ని మన ప్రభుత్వం దశలవారీగా

(తరువాయి 58వ పేజీ)

# బాపూజీ గురువులు :

—పాతూరి ప్రసన్నం

శాంతికి 'దూత'గ
జగతికి 'నేత'గ
జాతికి 'పిత'గా
ఖ్యాతిని గాంచిన
మన బాపూజీ
మహాత్ముడండీ !

చిన్న వయస్సున
వెన్న ముద్దలతో
సత్యం, సహనం
నిత్యము నేర్పిరి
'అమ్మ'యు, 'దాది'యు
అమ్మహాత్మునికి !

మంచిని చెప్పే
మతమే అతనిది !
మంచిని వినుటా,
మేలును చేయుట
చెల్లెను అతనికి
ఎల్లప్పుడునూ !

చెప్పెడి దెవ్వరు
అయివుంటేనేం ?
ఒప్పుగ చెబితే
వారే గురువులు !
ఆరీతిగనా
ఆశ్రమంలో
గూటిలో వున్న
కోతుల బొమ్మలు
కూడా బాపుకు
గురువులె అయినవి !

బాలుని వలెనే
వాటిని చూపుచు
బాపూజీ యిట్టుల
పలికే వాడూ !
"చెడ్డ మాటలను
వినవద్దంటూ
చెవులు మూసుకొను
ఒక కోతీ —
కలుషపు మాటలు
పలుక వద్దనుచు
నోరుమూసుకొను
ఒక కోతీ —
చెడు దృశ్యములను
చూడక కన్నులు
మూసుకు మసలును
ఒక కోతీ !"

నోరూ, చెవులూ
కన్నుల నెప్పుడు
సరిగా వాడిన
నరులకు మేలని
కోతి బొమ్మలను
గురువుల చేసిన
బాపూజీ నవ్వుచు
పలికే వాడు !



# ఉండ్రాళ్ళ కథ

—వేటూరి ఆనందమూర్తి

అనగా అనగా ఒక ఊళ్లో ఒక బ్రాహ్మణు డుండేవాడు. ఒకసారి అతడు ప్రక్క ఊళ్లోని స్నేహితుని ఇంటికి భోజనానికి వెళ్లేడు. కడుపునిండా విందు ఆరగించాడు. ఆ విందు భక్ష్యాలలో ఒకటి తాను ఇదివరకు ఎప్పుడూ తినివుండలేదు. దాని పేరు ఏమిటి? అని అడిగితే వాళ్లు "ఉండ్రాళ్ళు" అన్నారు.

సరే ఇంటికి వెళ్ళి భార్యతో చెప్పి చేయించు కొందామని 'ఉండ్రాళ్ళు' – 'ఉండ్రాళ్ళు' అని మరచిపోకుండా అనుకొంటూ తన ఊరికి తిరుగు ప్రయాణం చేశాడు. దారిలో ఒక చిన్న కాలువ దాటవలసి వచ్చింది. ఆ దాట డంలో 'ఉండ్రాళ్ళు' అనుకోవడం మరచి 'హమ్మయ్య' అన్నాడు. అంతే, ఆటు తర్వాత ఇల్లు చేరుకొనేవరకు 'హమ్మయ్యా' 'హమ్మయ్యా' అనుకుంటూనే ఉన్నాడు.



ఇంటికి వెళ్ళి భార్యతో చెప్పాడు 'హమ్మయ్యలు' వండిపెట్టమని. పాపం ఆతని భార్యకి ఈ 'హమ్మయ్యలు' ఏమిటో ఎలా చేస్తారో



తెలియక చేతకాదంది. అంతటితో భర్తకి ఒళ్ళు మండి దుడ్డుకఱ్ఱ తీసుకొని భార్యని చితుక కొట్టాడు. ఆవిడకి ఒళ్ళంతా వాచి పోయింది. ఊళ్ళో వాళ్ళంతా వచ్చారు పరామర్శకి.

"ఏమయ్యా! పాపం, చావగొట్టావు. ఒళ్ళంతా 'ఉండ్రాళ్ళ'కు మల్లే పొంగి



పోయింది!'' అన్నారు వాళ్ళు. 'ఉండ్రాళ్ళు' అనగానే గుర్తుకి వచ్చింది ఆ భర్తకి –

'ఆఁ – అవే – ఉండ్రాళ్ళు–ఉండ్రాళ్ళు– అవి చేసిపెట్టు' అని భార్యతో చెప్పాడు. అప్పుడు భార్యకి అంతా అర్థమైంది. ఉండ్రాళ్లు వండిపెడితే వినాయకుడిలా ఆరగించాడుట ఆ భర్త.

(9వ పేజీ తరువాయి)

రెండవ సమస్య సాధనసంపత్తికి సంబంధించినది. శిక్షణకు, యుద్ధచర్యలకు కూడ మొత్తంమీద సాధనసంపత్తికి కొరత వుండెనని యీ దర్యాప్తు ధ్రువపరచినది మంచిరోడ్లు, యితర రవాణా సౌకర్యాలు లేకపోవడం, మైదానాలనుంచి యెత్తైన పర్వత ప్రాంతాలకు శీఘ్రగతిని సైన్యాలను పంపవలసి రావడంవల్ల పరిస్థితి మరీ కష్టమైనది. శకటాల కొరత, పర్వత ప్రాంతాలలో అవి సరిగా పనిచేయలేక పోవుటవల్ల పరిస్థితి యింకా అధ్వాన్నమై పోయినది.

సాయుధ దళాలలో కమాండ్ పద్ధతి లోపరహితంగా వున్నట్టు దర్యాప్తువల్ల తేలినది. అయితే వివిధస్థాయిలలో బాధ్యత గుర్తింపబడి, పరస్పర విశ్వాసంతో పని చేయవలసిన అవసరం వున్నట్టు భావింపబడింది పెద్ద అధికారులలో వ్యూహరచనకు సంబంధించిన వివరాలలో జోక్యం కలుగ చేసుకొనే అలవాటు ప్రాకినట్టు దర్యాప్తులో తేలినది.

నాలుగవ సమస్య మన సైనికుల శరీర సౌష్ఠవానికి సంబంధించినది. ఈ దర్యాప్తు ప్రకారం, సైనికులు శారీరకంగా వారి మామూలు పనులకు అర్హులై వున్నారు కాని మరీ ఎత్తు ప్రదేశాలలో యుద్ధం చేయడానికి అవసరమైన తర్ఫీదు వారికి లేదు. లడక్‌లో వలె యిట్టి తర్ఫీదు యివ్వబడిన చోట ప్రదేశం యెత్తువల్ల చిక్కు కలగలేదు జూనియర్ ఆఫీసర్ల శరీరసౌష్ఠవం చక్కగా ఉండెను ఇప్పుడు అంతకంటె మెరుగు పడినది కూడ.

తమ క్రింది వారిచే పని చేయించుటలో అన్ని స్థాయిలలోను కమాండర్ల సామర్థ్యం విషయంలో, పెద్ద అధికారులలో తప్ప, లోపాలు లేవని యీ దర్యాప్తువల్ల తేలినది స్థలము, స్థానిక పరిస్థితులకు సంబంధించిన విషయ పరిజ్ఞానము తగినంత చిన్న కమాండర్లకే వుంటుంది. కాని కొందరు పెద్ద కమాండర్లు వీరిపై ఆధారపడవలసినంతగా ఆధారపడలేదు.

ఈ దర్యాప్తులో, పై విషయాలతో పాటు యుద్ధానికి సంబంధించిన యితర ముఖ్య విషయాలు కూడా పరిశీలింపబడినవి (1) వార్తా సౌకర్యాల (2) సిబ్బందిపని కార్యక్రమము (3) యుద్ధ చర్యల 'హయ్యర్ డైరెక్షను' ఈ దర్యాప్తు ప్రకారం సమాచార సేకరణ, వ్యాప్తి మున్నగునవి సంతృప్తికరంగా లేవు. సమాచారం అస్పష్టంగా వుండి కొత్త సైన్యాలు వస్తున్నవో లేక పాత సైన్యాలు కొత్త స్థలాలకు తరలుతున్నవో సరిగా తెలిసేది కాదు. సైనిక దళాలకు అవసరమైన ముఖ్య సమాచారం వడిగా అందింపబడేది కాదు కూడ ఇప్పుడు వార్తా సౌకర్యాల పద్ధతి పూర్తిగా మార్చబడుతున్నది.

అన్ని స్థాయిలలోను సిబ్బంది పని కార్య విధానము స్పష్టంగా వున్నప్పటికీ, సర్వీసెస్ హెడ్ క్వార్టర్సులోను, కమాండ్ హెడ్ క్వార్టర్సులోను, ఆ క్రింద కూడ సాధారణ సిబ్బంది పని, కార్య విధానాలపట్ల తగినంత శ్రద్ధ చూపబడలేదని దరాప్తువల్ల తేలినది

ప్రభుత్వం తన అంగమైన సైన్యానికి సరైన విధానమును తెలియచేసి పెద్ద విషయాలలో ఆదేశాలను యివ్వవలసి వుంటుంది.

లోపాలు వున్నప్పటికీ మన సైన్యం, కష్టభూయిష్టమైన ప్రదేశంలో అత్యధిక సంఖ్యాకులైన శత్రువులను అతి స్వల్ప వ్యవధిలో వీరోచితంగా యెదుర్కొని, తన ప్రతిభను చాటుకొన్నది "ఇప్పుడు మేము అప్రమత్తులమై వున్నాము భావి అవసరాలకు తగినట్టు సంసిద్ధులమవుతున్నాము కూడ. వివిధ లోపాలను, తప్పులను యెత్తి చూపిన యీనివేదిక మనరక్షణ సన్నాహాలను బలపరచుకొనుటకు, అట్టి యుద్ధచర్యలను పటిష్ఠంగా నడుపుకొనుటకు కూడ తోడ్పడగలదు" అని రక్షణమంత్రి ముగించారు.

ఈ విషయంపై లోకసభ, రాజ్యసభలు రెండూ సాధారణ చర్చను జరిపినవి.

రక్షణమంత్రి చెప్పినట్టు, భారత దేశానికి సరిహద్దున కలిగిన పరాజయాలు భారతీయ సైన్యమునకు లేక భారతీయులకు ఓటమి అనటానికి యెంతమాత్రము వీలులేదు అవి, సైనిక పరిస్థితికి సంబంధించిన కొన్ని అంశాలను వెలుగుకి తెచ్చినవి. అవి అంత తీవ్రమైనవి కాకపోయినప్పటికి, మొత్తం మీద మన సామర్థ్యం పెంచుకొనుటకై వాటి విషయంలో తక్షణం శ్రద్ధ గైకొనాలి. దేశ రక్షణ విషయంలో యిక యెట్టి అశ్రద్ధ చేయలేము కాబట్టి యీ నివేదిక పూర్తిగా పరిశీలింపబడి, దానిలో చూపెట్టబడిన లోపాలు తొలగింపబడుట తథ్యము

## పని పరిశీలన

ఢిల్లీ విజ్ఞాన భవన్‌లో పని పరిశీలన సంస్థను ఆరంభిస్తూ ప్రధానమంత్రి ప్రభుత్వ శాఖలు, తదితర రంగాలలో పని ఆలస్యంగా జరగడం శోచనీయమన్నారు. ఈ ఆలస్యాలను తొలగించినట్లయితే పరిపాలనా వ్యవస్థ మొత్తం చక్కబడి సామర్థ్యం పెరగగలదని ఆయన అన్నారు "అవినీతికి మూలకారణం ఆలస్యం ఈ అలస్యం పూర్తిగా తొలగింపబడిననాడు పరిపాలనా వ్యవస్థ యావత్తూ శీఘ్రగతిని మారగలదు" అన్నారు. పని పరిశీలనా పద్ధతులు, ఖర్చు తగ్గించే నిమిత్తం భవనాల నిర్మాణానికి కూడ వర్తింపచేయబడాలి పని పాతపద్ధతుల నంటిపెట్టుకొని వుండటం విచారకరమన్నారు. ప్రజలు సాంప్రదాయ బద్ధులై వుండడం భారతదేశ

పురోగమనానికి మరొక తీవ్రమైన ఆటంక మని ఆయన అభిప్రాయపడ్డారు "మనల నెదుర్కొనే సమస్యల విషయంలో యేక గా డి లో ప ని చే యు ట కా క వాటి పరిష్కారాన్ని గురించి, యెప్పటి కప్పుడు చురుకుగా ఆలోచించాలి. పని పరిశీలన మన కిందుకు తోడ్పడి పాత పద్ధతులనుండి మనకు విముక్తి కలిగిస్తుంది"

### ఉపాధ్యాయి దినోత్సవం

రాష్ట్రపతి రా ధా కృ ష్ణ న్ 75 వ జన్మ దినాన్ని పురస్కరించుకొని దేశమంతటా సెప్టెంబరు 5 న వుపాధ్యాయుల దినోత్సవం జరుపబడినది. జాతి నిర్మాణంలో మిక్కిలి ముఖ్యమైన పనిని తాము నిర్వహిస్తున్నామని వుపాధ్యాయులు గు ర్తిం చా ల ని ఆ సంద ర్భంలో సందేశం యిస్తూ వుపరాష్ట్రపతి డా. జకీర్ హుస్సేన్ వుపాధ్యాయులను కోరారు. భారతీయ వుపాధ్యాయునికి వుపా ధ్యాయవృత్తి విశిష్టత, ప్రాముఖ్యాలను తెలపడానికి ఒక ప్రసిద్ధ వుపాధ్యాయుడు దేశాధిపతి అయినాడనే ఒక్క విషయం చాలు నన్నారు. సంఘాన్ని "అసమర్థులైన స్వార్ధ పరుల మూకగా త యా రు కాకుండగ" కాపాడేది వుపాధ్యాయుడే

### నూతనసమాఖ్య అవతరణ

మలయా, సింగపూర్, ఉత్తరబోర్నియో, సారవాక్‌లతో, సెప్టెంబరు 17 వ తేదీన మలయేషియా, అనే నూతన సమాఖ్య ఏర్ప డింది ఈ సమాఖ్య ఏర్పాటులో ఆదిలో అనేక ఇబ్బందులు ఎదురయ్యాయి. సమాఖ్య అవతరణానంతరం ఇది తీవ్ర ప్రతికూలపరిస్థి తులకు గురికావల్సివచ్చింది ఇండొనీషియా, ఫిలిప్పైన్స్‌లు ఈ నూతన సమాఖ్యను గుర్తించలేదు. జకార్తాలో మలయేషియా వ్యతిరేక ప్రదర్శనలు తీవ్రరూపందాల్చాయి. ఇండొనీషియా ప్రదర్శకులు జకార్తాలోని మలయా, బ్రిటిష్ రాయబారకార్యాలయాలపై దాడులు జరిపారు ఇండొనీషియా, ఫిలిప్పై న్స్‌లతో మలయేషియా దౌత్యసంబంధాలను తెగతెంపులు చేసుకోవలసి వచ్చింది

ఈ నూతన సమాఖ్యలో బోర్నియో ప్రాంతాలు చేరదలచిందీ, లేనిదీ తెలుసుకోవ డానికి ఐక్యరాజ్యసమితి ప్రతినిధులు పరి శీలన జరపాలని ఇండొనీషియా కోరింది ఫిలిప్పైన్స్ దీనితో ఏకీభవించింది. ఇండో నీషియా, బ్రిటిష్ వ్యాపార సంస్థలనుస్వాధీన పరుచుకున్నది ఇండొనీషియా ఈ చర్యను జాతీయీకరణ ధ్యేయంతోగాక ఉత్ప త్తి దృష్ట్యానే తీసుకున్నది.

ఈ లోగా, జపాను మధ్యవర్తిత్వం నెరపగల అవకాశం వున్నట్లు వార్తలు వచ్చాయి మలయాప్రధానమంత్రి ఈమధ్య వర్తిత్వానికి సుముఖంగా వున్నారు. ఐక్య రాజ్య సమితి అధ్వర్యంలో దౌత్య వర్గాల ద్వారాకూడా ఇలాంటి ప్రయత్నాలు జరుగ నున్నట్లు వార్తలు వస్తున్నాయి. వెంటనే ఈ ప్రయత్నాలు ఫలప్రదమయ్యేదీ లేనిదీ ఇప్పుడే చెప్పడం సాధ్యంకాదు అయితే ఈ ప్రయత్నాలు ఫలించవనుకోవడానికి కారణాలేవీ కనిపించడం లేదు.

ఈ పరిస్థితికి సంబంధించిన విచారనీయ మైన అంశం, ఇండోనీషియా ప్రజా సమూ హాల దుష్కృత్యాలు. ఇటీవల అక్కడ అల్లరిమూకల దుశ్చేష్టలు పెచ్చుమీరి పోతు న్నాయి. అమెరికాతోసహా ఇతరదేశాలు ఈ అనుచితమైన చర్యలను తీవ్రంగా గర్హిం చాయి. వీటిని అరికట్టడానికి ఎంతతొందరగా ప్రయత్నిస్తే త త్సం బం ధీ కు లం ద రి కీ ము ఖ్యం గా ఇండొనీషియాకూ అంత శ్రేయస్కరం.

### బ్రహ్మాండమైన ఊరేగింపు

స్వేచ్ఛ, పౌరహక్కుల సాధనకై రెండు లక్షలమంది నీగ్రోలు వాషింగ్టన్ నగరంలో ఇటీవల బ్రహ్మాండమైన ఊరేగింపు ప్రదర్శ నలు జరిపారు. అమెరికా సంయుక్తరాష్ట్రాల లోని అన్ని ప్రాంతాలకు చెందిన నీగ్రోలు ఈ ఊరేగింపులో పాల్గొన్నారు. ఊరేగింపు వాషింగ్టన్ స్మారక చిహ్నం వ ద్ద నుం చి బయలుదేరి అబ్రహాం లింకన్ మెమోరియల్ వరకూ ప్రశాంతంగా సాగింది. నీగ్రోలపట్ల సానుభూతిగల పెక్కురు శ్వేతజాతీయులు కూడా దీనిలో పాల్గొన్నారు. పౌరహక్కుల విషయంలో తమకు జరుగుతున్న అన్యా యాలపట్ల నిరసన సూచకంగా నీగ్రోలు ఈ ఊరేగింపు జరిపారు. కెన్నెడీ ప్రభుత్వం ప్రదర్శకులపట్ల సానుభూతి చూ ప కుం డా వుండలేకపోయింది ప్రస్తుతం అమెరికన్ కాంగ్రెస్ ముందున్న ప్రెసిడెంట్ కెన్నెడీ పౌరహక్కుల బిల్లును దక్షిణ రాష్ట్రాల ప్రతినిధులు తీవ్రంగా ప్ర తి ఘ టిం చ డం ఖాయం కాబట్టి, మానసికంగా అనుకూల వాతావరణాన్ని కల్పించడానికి ఈ ఊరేగింపు ప్రదర్శనలు ఉద్దేశించబడినవి. కాగా ఈ విధమైన వాతావరణం, ఈ బిల్లు కాంగ్రెస్‌చే ఆమోదించబడడానికి దోహదంచేయగలుగు తుంది పౌరసంస్థలలో నీగ్రోల ప్రవేశంపై ఆంక్షలు విధించడాన్ని అంతమొందించడం ఈ బిల్లు లక్ష్యం.

### దక్షిణ వియత్నాం సంఘటనలు

దక్షిణ వియత్నాం ప్రభుత్వం తన కల్లోల చరిత్రలో మిక్కిలి గడ్డు పరిస్థితులను ఎదుర్కొంటున్నది. బౌద్ధమత కార్యకలా పాలపై విధించిన పరిమితులను, ఆంక్షలను తొలగించవలసిందిగా అక్కడి బౌద్ధులు ఆందోళన చేస్తున్నారు డెయిమ్ కాథలిక్ మైనారిటీ ప్రభుత్వం అనుసరిస్తున్న విచక్షణా విధానం పట్ల నిరసనగా ఆరుగురు బౌద్ధ భిక్షువులు అగ్నిజ్వాలలకుఆహుతిఅయ్యారు. బుద్ధజయంత్యుత్సవాల సందర్భంలో బౌద్ధ

(మిగతా 65 వ పేజీలో)

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

ఆగస్టు 21 మెదక్ జిల్లా ఎలమకన్నలో కొత్తగా కట్టిన గ్రామ పంచాయతీ భవనానికి ప్రణాళికామంత్రి ప్రారంభోత్సవం చేశారు

ఆగస్టు 22 కుటుంబ నియంత్రణపై హైదరాబాదులో జరిగిన సమ్మేళనాన్ని గవర్నరు ప్రారంభించారు

ఆగస్టు 27 కర్నూలు పురపాలక సంఘ కార్యాలయ విస్తరీకరణ భవనాలకు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు

ఆగస్టు 28 రంగాపురంవద్ద కృష్ణానదిపై వంతెనకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు కర్నూలువద్ద హంద్రీ నదిపై కొత్తగా నిర్మించిన వంతెనకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు

ఆగస్టు 28 న్యాయ, సమాచారశాఖల మంత్రి జాతీయ సమైక్యతపై హైదరాబాదులో అయిదురోజులపాటు జరిగే వార్తాచిత్రాల ప్రదర్శనను ప్రారంభించారు

ఆగస్టు 29 నౌబత్ పహాడ్ అభివృద్ధి పథకానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు

ఆగస్టు 31 హైదరాబాదు కొత్త మేయరుగా శ్రీ బనారసిలాల్ గుప్త ఎన్నికయ్యారు

సెప్టెంబరు 3 మాజీమంత్రి శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు స్వర్గస్థులయ్యారు

సెప్టెంబరు 6 ఆర్ టి సి ప్రతిపాదించిన బస్సురేట్ల పెంపుదలను రాష్ట్ర ప్రభుత్వం నిరాకరించినట్టు రవాణా శాఖా మంత్రి ప్రకటించారు

సెప్టెంబరు 7 పరిశ్రమలమంత్రి పలూరులోని పరిశ్రమలవాడకు ప్రారంభోత్సవం చేశారు.

సెప్టెంబరు 9 లఘు పరిశ్రమల విస్తరణ శిక్షణకేంద్రం కొత్త భవనాలకు హైదరాబాదులో గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.

సెప్టెంబరు 14 ప్రస్తుతంవున్న సైన్సు సంస్థలతో రాష్ట్ర వ్యాప్తంగా ఒక సైన్సు అకాడమీని ఏర్పాటు చేయడానికి రాష్ట్రప్రభుత్వం నిశ్చయించింది

## భారత దేశంలో

ఆగస్టు 21 బొంబాయిలో పది రోజులపాటు జరిగే పౌరసమ్మెను బొంబాయి మునిసిపల్ మజ్దూర్ సమాఖ్య విరమించింది

ఆగస్టు 22 346-61 ఓట్లతేడాతో లోక్ సభ, ప్రభుత్వంపై తీసుకొచ్చినవిశ్వాస రాహిత్య తీర్మానాన్ని త్రోసిపుచ్చింది.

ఆగస్టు 26 ఉత్పత్తిచేసిన అనేక రకాల వస్తువుల కొనుగోలుకుగాను ఇంగ్లాండు భారతదేశానికి యిచ్చే 13 33 కోట్ల రూపాయల సహాయానికి సంబంధించిన ఒప్పందంపై కొత్త ఢిల్లీలో సంతకాలు జరిగాయి

ఆగస్టు 27 దేశంలో 12 రోజులపాటు అధికార పర్యటన జరిపేందుకు నేపాలు రాజదంపతులు ఢిల్లీవచ్చారు

ఆగస్టు 27 షెడ్యూలు కులాల, షెడ్యూలు తరగతుల కమీషనరు రిపోర్టు విడుదల చేయబడింది.

ఆగస్టు 29 శ్రీ గుల్జారీలాల్ నందాను కేంద్ర హోంమంత్రిగాను, శ్రీ టి టి. కృష్ణమాచారిని ఆర్థికమంత్రిగాను నియమిస్తూ రాష్ట్రపతిభవనం నుండి ఒక ప్రకటన విడుదలైంది

ఆగస్టు 29 ప్రభుత్వ సర్వీసులలో షెడ్యూలు కులాలకు కేటాయించిన ఖాళీలలో వారిని నియమించగా మిగిలిపోయిన స్థానాలకు ఆ అభ్యర్థులు వచ్చేవరకూ అలాగే వుంచివేసే నియమావళి రాజ్యాంగ విరుద్ధమైనదని అత్యధిక మెజారిటీతో సుప్రీంకోర్టు తీర్పు నిచ్చింది

ఆగస్టు 29 కేంద్ర విద్యుచ్ఛక్తి, నీటి పారుదల మంత్రి, నదీజలాల వివాదంపై ఒక కొత్త కమీషనును నియమించే ఆలోచన ప్రభుత్వానికి లేదని ప్రకటించారు.

ఆగస్టు 30 అన్ని రాష్ట్రాల వ్యవసాయ శాఖా మంత్రుల 2 రోజుల సమావేశం కొత్త ఢిల్లీలో నేడు ముగిసింది.

ఆగస్టు 31 వచ్చే సాధారణఎన్నికలలో

ఆయా రాష్ట్రాలలోని విధాన సభ సీట్లను నిర్ణాయక సంఘం నిర్ణయించింది

సెప్టెంబరు 1 కేంద్ర మంత్రివర్గ హోదాలలో ముఖ్య మార్పులను రాష్ట్రపతి ప్రకటించారు

సెప్టెంబరు 2 కాశ్మీరు లోయలో సంభవించిన మున్నెన్నడూ కనీవినీ ఎరుగని భూకంపంలో 100 మందికిపైగా మృతులయ్యారు సుమారు 500 మంది క్షతగాత్రులయ్యారు

సెప్టెంబరు 4 ఈ సంవత్సరం ఆదర్శ ఉపాధ్యాయులుగా ఎన్నిక చేసిన 85 మంది ఉపాధ్యాయుల పేర్లను కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది

సెప్టెంబరు 5 రెండు రోజులపాటు జరిగే అన్ని రాష్ట్రాల సాంఘిక సంక్షేమ కార్యదర్శుల, డైరెక్టర్ల సమావేశం క్రొత్త ఢిల్లీలో ప్రారంభమైంది

## విదేశాలలో

ఆగస్టు 24 బొకారో ఉక్కు కర్మాగారానికి అమెరికా నిధులనుండి ఆర్థిక సహాయాన్ని నిషేధిస్తూ అధ్యక్షుని విదేశీ సహాయ బిల్లుకు అమెరికా ప్రతినిధుల సభ ఒక సవరణను ప్రతిపాదించింది

ఆగస్టు 28 వాషింగ్టన్‌లో అమెరికా వారి 'నీగ్రో స్వాతంత్ర్య ప్రదర్శన' ప్రారంభమైంది

ఆగస్టు 29 అమెరికా సెనేటు విదేశ సంబంధాల సంఘం అణ్వస్త్ర పరీక్షల నిషేధ ఒడంబడికను 16-1 ఓట్ల తేడాతో బలపరిచింది

ఆగస్టు 31 వాషింగ్టన్-మాస్కోల మధ్య 'అత్యవసర వార్తా సంబంధాల'కు ప్రారంభోత్సవం జరిగింది.

సెప్టెంబరు 14 యు ఎన్. ప్రధాన కార్యదర్శి మలయేసియా ఏర్పాటుకు అంగీకరించారు

సెప్టెంబరు 16 క్రొత్త మలయాసియా సమాఖ్య ఏర్పాటైంది ★

(63 వ పేజీ తరువాయి)

మత పతాకాలను నిషేధించడంతో ఈ పరిస్థితి ప్రారంభమైంది. హ్యూనగరంలో స్థానిక ప్రభుత్వం, బౌద్ధమత పతాకాల ఎగురవేతను నిషేధించి వాటి స్థానంలో కాథలిక్ పతాకాలను ప్రతిష్ఠించింది ఈ చర్యను బౌద్ధులు నిరసించినప్పుడు వారిని చెదరగొట్టడానికి బలప్రయోగం చేయబడింది. దక్షిణ వియత్నాంలో అనుసరించబడుతున్న ఈ బౌద్ధ మత వ్యతిరేకచర్యలకు ప్రెసిడెంట్ మరదలు శ్రీమతి నుహు ప్రధానకారకురాలైనట్లు భావించబడుతున్నది.

కమ్యూనిస్టు వియత్‌కాంగ్ గెరిల్లాలను ఎదుర్కొనేందుకు డెయిమ్ ప్రభుత్వానికి సహాయపడడంలో రోజుకు పది లక్షల డాలర్ల చొప్పున ఖర్చు చేస్తున్న అమెరికా కూడా, దక్షిణ వియత్నాంలో తలెత్తిన పరిస్థితుల పట్ల ఏహ్యాభావాన్ని కలిగివుంది. అమెరికా నూతన రాయబారి శ్రీ హెన్రీ కాబట్ లాడ్జ్ దక్షిణ వియత్నాం ప్రభుత్వం, బౌద్ధభిక్షువుల మధ్య శాంతి సంబంధాలను నెలకొల్పడానికి ప్రయత్నాలు చేస్తున్నట్లు తెలుస్తున్నది. దక్షిణ వియత్నాం ప్రస్తుతం అనుసరిస్తున్న విధానం వల్ల ప్రయోజనం కలిగేది వియత్ కాంగ్‌కూ, వారి కమ్యూనిస్టు చైనా మిత్రులకు మాత్రమేనని అమెరికా అభిప్రాయ పడుతున్నది. బౌద్ధులతో సఖ్యత ఏర్పరచుకోవలసిందిగా భారతదేశంతో సహా అనేక దేశాలు దక్షిణ వియత్నాం ప్రభుత్వానికి విజ్ఞప్తిచేశాయి.

**సమీక్ష:**

## కథలు-గేయాలు

రచయిత: పురాణపండ కామేశ్వర్రావు; [ప్రతులకు: పురాణపండ "చిత్ర" విక్రమహాలు - రాజమండ్రి, తూర్పుగోదావరిజిల్లా, పేజీలు 50; వెల రు. 1-25 న.పై]

నీతిబోధకమైన కథల, లయానుగతమైన గేయాల సంకలనమే ఈ సంపుటి ఇందులో పది కథలు, పదిహేడు గేయాలు ఉన్నాయి క్రొత్తలో కలిగే భావాలకు ఏదో రూపకల్పన చేసి, ఒక కథో, ఒక గేయమో రాయాలన్న ఉత్సాహం, ఉబలాటం ఈ రచయితలో ద్యోతకమవుతున్నది రాసిందల్లా పుస్తక రూపంలో సంకలితం కావాలన్న భావనకు కామేశ్వర్రావు కొంత స్వస్తి చెప్పి, మరికొంత పరిశ్రమ చేసి, చక్కని భాషను, ఉదాత్తమమైన భావనలను అలవర్చుకొని ఇతోధికంగా రచనా వ్యాసంగం చేయాలి

"బాసాని"



# "ఆముక్తమాల్యద" కర్త కృష్ణదేవరాయలే !

## గ్రంథసమీక్ష

ఆంధ్ర ప్రబంధ వాఙ్మయంలో ఉత్తమోత్తమ కృతిగా ప్రశస్తికాంచిన ఆముక్తమాల్యద కర్తృత్వాన్ని గురించి దాదాపు అర్ధ శతాబ్దంపాటు చర్చలు జరిగాయి దిగ్గంతులవంటి పండిత విమర్శకులు యీ చర్చల్లో పాల్గొన్నారు తుదకు ఆముక్తమాల్యద కర్త కృష్ణదేవరాయలేనని అల్లసాని పెద్దన కాదని అత్యధిక సంఖ్యాకులు అభిప్రాయపడ్డారు తిరిగి యిప్పుడు సుప్రసిద్ధ విమర్శకులు సాహిత్య వేత్తలు, పరిశోధకులు అయిన శ్రీ దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు ఆముక్తమాల్యద కర్త కృష్ణదేవరాయలే నని 76 పుటలున్న యీ చిరుపొత్తంలో సమృద్ధిగా నిరూపించారు

[ఆంధ్రసాహితీ సార్వభౌముడు- రచన-శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి- పుటలు 76-వెల రు.1-15-ప్రతులకు- తెంకణ గ్రంథమాల - ఉలవపాడు- నెల్లూరుజిల్లా.]

కీర్తిశేషులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారన్నట్లు ఏదో ఒక కొత్తదనం విశిష్టత చూపనిదే శ్రీ వెంకట కృష్ణారెడ్డి గారు రచన చేయరు. కవి శ్రీ కృష్ణదేవరాయలు-అవతారిక-అవతారములు ఆంతరంగికములు - ఔచిత్యము — అన్న ఐదు ప్రకరణాలుగాఉన్న యీ గ్రంథంలో ఆముక్తమాల్యద కర్త పెద్దన్న యేనన్న వాదాని కాధారమైన వివిధ విషయాలను తులనాత్మకమైన పరిశీలనంతో త్రోసిరాజన్నారు. గ్రంథ ఆంతరంగికమైన విషయ పరిశీలన మాట అటుంచి కాలక్రమ దోషయుక్తాలైన మనుచరిత్ర అవతారిక పద్యాలను అంతకు పూర్వమే రచితమైనఆముక్తమాల్యదలో చేర్చారన్న చారిత్రక సత్యాన్ని ఆవిష్కరించడం శ్రీ రెడ్డిగారి సూక్ష్మాతిసూక్ష్మమైన పరిశీలనా శక్తిని ప్రతిబింబిస్తున్నది,

అసలు "ఆముక్తమాల్యద" కర్త పెద్దనే అన్న వాదానికి మూలకందంగా- ఆముక్తమాల్యద అవతారికలోనే కొట్టవచ్చినట్లు కనిపిస్తున్న ఒక నగ్న సత్యాన్ని యింతవరకూ యిన్నిన్ని వాదోపవాదాలు సాగినా యెవ్వరూ తిన్నగా గుర్తించక పోవడం ఆశ్చర్యకరమైన విషయం

శ్రీ కృష్ణ దేవ రాయ లు తాను

| సమీక్ష |
|---|
| వాఙ్మయమహోధ్యక్ష |

కలగాంచిన విషయం నిండోలగంలో వివరిస్తాడు అప్పుడు కొందరు పండిత కవులు "ఆముక్తమాల్యద రచించవలసినదిగా" అర్థిస్తారు ఈ అభ్యర్థన మామూలు సంభాషణా పూర్వకమైన మాటల్లో జరిగినట్లు కనిపించదు గండపెండేర బహూకరణ సందర్భంగా జరిగినట్లు కవితారూపంగానే జరిగినట్లు కనిపిస్తున్నది. కాగా ఆముక్తమాల్యద అవతారికలో 18వ దైన "నిండోలగంబుండి" ఇత్యాదిగా గల వచనంలో "దేవా! దేవ దేవుండు విజయంబుఁ జేసిన" అన్న వాక్యం మొదలుకొని (అవతారికలో) 44వ పద్యమైన "ప్రజల రాజాధిరాజ" ఇత్యాది పద్యంలో "కృతివినిర్మింపుము" (అనిరి!) అన్నంతవరకూ ఉన్న పద్యాలు ఆనాడు నిండోలగంలో పెద్దనాది మహాకవులు ఆశువుగా చెప్పిన పద్యాలుగా విస్పష్టంగాగోచరిస్తున్నాయి "వారును విస్మయస్వాంతులయి" అన్న మాటల తర్వాత కృష్ణదేవరాయ వంశ వర్ణనాది విషయాలతో కూడిన — పద్యాలన్నీ తాను వ్రాసినవి కావని వారు చెప్పిన వాటినే తాను ఉటంకిస్తున్నానని స్పష్టంగా పేర్కొనకపోయినా పేర్కొంటున్నట్లుగా "కృష్ణరాయేంద్ర కృతి వినిర్మింపుము" అనిరి అని యెలుగెత్తి "అను" ధాతు భూతార్థక ప్రయోగంతో పేర్కొని వారావిధంగా అంటే తాను సంతోషించినట్లు కూడా "అని విన్నవించినఁ బ్రహృష్టాంతరంగుండనై" అని వక్కాణించాడు-కాగా "దేవా! దేవ దేవుండు" మొదలుకొని (18 వచనం) 44వ పద్యంలోని" "కృతివినిర్మింపుము" వరకూ అది పెద్దనాదుల విన్నపంగా వారివారి నోటివెంట ఆశువుగా అవతరించిన గద్య పద్యాలేనని చెప్పవచ్చును. వాటికర్త కృష్ణరాయలు కాడన్నంత మాత్రాన కృతికర్తృత్వానికి వచ్చే భంగమేమీలేదు,

"కృష్ణరాయేంద్ర కృతివినిర్మింపుము" అని పద్యం పూర్తి కాకుండానే- (ఆశువుగా చెప్పిన కవి) చెప్పాడని అంటారా అని యెవరైనా ప్రశ్నించవచ్చును-ఆ విధంగా అసంపూర్తిగా ఆ కవి చెప్పి ఉండకపోవచ్చును."వినిర్మింపు

